# మాలతీమాధవము

మహాకవి భవభూతి విరచిత సంస్కృతమునుండి


కైలాసవా[illegible]

జనమంచి వేంకటరా[illegible]


ఆంధ్రీకరించినది




జనమంచివారు

రాజమహేంద్రవరము

౧౯౩౬


ఒక రూపాయ పావలా.

# మాలతీమాధవము

మహాకవి భవభూతి విరచిత సంస్కృతమునుండి

కైలాసవాసి

జనమంచి వేంకటరామయ్య

ఆంధ్రీకరించినది.

ప్రకాశకులు

జనమంచివారు

రాజమహేంద్రవరము

*Prescribed as a Text for the B. A. degree Examination of the Andhra University 1936—38 Vide Ft. St. George Gazettee Part I-B dated 24-12-1935 Page 734.*

ద్వితీయ ముద్రణము

౧౯౩౬

వెల

౧.౪ రూపాయ

# ఈ నాటకమందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

**మాధవుఁడు:**—విదర్భరాజు మంత్రియైన దేవరాతుని పుత్త్రుఁడు, మాలతికిఁ బ్రియుఁడు—కథానాయకుఁడు.

**మకరందుఁడు:**—మాధవునికి బాలమిత్త్రుఁడును సహచరుఁడునై; మదయంతికకుఁ బ్రియుఁడు.

**కలహంసుఁడు:**—మాధవుని సేవకుఁడు, మందారికకుఁ బ్రియుఁడు.

**అఘోరఘంటుఁడు:**—ఒక కాపాలికుఁడు.

## స్త్రీలు.

**మాలతి:**—పద్మావతీశ్వరుని మంత్రియైన భూరివసువు కూఁతురు. మాధవునకు వల్లభురాలు. కథానాయిక.

**మదయంతిక:**—మకరందునికిఁ బ్రియురాలు—పద్మావతీశ్వరుని వేడుక చెలికాఁడైన నందనుని చెల్లెలు.

**లవంగిక:**—మాలతికి దాదికూఁతురు.

**కామందకి:**—వృద్ధబౌద్ధయోగిని.

**బుద్ధరక్షిత**<br>**అవలోకిత** — కామందకియొక్క శిష్యురాండ్రు.<br>**సౌదామిని**

**కపాలకుండల:**—అఘోరఘంటుని శిష్యురాలు.

**మందారిక:**—కలహంసుఁ డుంచుకొన్న విహారదాసి.

వీరుగాక పురుషుఁడు, ప్రతీహారి మొదలయినవారు.

# పీఠిక

—:O:—

మాలతీమాధవమను నీ ప్రకరణ మిప్పటి కించుమించుగాఁ బండ్రెండువందల యేండ్లక్రిందట సంస్కృతభాషలో భవభూతియను మహాకవిచే విరచింపఁబడినది. ఈ కవి జన్మభూమి దక్షిణాపథము (Deccan) నందలి పద్మపురము. ఇతఁడు కాశ్యపస గోత్రుఁడైన యుదుంబర బ్రాహ్మణుఁడు; శుక్లయజుర్వేది; యితని తాత భట్టగోపాలుఁడు; తండ్రి నీలకంఠుఁడు; తల్లి జతుకర్ణి; జ్ఞాననిధ్యాచార్యు లితని గురువు. ఈతనికిఁ గవితాప్రావీణ్యమునుబట్టి శ్రీకంఠుఁడని బిరుదనామమే కాక తర్కవ్యాకరణమీమాంసా శాస్త్రములయందలి సర్వంకషవైదుష్యమునుబట్టి పదవాక్యప్రమాణజ్ఞుఁడని ప్రఖ్యాతియుఁ గలిగెను. ప్రస్తావనమందలి యేడవపద్యమునుబట్టియు, సాధారణముగానే తత్కవికృతము లని పండితులచేఁ జదువఁబడు "హఠాదాకృష్టానాం కతిపయపదానాంరచయితా &c., నాస్మాకంశిబికానకాపికటకాద్యాలంక్రియాసత్క్రియా &c., నాసీయం తేమధునిమఘుపాఃపారిజాతఃప్రసూనైః &c.," ఇత్యాది శ్లోకములనుబట్టియు నీ మహాకవి స్వోత్కర్షము కలవాఁడని స్ఫురించుచున్నది.

ఈ కవికి జన్మభూమియని పైఁ జెప్పఁబడిన పద్మపుర మిప్పుడు 'బిరారు' లేక 'బీదరు' అని వ్యవహరింపఁబడెడు విదర్భదేశములో నిద్దై యుండవలెను. అందుకు నిదర్శనముగా నీ కవి యిందలి నవమాంకములోను ఉత్తరరామచరిత్ర మధ్యమాంకములోను జూపిన తత్ప్రదేశనగరగిరిసరిదరణ్యాదివిషయికమైన ప్రకృతివర్ణనాసామర్థ్య మనన్యసామాన్యముగా నున్నది. అట్టిసామర్థ్య మెంతటిమహాకవులకైనను వస్తువులతోడి ప్రత్యక్షపరిచయమువలనఁ గలుగవలసినదే కాని కేవల కల్పనైక సాధ్యము కానేరదు.

ఇంతవఱకు కవియొక్క కులగోత్రాదులను దెలిసికొనుట కతఁడు రచియించిన నాటకములును వానిప్రస్తావనలును నాధారకము లయినవి. కాని ఇతని కాలమును నిర్ణయించుటకు సాధనాంతరము లపేక్షణీయములై యున్నవి. భోజరాజున కవ్యవహితముగా వెనుకఁ బరిపాలించిన ముంజరాజు కాలములో అనఁగా క్రీ. శ. పదునొకండవ శతాబ్దములోఁ దదాస్థానకవియగు ధనికునిచే రచింపఁబడిన దశరూపకమనునాటకలక్షణగ్రంథమందు మాలతీమాధవాదులలోని శ్లోకములుదాహరింపఁబడుటచే భవభూతి పదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వకుఁడని స్పష్టపడుచున్నది. ఇంక నే శతాబ్దమున కెంతపూర్వుఁడో యనునంశము విచారింపవలసియున్నది. అందున కాధారము లేకపోలేదు. భవభూతి, క్రీ. శ. ౭౨౦ సంవత్సరమునకు ముందో వెనుకనో పాంచాల (Kanouj) దేశమును బరిపాలించిన యశోవర్మయొక్క యాస్థానకవిగా నుండినట్లు కాశ్మీర దేశ చరిత్రమువల్లఁ దెలియుచున్నది. కాఁబట్టి యితఁడు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దమం దుండుటె సిద్ధాంతము. ఈ కవికాల మదియే యనుటకు ఈ నాటకమే కొంతవఱకు సాక్ష్య మిచ్చుచున్నది. ఇందు రాణివాసపుస్త్రీలు మహమ్మదీయుల ధూర్తవ్యాపారములవలని భయమునుగాని నిర్బంధమునుగాని యెఱుఁగనివారై తమ యిచ్ఛవచ్చినచోటుల స్వైరముగా విహరించు వాడుకగలవారుగఁ జెప్పఁబడినారు. ఆ కాలము మహమ్మదీయుల దండయాత్రలతోను హిందువుల పరాభవములతోను నిండిపోయిన 10–11 శతాబ్దములకంటెఁ బూర్వకాలమే కాకపోయినయెడల భవభూతి యంతఃపురకాంతల కింత స్వాతంత్ర్యమునే యిచ్చియుండఁడు. ఇందు సూచింపఁబడిన యాచారవ్యవహారములుకూడ విదేశీయ సంపర్కమును బొరయనివిగా నున్నవి. మఱియు బౌద్ధపరివ్రాజికలచేత నంతఃపురస్త్రీలకు సంగీతాదికళలు నేర్పించువాడుకయు కాపాలిక

మతస్థులు శక్తికి నరబలులు సమర్పించు నాచారమును యోగాభ్యాస శివలింగపూజా పారిచర్యమును ఇవియన్నియుఁ బూర్వోక్తకాలలక్షణములుగానే యెన్నఁదగియున్నవి.

కథాసంగ్రహము

పూర్వము విదర్భరాజు మంత్రి దేవరాతుఁడును పద్మావతీశ్వరుని మంత్రి భూరివసువును కామందకి యను బౌద్ధయోగినియు నొకే గురువునొద్ద విద్యాభ్యాసము చేయుచున్నకాలమందుఁ బూర్వోక్త మంత్రులిరువురును చేతఁ జేయివైచుకొని "మనమవశ్యము వియ్యమందవలయును" అని కామందకియుఁ దచ్ఛిష్యురాలు సౌదామినియుఁ జూచుచుండఁగాఁ బ్రమాణము చేసికొనిరి. ఆ వెనుకఁ గొన్నాళ్ళకు దేవరాతుఁడు కుండినపురము (కొండవీటి) నుండి పద్మావతీ పురమునకు నీతిశాస్త్రమును జదివించుకొనుటకుఁ దనకుమారుని మాధవునిఁ దద్బాలమిత్రుఁడైన మకరందునితోఁ గూడఁ బంపెను. ఆ కాలమందు మాలతి

ఉ. చూరులమెత్తు మేడపయి ♦ సోరణగండి వసించియుండి యా
చేరువ రాజమార్గమునఁ ♦ జీటికిమాటికిఁ బోవువాని సా
కారతఁ బొల్చు కామురతి ♦ కైవడి మాధవుఁ జూచిచూచి తాఁ
గోరిక లూరఁ దాపమునఁ ♦ గుందికృశింపఁగఁ జేయు నంగముల్.

అన్నట్లుగా నుండి యుబుసుపోకకై యాతని యాకృతి లిఖించి చిత్తరువును దన ప్రియసఖియైన లవంగికకిచ్చెను. అదియును మాధవానుచరుఁడైన కలహంసుని ప్రియురాలగు మందారికచేతికిచ్చెను. ఆ మందారికయు నా చిత్రపటమును దనప్రియుఁడు దొంగిలిపోఁగాఁ దిరుగఁ దెచ్చుకొందునని బైలుదేఱి వచ్చి కామోద్యానములో నొక్కెడిక్కున మాధవునిం జూచెను. అప్పు డతఁడు నాఁటియుదయమే యందలి

కామాలయమునొద్ద సఖజన సమేతురాలయి కామోత్సవమును నిర్వర్తించుటకై వచ్చియుండిన మాలతినిం జూచి మనసువడ్డవాఁ డగుటచేతఁ, దా నొకచెట్టునీడను నడుమనడుమను బొగడదండఁ గ్రుచ్చుచున్నట్లుండి మాలతినిం జూచుటయుఁ దన్ను మాలతి నూచుటయుఁ దాఁ గూర్చినమాలికను మాలతి కింపుగా నుండునని లవంగిక వచ్చి తెన్నడిగి పుచ్చుకొని చనుటయు మొదలుగాఁగల యచ్చటి ముచ్చటలన్నియుఁ బూసగుచ్చినవడువునఁ గలహంసమకరందులతో నచ్చిక మచ్చికగాఁ జెప్పుచుఁ బొద్దు పుచ్చుచుండెను. ఈసమయమున మందారిక వారిం జూచి నమస్కరించి 'నాచిత్రపటమునిమ్మ'ని కలహంసు నడుగఁగా వాఁడును "ఇదిగోఁ బుచ్చుకొమ్మ"ని యామెచేతి కంతకు ముందే మకరందప్రేరణమున మాధవుఁడు లిఖించిన మాలతీరూపము నిచ్చెను. మందారికయుఁ జిత్రపటముతోఁ బాటు దానిభావమును గూడ గ్రహించి వీడ్కొని యా వస్తువును లవంగికచేతి కిచ్చెను. అంతట లవంగిక యీ చిత్రపటమును ఆ వకుళమాలికను మాలతి కిచ్చి యింక మాధవానురాగము విషయమున సంశయింపఁ బనిలేదని యామెతోఁ జెప్పెను. మాలతి యా రెంటినిఁ బ్రాణపదముగా ధరించెను. కాని రాజనిర్బంధముచేఁ దండ్రి తన్ను రాజుగారి వేడుకచెలికాఁడగునందను కిచ్చి పెండ్లిచేయుట కియ్యకొన్నాఁడని వినియున్నదగుటచే నామెకు లవంగిక చూపిన యనురాగచిహ్నములవలనను చెప్పిన యాశ్వాసవచనములవల్లను నూఱట గలుగుటకుమారుగా నారటమే యెక్కువ కాఁజొచ్చెను. తనతండ్రికి నిజముగా నట్టియుద్దేశము లేదనియు, నతఁడు రాజుగారి ముఖప్రీతికొఱ కట్లు సమ్మతించెననియుఁ, దన్నుఁ గాదని స్వతంత్రించి తనకూఁతురు రహస్యముగా మాధవుని వివాహమాడినఁ దన కేనిందయు లేకుండును గావున నట్టి సంధానము చేయుమని తన స్నేహితురాలగు కామందకితోఁ జెప్పి

యుండెననియు, మాలతికిఁ దెలియనే తెలియదు. ఈస్థితిలో నుండఁగా నామెయొద్దకుఁ గామందకి వచ్చి తన వాక్చాతుర్యముచే మాలతికిఁ దండ్రియెడల ననూయయు, మాధవునియం దనురాగమును, నందనుని యం దరుచియుఁ, దనయెడలఁ బరమవిశ్వాసమును వృద్ధిచేసెను.

ఇట్లు మాలతినిఁ దనకు వశవర్తినిఁగా దిద్దుకొని కామందకి యొక్కనాఁ డామెను లవంగికాసహితముగాఁ బూలుగోయించు నెపమునఁ గుసుమాకరోద్యానమునకుఁ దీసికొని వచ్చెను. మాధవుఁడును అంతకుముందే యామె ప్రేరేపణముచే నక్కడ నొక్కపూఁబొదరింట నిగూఢముగా వసించియుండెను. గానఁ గొంత పరస్పరానురాగసూచకటల నైనతరువాత వా రిరువురును నొండొరులం జూచుకొఁ గలిగిరి.

'నేఁడు మకరందునిఁ బరిత్యక్తముగాఁ జూతువుగాని రమ్మ'ని బుద్ధరక్షిత తన్నుఁ బురికొల్పఁగా మంచిదని యామెను వెంటఁబెట్టుకొని మదయంతిక పైఁజెప్పిన తోఁటలోనికి వచ్చుచుండఁగాఁ ద్రోవలోఁ బెద్దపులి యొకటి యామెను బట్టుకొనెను. అప్పుడక్కడకే వయస్యనై వచ్చుచున్న మకరందుఁ డా వ్యాఘ్రమును సంహరించి మదయంతికను గాపాడెనుగాని పులిగొట్టిన మిమ్మరపుదెబ్బలకు సొమ్మసిల్లెను. చేరువనున్న మాధవుఁ డీ వృత్తాంతమును విని మిత్రునియవస్థను గని తాను గూడ మూర్ఛఁ జెందెను. అంతట వారిరువురును క్రమముగా మదయంతికామాలతులు గావించిన యుపచారములచేఁ దెలివి నొందఁగా మాధవుఁడు కామందకియుపదేశము ననుసరించి తన హృదయమును జీవితమును మాలతికిఁ గృతజ్ఞతాపూర్వకమైన పారితోషికముగా నొసంగెను. ఆ క్షణమునందు నగరమునుండి యొకపురుషుఁడు వచ్చి రాజుగారు స్వయముగానే మాలతిని నందనున కనుగ్రహించినారన్న సంతోషవార్తను మదయంతికతోఁ జెప్పి యామెను బుద్ధరక్షితానమే

తముగా వెంటఁబెట్టుకొని వెళ్ళెను. పిడుగువంటి యీవార్త చెవినిఁ బడఁగానే మాలతీమాధవు లిరువురును నిశ్చేష్టులయి సకరుణానురాగముగా నొండొరులం జూచుకొని తమ కెంతధైర్యము చెప్పినను కామందకిమాటయెడ నమ్మకములేక నిరాశులయి తమ సహచరులతో నిజనివాసములకు వెడలిపోయిరి.

మంత్రసిద్ధిఁ బొందినవెనుకఁ గులరూపగుణసమన్వితయగు నొకకన్యకను దేవికి బలియిత్తునని మొక్కుకొని యా నగరిశ్మశానవాటముచేరువను గరాళశక్తిగుడిలో నఘోరఘంటుఁ డనుకాపాలికుఁ డొకఁడు మంత్రపురశ్చరణము చేయుచుండెను. ఆ యుద్దేశము ననుసరించి యప్పు డాతనిశిష్యురా లగుకపాలకుండల, దుఃఖవివశయై మేడమీఁద నిద్రించుచుండిన మాలతి నాకాశమార్గమునఁ దీసికొనివచ్చి తన గురువునకు సమర్పింప నతఁ డామెను బలిపెట్ట నమకట్టెను. కాని యప్పు డభీష్టసిద్ధికొఱకు శ్మశానవాటములోఁ బిశాచకోటికి మహామాంస మమ్ముచు సన్నిహితుఁడైన మాధవుఁడు 'హా మాధవ!' యను నాఁడుకూయి విని యాలయములోనికిం జని యఘోరఘంటుని సంహరించి వధ్యశిలపై బలివేషధారిణియై యున్న తన ప్రియురాలిం గాపాడి యామెను దిరుగ బంధుజనులయొద్దకుం బంపెను.

ఇదివఱకయిన యేర్పాటుచొప్పున నందనున కిప్పుడు మాలతి నిచ్చి పెండ్లిచేయవలయును గావున సుముహూర్తమునకుముం దామెను గౌరీపూజార్థ మమ్మవారి యాలయమునకుఁ గామందకీలవంగికాసహితముగాఁ బంపిరి. వీరు మువ్వురును మంగళవాద్యములతో నూరేగి వచ్చి యాలయముం బ్రవేశింపకముందే మాధవుఁ డందు మకరందసమేతముగాఁ జొచ్చి యొకస్తంభముచాటున నిల్చి వారు వచ్చిన వెనుక లవంగికామాలతుల విస్రంభాలాపములను విని యానందించుచుండెను. ఇట్లుండఁగా నప్పుడు మాలతి పువ్వులనక పూజయనక

గోలుగోలున నేడ్చుచు లవంగిక కాళ్ళమీఁదఁ బడి "చెలీ! నేను బ్రదుకఁజాలను. నాకుఁ జావ నవశ్యమయ్యె"నని యామెయు బదింబదిగఁ బ్రార్థించెను. లవంగికయు స్తంభముచాటున నున్న మాధవునికి సైగ చేయఁగా నాతఁడు వచ్చి దానిస్థానమునఁ గూర్చుండి దానిమాటలుగానే "చెలీ! నే నెంత చెప్పినను వినకున్నదానవు. ముందు నన్నొక్కసారి కౌఁగిలించుకొని పిమ్మట నీ యిష్టమువచ్చినట్లు చేయుము" అనెను. అనఁగానే యపరిమితానందము నొంది కన్నుల నీరుగ్రమ్ముటచే నతనిని లవంగికఁగా భావించి కౌఁగిలించి యాతనితోఁ దన గొడవయంతయు వెడలఁబోసికొని కడపట "ఇదిగో నిది మాధవస్వామి స్వహస్తములతో నిర్మించి యిచ్చిన వకుళపుష్పమాలిక. దీనిని నీవు మాలతినివలెనే హృదయమందు ధరింపఁదగ్గది" అని తనకంఠమునుండి తీసి యాతని హృదయమందు వకుళమాలిక నుంచుచుఁ జప్పునఁ దొలఁగి భయోత్కంపితయై లవంగిక చేసినమోసముగదా యని సిగ్గుపడి యూరకుండెను. అంతలో నాలయములోపలనుండి కామందకి వచ్చి యామెను బుజ్జగించి బుద్ధిచెప్పి మాధవునిచే నామెకుఁ బాణిగ్రహణము చేయించెను. మఱియు నంతకుముందు దేవతాసన్నిధానమందు మాలతి నలంకరించుటకై రాజుగారిచేఁ బంపఁబడిన వస్త్రాలంకారములతో మకరందునికి మాలతీవేషము వేయించి యాతనిని లవంగికాసహితముగా వెంటఁబెట్టుకొని వెడలి మంత్రిగారి లోఁగిటిలో నందుననకుఁ బెండ్లిచేయించెను. మాలతీమాధవులును కామందకి సెలవుచొప్పున మదయంతికామకరందుల రాకను బ్రతీక్షించుచు నా చేరువ నొక్కయుద్యానవనములో నవలోకితసహాయులై యుండిరి.

ఈ యబద్ధపుఁబెండ్లికై దుదినములు కావలసివచ్చెనో లేక నందనమంత్రి కొకనాఁటిపెండ్లికే మొకమంతయుఁ గాటుక యయ్యెనో మనము నిశ్చయముగాఁ జెప్పఁజాలము కాని వివాహాదికము ముగియఁ

గానే పెండ్లికూఁతు నత్తవారింటికి గృహప్రవేశము నిమిత్తము దీసి కొని వెడలినారనిమాత్రము చెప్పఁగలము. ఇది రజస్వలావివాహము గనుకఁ గంకణమోక్షణమయిన వెనుక వధూవరుల నచ్చటనే యేకన య్యాగతులం జేసిరి. అప్పుడు కామోద్రేకమునే నందనుఁడు మాలతీ వేషధారియైన మకరందుని కాళ్ళమీఁదఁ బడి యాదువలనఁ గార్యము గానక బలాత్కారమునకుఁ బూని తిరస్కృతుఁడై తిట్టుచుఁ దిమ్ముచుఁ బడకిల్లు విడిచి యవలికి లేచిపోయెను. అంతటఁ దన మాయవదినగా రిని మందలింతునని మదయంతిక బుద్ధరక్షితాసహితముగా వాసభవ నముం జొచ్చి యచ్చట మంచముమీఁద ముసుఁగిడి నిద్రించుచున్న కృత్రిమ మాలతినిఁ ప్రబోధింపఁబోయి దాపునఁ గూర్చున్న లవంగి కచే నివారితురాలై యామె కోరినవెనుకఁ దానుగూడఁ బానుపు మీఁదఁ గూర్చుండెను. కూర్చుండి కొంతసేపు మాలతి మంకుతన మును గూర్చియుఁ, గొంతసేపన్నగారి యవివేకమునుగూర్చియు మఱి కొంచెముసేపు మకరందునియెడఁ దనకుఁ గల యనురాగమునుగూ ర్చియు ముచ్చటించి యంతట రాత్రి రెండుయామములు కాఁగా "నందనుసేఁ గాలుసేతులు వట్టి బ్రతిమాలి తోడుకొనివచ్చెద"నని లేవఁబోయెను. అప్పుడు మకరందుఁడు ముసుఁగులోనుండి కదలి లేచి, తన్నుఁ జూచి భయోత్కంపితురాలయిన మదయంతికను జేతితోఁబట్టు కొని యామెను బుద్ధరక్షితవచనము ననుసరించి భార్యగా స్వీకరించి యప్పుడే మాలతీమాధవు లున్నయుద్యానమునుగూర్చి ప్రియురా లితోఁగూడ బైలువెడలెను. కాని త్రోవలో నగరరక్షకులు తన్ను నిరోధింపఁగా వెంటనున్న స్త్రీజనమును, అంతకుముందే తమ సమా చారమును తెలిసికొనుటకై మాధవుఁడు పంపఁగా బయలువెడలి సమ యమునకు సన్నిహితుఁడైన కలహంసునితోఁ బంపివేసి తానుమాత్ర మసహాయుఁడై నగరరక్షకులతో యుద్ధము చేయుచుండెను.

అక్కడ నుద్యానవనములో మాలతీమాధవు లిరువురును అవలోకితాసహాయులై మదయంతికామకరందుల రాకను బ్రతీక్షించుచున్నారని యీవఱకే తెలిపియుంటిమిగదా! ఇప్పుడు తత్తఱపాటుతో గలహంసుఁ డాఁడువాండ్రను వెంట బెట్టుకొని వచ్చుచుండుటకు దూరమునుండి చూచి మాలతి యపరిమితసంతోషములో "నాధా! మదయంతిక లభించినదినుఁడీ!" యన్న సంతోషవార్తను మాధవునకు ముందుముందు నివేదించెను. అప్పుడు మాధవుఁ డామెను గాఁగిలించి పారితోషికముగాఁ దన మెడనున్న పొగడదండను దీసి యామె కంఠమున వైచెను. అంతలోఁ గలహంసుఁడు సవిస్తరముగాఁ బ్రవేశించి యచ్చటి వృత్తాంతమంతయుఁ జెప్పఁగా విని మాధవుఁడు మిత్రునకుఁ దోడ్పడుదునని యాక్షణమే పరుగుపరుగున శత్రుసేనలో వెళ్లి పడి తమ్ముఁ బోరవచ్చిన పారక్యబలములనెల్ల మకరందసమేతుఁడై నఱకి నుఱుమాడెను. అప్పుడు రాజుగారు వారి యసహాయశూరత్వమునకు మిగుల సంతసించి వారిపైఁ గోప ముడిగి నడచినవృత్తాంతమంతయు నడిగి తెలిసికొని భూరివసునందనుల రావించి "వీరు మీ యల్లుఁడును, బావమఱఁదియు" నని చెప్పి యొప్పించి కలహము సమాప్తినొందించెను. అటుపిమ్మట మాధవమకరందులు తమ ప్రియురాండ్రం గలసికొందుమన్న యెక్కుడు తమకములో నుద్యానమునకు వచ్చి యచ్చట మాలతినిఁగాని, యందుఁ దమఁ బ్రియసఖిని వెదకుచుండిన లవంగికామదయంతికలవలన నామె వార్తనుగాని కానక విలపించుచు నామెకుఁబాసి నలువురలోఁ దలయెత్తుకొని తిరుగ నోడి యడవిం బడి పిచ్చివాండ్రవలెఁ దిరుగుచుండి తుదకు బ్రదుకుమీఁది యాసను గోసివేసి చావ నుద్యుక్తులై యుండిరి. ఆ సమయమందు సౌదామిని శ్రీశైలమునుండి మాలతి యిచ్చిన పొగడపూలదండ నానవాలుగొని యచ్చటకు వచ్చి యంగమచ్చమును జూచి యామె క్షేమవార్తను దెలిపి వారిం గాపాడెను.

సౌదామిని వచ్చుటెట్లు? పోగడదండ నిచ్చుటెట్లు! మకరందునకు బాసటయగుదునని మాధవుఁ డా ప్రాకార ముద్యానవనమును వెడలిపోఁగానే మాలతి తనచుట్టు నున్న పరివారము నయ్యైపనులమీఁద నక్కడక్కడకుఁ బంపివేసి కలహపర్యవసాన మెట్లుండునో యన్న యారాటముచే నేమియుఁ దోఁచక పరధ్యానముతో దగ్గఱనున్న మదయంతికకుఁ గూడ నెడమయి యొంటిగ నుండెను. అప్పు డఘోరఘంటునిఁ జంపినంతటనుండియు మాధవుని కపకారము చేయవలెనని సమయమునకొఱకు నెదురుచూచుచుండిన కపాలకుండల, యాకాశమార్గమున రింగున డేగవలె వచ్చి పయిఁబడి మాలతి నవ్వెత్తుగఁ గొని శ్రీశైలమున కేగెను. కాని దాని దుర్వ్యవసాయము కొనసాఁగక మునుపే యం దదృష్టవశమునఁ గాపాలికవేషము ధరించుచుండిన సౌదామిని యను కామందకి శిష్యురాలు దాని సదలించి మాలతిని వదలించి యామె యిచ్చిన వకుళమాలికను దెచ్చి పైఁ జెప్పినతీరుగా మాధవమకరందులను శోచనీయమైన బలవన్మరణమునుండి తప్పించి, యా పయిని మాధవునిచే మాలతినిఁ దెప్పించి, యా పిమ్మట నందనునిచే లిఖితపూర్వకముగా మదయంతికా మకరందుల వివాహమున కొప్పించి యిల్లిల్లవారికి నపరిమితమైన యానందమును గలిగించెను.

ఈ మాలతీమాధవముయొక్క కథాబీజము బృహత్కథనుండి కైకొనఁబడెననియు, అదియే యీ తీరుగా విస్తరింపఁబడినదనియుఁ గొన్నాళ్ళకుముం దీనాటకమునే తెనిఁగించిన మ - రా - శ్రీ, దాసు శ్రీరాములుగారు తమ పీఠికలో వ్రాయించియున్నారు. ఉత్తరరామచరిత్ర రచియించుటచేఁ గాళిదాసుకంటెను ఎక్కువవాఁడని ఖ్యాతికెక్కిన భవభూతివంటి మహాకవియొక్క కవితాపటిమనుగాని రచనావైదగ్ధ్యమునుగాని నాబోటి యల్పజ్ఞుఁడు విమర్శింపఁ బూనుకొనుట కేవలసాహసకృత్యము. నిశ్చయముగా నాంధ్రీకరింపఁ బూనుకొనుటకం

టను ఎక్కువ సాహసకృత్యము. అయినను ఈ నాటకము సర్వసుర్య ముగాఁ జదువువారి కందలి కథాసంవిధానముయొక్క జిగిబిగి మొదటి యొనిమిదంకములవఱకును బహుచమత్కారముగాను, అద్భుతావహముగాను వృద్ధినొందినట్లు కనఁబడి తరువాతి యంకములలోనికిఁ బోవునప్పటికిఁ గొంత సడలినట్లుగాఁ దోఁచకమానదు. అట్లు తోఁచుటకుఁ గల కారణము; కవి యీ రెండంకములలో మాలతీ విరహాపీడితులయిన మాధవప్రభృతుల యున్మాదావస్థలను గరుణరసప్రధానముగాను, స్వభావమనోహరముగాను వర్ణింపఁ దలంపుగొన్నవాఁడై వెనుకఁ గరాళకక్రిఁగుడిలో నఘోరఘంటుని దొంగతనమును బట్టబైలు సేయఁగలిగిన కామందకియొక్క దివ్యదృష్టి నిప్పుడు ప్రయత్నపూర్వకముగాఁ బొనఁగుపఱచి "యెందుఁబోతివే? కూఁతురా? యేమి సేయుదునే? తల్లీ!" యని మాలతినిమిత్తమామె విలపించునట్లు చేసినాఁడు అట్లుగాక యిప్పుడు కామందకి మునుపటిచొప్పుననే తన జ్ఞాననేత్రముఁ విప్పి కపాలకుండల చేసిన మోసమును జెప్పియుండినయెడల గథాక్రమము మాలతియొక్క బంధుగులందఱుఁ దత్ప్రతీకారమునకై యుపయోగము సేయుచుఁ దిరుగులాడుచుండినట్లుగనో యెట్లుగనో యింకొకవిధముగా మాఱవలసియుండును. అప్పుడు కథ కొంత పెరుఁగు. ఈ చిక్కుగండి తప్పించుకొనుటకై కవి కామందకికి దివ్యదృష్టిఁ దొలఁగించినాఁడు. కాని విరోధపరిహారకముగా హేతువును జెప్పి తొలఁగించినచో నది చక్కఁగా నతికియుండును.

ఇందు ద్వితీయాంకములో నార్యశీలకుంతలాదుల స్వయంవర వృత్తాంతములు ప్రసంగవశమునఁ జెప్పఁబడియుండుటచేతను, నవమాంకములో నున్మాదావస్థలోనున్న మాధవుఁడు మాలతికి మేఘునిచే సందేశముఁ బంపినట్లు కల్పింపఁబడియుండుటచేతను ఈకవి తనకుఁ బూర్వికుఁడైన కాళిదాసుయొక్క కావ్యనాటకములయం దెక్కువ

గారవప్రీతులు కలవాఁడని తోఁచుచున్నది. అందుచేతనే కాఁబోలు నిం దొకటి రెండుచోట్ల నించుకభేదముతోఁ గాళిదాను కల్పనలే కానవచ్చుచున్నవి.*

అయినను ఇతని కవిత్వమం దతఁ డుపమలవంటి యుపమలు కాని ఇతని నాటకములయం దతని విదూషకులవంటి పాత్రములుగాని కానరావు. మఱియు షేక్స్పియరు మహాకవి నాటకములయందువలె నిందు వచ్చు భూమికలలో గుణస్వభావాదులయందుఁ బరస్పరభేదము లంతవిశేషించి కనఁబడవు కాని హృద్గతములైన భావభేదముల నచ్చునఁ బోసినట్లుఁ, వర్ణింపవలసివచ్చినప్పు డితనిం జెప్పి మఱియొక కవినిం జెప్పవలెను. శైలివిచారించుతుమేని భవభూతికవిత్వము మొత్తము మీఁద సమానపాకయముగా నుండును. కొన్నిచోట్లఁ బదగుంభన మెక్కువయై యర్థపుష్టి తక్కువ యగుచుండును. మఱికొన్నిచోట్లఁ గేవల పాండిత్యప్రకర్షముకు బ్రకటింపఁజాలియుండును. "ప్రియురాలు మును పెట్లో యిప్పుడు నట్లే కనఁబడుచున్నది. కాని యిప్పటిదర్శనము పారమార్థికము గాకపోవు టొక్కటే విశేషము. దృఢతరమైన పూర్వానుభవమువల్ల నాకాపె యావు గానిపించుచున్నది. ఆ సంస్కా

---

* ౧౦ అంకములోని ౪ పద్యము కుమారసంభవము నాల్గవసర్గములోని

శ్లో॥ గతఏవ నతేనివర్తతే ససఖాదీప ఇవానిలాహతః।
అహమస్య దశేవ పశ్యమామవిషహ్యవ్యసనప్రధూమితాం॥

౯ అంకములోని ౩౩ పద్యము విక్రమోర్వశీయము నాల్గవయంకములోని

గీ. "కల్లనాసనగలపాలు గాలుచుండఁ, జేతఁ దెమలించియంగుగుచిగురుఁ గొమ్మ
సరసముగఁ బోటితుం దీయఁ గరివిభుండు, మించువేడుకతో నారగించుచుండె."

౧౦ అంకము ౧౪ పద్యము విక్రమోర్వశీయము ప్రథమాంకములోని

గీ. "ప్రియురాలయనురక్తియుప్పుడపాయెఁ దిగ్భుజనాథనుఁడుంగ దేబలారి
తెల్లవాఱుఁదమ్మిరేఁగ పద్మములట్లు, విప్పుమింక నిమ్మ దేశఁదకనులు."

ఇత్యాదులు సాదృశ్యములు.

రమున కనవరతముగాఁ గలుగు నుద్బోధమువల్ల, ధారావాహికన్యాయముగా విస్తరిల్లునదియు, మాలతీస్మృతివిజాతీయములైన జ్ఞానాంతరములచేఁ దిరస్కరింపఁబడ నిదియు నగుస్మృతిజ్ఞానపరంపర, వృత్తిసారూప్యముచే నా చైతన్యమును దన్మయత్వ మొందునట్లు చేయుచున్నది." (౫ అం ౨౬ పుట) ఈ వాక్యపరంపర వినువారికి విప్రలంభశృంగారముగా నుండునా లేక ప్రబోధచంద్రోదయాదితత్త్వప్రదర్శకప్రబంధముల కర్హమయినయుత్తర మీమాంసా శాస్త్రవాదముగా నుండునా యని సంశయము పొడముచున్నది.

మ. రసభావాళ్యము చేఁబ్రయోగములు దుర్గ్రాహ్యంబులై మీఱు, గా
ఢసుహృద్భావమనోహరంబులయి చేష్టల్ క్రాలెడుం; గామసూ
త్రసమాయోజితమై యెసంగును రసౌద్ధత్యంబు, చిత్రంబులై
పొనఁగుం గాథలు, వాక్కులం దమిత నైపుణ్యంబునుం గూడెడున్.

అని ప్రస్తావనమందుఁ గవిచే నిర్దిష్టమైనరీతిగా నిందు వచ్చు నాయకుఁడు ధీరశాంతుఁడు; శృంగారము ప్రధానరసము; అంగాంగిభావముగా భీభత్సాద్భుతరౌద్రాదులయిన రసాంతరములుకూడ నౌచిత్యమునకు భంగములేకుండ నివేశింపఁబడినవి; కథాసంవిధానము మిగులఁ జిత్రముగా నుండును; లోకములో నవ్యాజస్నేహ మెట్లుండవలయునో చక్కఁగాఁ బ్రదర్శింపఁబడినది; మఱియు వివాహమునకుఁ బ్రధానాంగమనురాగమేయని విశదీకరింపఁబడినది. నాయికానాయకు లగ్రవర్ణమువా రగుటచేతఁ బూర్వము రజస్వలావివాహములు సేయునడాచారము బ్రాహ్మణులలోఁగూడఁ బ్రబలియుండెనని తెలియుచున్నది.

నే నీ నాటకమును సాధ్యమయినంతవఱకు మూలానుసారముగానే తెనిఁగించినాఁడను. ప్రస్తావనమాత్రము మూలమునకుఁ గొంచెము భిన్నముగా నుండును. నేను పండితుఁడను గాకపోవుటచేతను, నాకుఁ బండితసాహాయ్యము లభింపకుండుటచేతను నిందు నా ప్రమాద

ములును దోషములును విశేషించి యుండవచ్చును. వానినెల్ల దయతో క్షమింపఁ బండితులను బ్రార్థించుచున్నాఁడను. నే నీ మాలతీమాధవమును మొట్టమొదటఁ బండ్రెండు సంవత్సరములక్రిందటఁ దెలిఁగింప నారంభించి మొదటియంకములోఁ గొంచెము రచించి కొన్ని కారణములచే నప్పుడంతటితో నిలిపివేసితిని. తరువాత నాలుగు సంవత్సరముల క్రిందటఁ దిరిగి యారంభించి నడుమనడుమఁ గలుగుచువచ్చిన యంతరాయములు తొలఁగి యించుక యవకాశము చిక్కినప్పుడెల్లఁ గొంచెము రచించుచుఁ దుదకు దీనిని గతసంవత్సరము 'జూను' నెలలో ముగించితిని. సరసాగ్రగణ్యులగు కొందఱు నా మిత్రులు నా నాటకమును విని యానందించి నాకనేకవిధములఁ బ్రోత్సాహముఁ గలిగించుటచే నిప్పుడు మహాజనుల యాదరణమునుగూడఁ గోరువాఁడనై దీనిని బ్రచురించుచున్నాఁడను.

నిడదవోలు,
గోదావరీమండలము.
1-12-1902.

ఇట్లు,
సుజనవిధేయుఁడు.
జనమంచి వేంకటరామయ్య.

# మాలతీమాధవము

## ప్రథమాంకము

### నాంది

చ. సురనదినీరు నెట్టెముగఁ ♦ జుట్టినపున్కలదండ నిండఁగం
బ్రరుచులుమించు లీనఁగల ♦ ఫాలవిలోచనకీలికీలతోఁ
బెరయ, నవేందురేఖ మఱి ♦ పింపఁగఁ గోమల కేతకీశిఖన్
సరులుగ సర్పవల్లులఁ బె ♦ నంగు మహేశుజడల్ శుభంబిడున్. ౧.

### లయగ్రాహి.

ధిమ్మనుచు శూలి నట ♦ నమ్మునకు నందిగడు,
సమ్మదమునందిమురఁ ♦ జమ్ము మొరయింపన్
నెమ్మివిని వచ్చుగుహు ♦ నెమ్మిఁగని తుండవివ,
రమ్మునము డుంచుకఫ ♦ ణమ్ము ఫణి మారన్
జుమ్మనికటమ్ములను ♦ దుమ్మొదలు సేయు పెను,
దిమ్ము దెసలంతటను ♦ గ్రమ్ముకొనఫీటా
రమ్ములు నిగుడ్చుచును ♦ దుమ్మెడిని నాయకుము,
గమ్మువిదళింపులుచి ♦ రమ్ము మిముఁ బ్రోచున్. ౨.

(* నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాడు)

---

* మఱి రెండుశ్లోకములు ప్రక్షిప్తములని తెనిఁగింపఁబడలేదు.

సూత్ర:—చాలు నటి విస్తరమెందుకు? (తూర్పు దిక్కువంకఁ జూచి) ఇదిగో నుదయించుచునే పొదలి లోకములనెల్లఁ బ్రకాశింపఁ జేయుచున్న యీ బాలభాస్కరు నారాధించెదను. (ప్రణమిల్లి.)

ఉ. ఓజనము న్తతేజముల ♦ కోజగదాత్మక! భాజనంబవ
వ్యాజకృపారతిన్ సిరుల ♦ పారముగాదయసేయ మ్రొక్కెదన్
హేజగదీశ! నా యఘము ♦ లెల్లనువేగహరించిమంగళా
యోజితమంగళంబుగనొ ♦ సమ్మడినిమ్ముభృశమ్ముభద్రముల్. 3.

(తెరవంకఁ జూచి) మారిషా! రంగమంగళములన్నియు లెస్సగా సమకూడినవి. కాళప్రియనాథుని యాత్రాప్రసక్తి * మీఁద నానా దిగంతవాసులగు జనులును వేంచేసియున్నారు. ఏమని యిప్పుడు చప్పుడు సడియులేక నటు లూరకున్నారు? "మీరిప్పుడొక యపూర్వ నాటకప్రయోగముచే మమ్మానందింపఁ జేయవలయును." అని యీ విద్వత్సభవారు నా కాజ్ఞాపించియున్నారు. కాఁబట్టి నిర్దిష్టగుణభూయిష్ఠమగు ప్రబంధమొకటి ప్రయోగించి వీరిం బూజింతము.

నటుఁడు:—(ప్రవేశించి) బావా! ఆర్యులును, పూజ్యులును, సంపన్నులును నగు భూమిదేవు లుదాహరించెడి యాగుణము లవి యెవ్వి?

సూత్ర:—

మ. రసభావౌజ్జ్వల్యముచేఁ బ్రయోగములు దు ♦ ర్గ్రాహ్యంబులై మీఱెడున్
రసికానందకరంబులై తనరెడున్ ♦ వ్యాపారముల్, కామసూ
త్రసమాయోజితమై యెసంగునుర సౌ ♦ ష్ఠత్యంబు, చిత్రంబులై
పొసఁగుంగాథలు, వాక్కులందమితనై ♦ పుణ్యంబునుంగూడెడున్. ౪.

నటుఁడు:—బావా! యే ప్రకరణమందు?

* నాటక మాడునప్పుడు సమయానుసారముగా మార్చుకోవచ్చును.

సూత్ర:—(ఆలోచించి జ్ఞప్తికి వచ్చినట్లు) పూర్వము దక్షిణదేశమునఁ బద్మపురమను నగరమందు యాజ్ఞవల్క్యులును, పఙ్క్తిపావనులును, కాశ్యప సగోత్రులును, అహితాగ్నులును, క్రతుకర్తలును, ధృతవ్రతులును, ఉదుంబరనాములును, బ్రహ్మవేత్తలును నగు కొందఱు బ్రాహ్మణులు వసించుచుందురు.

మ. ఘనశాస్త్రాధ్యయనంబు సేయుదు రెపుం ♦ గంగోరితత్త్వార్థ,మా
ర్జనముం జేయుదు రర్థముల్ కడఁకని ♦ ష్టాపూర్తము ల్సల్పఁగా
ననఘుల్ దారపరిగ్రహంబును నవ ♦ త్యావాప్తికై సేయుదుర్
పౌనరింపందప మిచ్చ సేయుదురు నం ♦ పూర్ణాయువ వ్వైదికుల్.౫.

అట్టి సద్వంశమందుఁబుట్టిన భట్టగోపాలుని పౌత్రుఁడును, పవిత్రకీర్తియగు నీలకంఠుని పుత్రుఁడును, శ్రీకంఠపదలాంఛనుఁడును, పదవాక్యప్రమాణజ్ఞుఁడును అగు భవభూతియను మహాకవిచే విరచింపఁబడిన మాలతీమాధవ మను మహాప్రబంధము ప్రతియొకటి యీనడుమ మాతండ్రిగారి పుస్తక భండారమును దిరుగవైచుచుండఁగా నా కాకస్మికముగా లభించినది. మొదటినుండియు నాకు నాటకములయం దెక్కువ యభిరుచి యగుటచే దానిం దీసి చదివితిని. చదువఁగానే యందలి,

చ. మఱియెవ్వరైనఁ గొంద ఱవ ♦ మానము నీకృతికిం బొనర్చువా
రెఱిఁగినవారె యేమయిన ♦ నియ్యది గాదల వారిఁగూర్చి, యీ
సరికె జనించెనేమొ, యిఁక ♦ జన్మమునొందెడు నేమొ ముందభి
న్నరుచినొకండు మత్సముఁడ ♦ నంతములౌఁగద దేశకాలముల్.౬.

అను నీ పద్యాభిప్రాయము నిశ్చయముగా నా ప్రబంధమునకుఁ దగినదిగా నున్నదనియే యెంచఁదొడఁగితిని.

నటుఁడు:—ఏమిప్రాగల్భ్యము! ఈ వైదికబ్రాహ్మణుఁ డిన్ని చదురు లెక్కడ నేర్చియుండెనో!

సూత్ర:—నీకుఁ గలిగిన సంశయ మతనిచేతనే నివారింపఁబడు చున్నది. గురుస్మరణావసరమున నాతఁడు,

తే.గీ. జ్ఞాననిధియని సార్థక ♦ నామధేయుఁ
డైన కేవల భగవంతుఁ ♦ డరయనెవని
గురుఁడో యట్టినదగుకొద్ది ♦ గుణముగూడ
గొప్పగాకున్నె పెద్దల ♦ గుణమహిమను? ౭.

నటుఁడు:—బావా! భవభూతి శుద్ధశ్రోత్రియుఁడని చెప్పియు న్నాఁడు. అందుచేత నతఁడు రచించిన నాటకమంతయు వేదములతోను వేదాంతములతోను నిండియుండునేమో?

సూత్ర:—ఓయి వెఱ్ఱివాఁడా! వినుము.

ఆ. వె. వేదపఠనమేల ♦ వేదాంతసాంఖ్యయో
గములునేల నాట ♦ కములు? నర్థ
గౌరవంబువాగు ♦ దారతయుఁబ్రౌఢి
తగును బాండితీవి ♦ దగ్ధతలకు. ౮.

నటుఁడు—అట్లయిన మన మా యపూర్వనాటకమును యథో క్తముగా నభినయింతము.

సూత్ర—'యథోక్తముగా' ననుచున్నావు. ఆ నాటకము సంస్కృతభాషయందున్న దే?

నటుఁడు—ఉన్ననేమి? మన కది క్రొత్తభాషగాదు గదా!

సూత్ర:—మనకది క్రొత్తభాషగాదు గాని యీ సభవారికి మాత్రమది ప్రాఁతభాషయే.

నటుఁడు:—మీ యభిప్రాయమేమి?

సూత్ర:—ఈ సభవారు నవనాగరికులలోఁ జేరినవారగుటచే వారికిప్పటి నూతనాభిప్రాయములనుబట్టి స్వదేశభాషాభివృద్ధియందే యెక్కువ యాదరము. కాఁబట్టి యట్టి "దేశభాషలలో నెల్లఁ దెలుఁగు లెస్స" యని యుండుటచేఁ దెలుఁగుననే యభినయింతము.

నటుఁడు:—అలాగే కానిండు.

సూత్ర:—మనకు రాజమహేంద్రపురవాస్తవ్యుఁడగు శ్రీజనమంచి వేంకటరామకవి నాతి కఠినమైన మృదుమధురశైలి నా మాలతీమాధవమునే తెలుఁగున వ్రాసి యిచ్చియున్నాఁడుగదా. దానిని నాటకులందఱుఁ గంఠపాఠము చేయనే చేసినారు.

నటుఁడు:—అవును మనమిప్పు డా నాటకమునే ప్రదర్శింతము. అయితే ముందు పాత్రములను రప్పించువిషయమున నేమి యాలోచించినారు?

సూత్ర:—ఆలోచన కేమున్నది? కామందకియును వృద్ధబౌద్ధయోగిని పాత్రము నేను వహించినదే. తచ్ఛిష్యురాలగు అవలోకితపాత్రము నీకు నిర్ణయించితిని గదా? ఇంకఁ బ్రకరణనాయకుఁడును మాలతీవల్లభుఁడును నగు మాధవుని వేషము కలహంసమకరందులు ప్రవేశింపనప్పుడు సిద్ధముగా నేయుండును.

నటుఁడు:—(తనలో) ఓహో! చిక్కువచ్చినదే కానిమ్ము. (ప్రకాశముగా) బావగారితోఁ జెప్పమఱచినాను. మీరట్లు పాత్రనిర్ణయము చేసి వెళ్లినతోడనే మాయింటియాబిడ నొప్పులు పడుచుండెనని నాకాకస్మికముగా మాయూరినుండి వర్తమానము రాఁగా నేమియుఁదోఁచక చేతనున్న గ్రంథభాగము చెంతనున్న మాతమ్మునిమీఁదఁ

బడవైచి చక్కవెళ్ళితిని. ఇందుకు నన్ను మన్నింపవేఁడుచు, కుశాగ్ర బుద్ధియగువాఁడును ఇంతకుముందే తనపాత్రమును జదివి సిద్ధము చేసికొని యుండునని మనవిచేసికొనుచున్నాను.

సూత్ర:—బాగు బాగు! నేను నీకొప్పగించినది నీవు నీతమ్మునికొప్పగించితివా? మొత్తముమీఁద సామాజికుల కేవరియింటనో పెండ్లి యన్నట్లున్నది. ఓయి స్వకృత్యమును మఱచినవాఁడా! చూడు! మంత్రిబిడ్డలగు మాలతీమాధవుల పెండ్లినిమిత్తము బౌద్ధయోగిని యెంత యారాట పడుచున్నదో! చూచి యిఁకనైనను తెలివిదెచ్చికొనుము.

నటుఁడు:—(ఇటునటుచూచి) ఏదీ బౌద్ధయోగిని? ఏదీ బౌద్ధయోగిని?

సూత్ర:—ఇదిగో శిష్యురాలితోఁగూడ నామెను నీ విప్పుడే చూడఁగలవు. రమ్ము పోదము.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

* * *

## ప్రథమరంగము—కామందకి గృహము.

[తరువాత కాషాయవస్త్రములను ధరించి కామందకియు
అవలోకితయుఁ బ్రవేశించుచున్నారు.]

కామందకి:—వత్సా! అవలోకితా!

అవ:—అమ్మా! యేమి సెలవు?

కామందకి:—కళ్యాణవంతులును, భూరివసు దేవరాతులసంతానమును నగు మాలతీమాధవుల సర్వాభీష్టమైన పాణిగ్రహణ మహోత్సవము జరుగవలసి యున్నది. (ఎడమ కన్నదరుటను సూచించి సహర్షముగా,)

క. నాయంతరంగ మొత్తఁగిన
దోయనఁగ స్ఫురించి మంగ ♦ ళోదర్కం_
నా యెడమ నేత్ర మీ యెడఁ
బాయని దాక్షిణ్యమూను ♦ వామం బయ్యున్. ౯.

అవ:—భగవతి చిత్తక్షోభ మెంత యెక్కువగా నున్నది! ఆశ్చర్యము! చినిఁగి జీర్ణమగు చలిబొంత గప్పుకొని లెక్క కొక్క కబళమును భుజించుచుఁ బ్రాణధారణము సేయు భగవతిని సైతమిప్పుడమాత్యభూరివసు విట్టి యాయాస కార్యములందు నియోగించుచున్నాఁడు. అందు సంసారబంధవిముక్తమగు నాత్మ భగవతిచేతను బ్రవేశపెట్టఁబడుచుండుట మఱియు వింతగా నున్నది.

కామందకి:—బిడ్డా! అట్లుగాదే!

ఉ. నా యెడఁ గల్గు స్నేహమును ♦ నమ్మికయుం బుడికొల్పఁ గాఁ జుమీ
యాఢ్యుఁ డఘుండు వేఁడఁ గొక ♦ యర్థమునా వలనన్ ఘటింపఁ గన్
బాయుదు నాదు ప్రాణముల ♦ నాతపసంతయు ధారఁబోయుదుం
జేయుదు మిత్రకార్య మెడ ♦ సేయక ధన్యతఁ గాంచ రోయుదున్. ౧౦

నీవెఱుఁగవు గాఁబోలును. మాకిప్పుడు విద్యాభ్యాసముకొఱకుఁ బరదేశములకుఁ బోయి సహాధ్యయనము సేయుచుండ స్నేహమయ్యెనో యప్పుడే యీ భూరి వసుదేవరాతులు సౌదామిని చూచుచుండఁగాఁ జేతఁ జేయివైచికొని "మనమువశ్యముగా వియ్యమందవలయును" అని ప్రమాణము చేసికొనిరి. కాఁబట్టి న్యాయశాస్త్రమును జదివించుటకై కొడుకును కుండినపురమునుండి యీ పద్మావతీపురమునకుఁ బంపి విదర్భ రాజు మంత్రి శ్రీదేవరాతుఁ డిప్పుడు తెలివైనపనియే చేసినాఁడు.

ఆ. వె. వెనుకఁ జేసియున్న ♦ వియ్యంపుశపథంబు
స్మృతికివచ్చెఁబూర్వ ♦ మిత్రునకును;
మఱియువిశ్వవిదిత ♦ మహనీయగుణుఁడైన
కొడుకునందుఁబ్రీతి ♦ కుదురఁగలదు. ౧౧.

అవ:—అమాత్యుఁడు మాలతిని మాధవునకుఁ దానుగా నియ్యకపోవుట కేమి కారణము? దొంగపెండ్లికోసరము భగవతి నందుకు తొందరపెట్టుచున్నాఁడు?

కామందకి:—

చ. నరపతిచేతనాతనికి ♦ నర్మసఖుండగునంద నుండొగిం
బరిణయవర్థతిందనకు ♦ మాలతినీనడిగించుచున్నవాఁ
డరయక మోము ముందరనె ♦ యాతనిప్రార్థన ద్రోచిపుచ్చినన్
ధరణిపుఁడాగ్రహించు, శుభ ♦ దంబగునట్టియుపాయమిద్దియే ౧౨.

అవ:—అమాత్యుఁడు మాధవునిపేరైనను దలపెట్టకుండుట మిగుల చింతగానున్నది. దీనిఁబట్టి యాదరములేకపోవుటే స్పష్టమగు చున్నది.

కామందకి:—బిడ్డా! అది యంతయు బాహ్యానటనము సుమీ!

తే. గీ. ఎఱుఁగు నెలఁబ్రాయము వివేక ♦ హీనమగుట
యెఱుఁగు మాలతీమాధవు ♦ లిర్వురుంబ
రస్పరానురాగంబులఁ ♦ బ్రబలియుంట
యెఱిఁగియును వారికొఱకునై ♦ యెఱుఁగఁడిపుడు. ౧౩

మఱియు.

తే. గీ. వత్సలన్యోన్యస్న మనురాగ ♦ బద్ధులనెడి
మాట లోకప్రసిద్ధంబు ♦ మనకుదాన
సేమమయ్యెను; జివరకా ♦ భూమిపతియు
నందనుండును మోదంబు ♦ నొందువారు. ౧౪

చూడు.

చ. ఘనమగు రామణీయకము ♦ గన్పఱచుచుంబయివేషభాషలం;
దణఁచు రహస్యముల్ నలుసు ♦ లంతలుతప్పెను; బూటకంబుమై
జనులనుగూడఁ బల్కుకొని ♦ స్వార్థముల్ ఘటియించు దేనితో
నెనయక కార్యవేదిపయి ♦ కేమియెఱుంగని వానిఁబోలుచున్. ౧౫

అవ:—మీ సెలవు చొప్పున నేనును నెమ్మదిగా నేవియో పనులుకల్పించి మంత్రి భూరివసువుగారి లోఁగిటి ప్రక్క రాజవీధిని మాధవుని ద్రిప్పుచునే యున్నాను.

కామందకి:—అవును. మాకు మాలతిదాదికూఁతురు లవంగిక చెప్పినది.

చ. కుఱఁగట రాజవీధిఁ జనఁ ♦ గ్రొత్తగరూపముదాల్చి పొల్చిన
మ్మరురతివోలె మాధవుని ♦ మాలతితుంగగవాక్షపీఠమై
యఱిమిఱిఁజూచిచూచి తమి ♦ యగ్గలమౌటను దాళలేక దా
మఱిఁగెడియుంగరంబులతి ♦ మాత్రముగా వసివాడఁజేసెనున్. ౧౬

అవ:—నిజమే. ఆమీఁద నామెకుఁ బ్రొద్దుజరుగుట కష్టముగ

నుండుటచే నొక్కించుక వినోదార్థమామెచే లిఖింపఁబడిన మాధవుని రూపమును లవంగిక యిప్పుడే మందారిక చేతికిచ్చినది.

కామందకి:—(ఆలోచించి) లవంగిక మంచిపని చేసినది. మాధవానుచరుఁడైన కలహంసుఁడా విహారదాసి మందారిక యందుఁ దగిలియున్నాఁడులే. అందుచేత నాప్రతిచ్ఛందక మీ మార్గమున మెల్లఁగా మాధవుకడకు ముందుకార్యమును దెలిసికొనుచుఁ జేరఁ గలదని దానియభిప్రాయము.

అవ:—మాధవునకుఁగూడ మదనమహోత్సవమును జూడ వేడుకపుట్టించి యాతని నీ యుదయమే మదనోద్యానమునకుఁ బంపి నాను. అక్కడకు మాలతి రాఁగలదు. పిమ్మట నన్యోన్యదర్శనము కాఁగలదని.

కామందకి:—మేలు! బిడ్డా! మేలు! నీవు నీయనువర్తనముచే నా పూర్వశిష్యురాలగు సౌదామినిం దలఁపించుచున్నావు.

అవ:—అమ్మా! యిప్పుడా సౌదామిని యాశ్చర్యకరమైన మంత్రసిద్ధి ప్రభావమును బొంది శ్రీశైలమునఁ గాపాలిక వ్రతమునడపుచున్నది సుమీ!

కామందకి:— ఈ సంగతి నీ కెవరు చెప్పినారు?

అవ:— ఈనగరి శ్మశానవాటికయందు కరాళయను చాముండ గలదు.

కామందకి:—అవును. కలదఁట. ఆ దేవత నానావిధములయిన జీవబలులచేతఁ బ్రీతినొందునని సాహసిక ప్రవాదముకూడఁ గలదు. తరువాత.

అవ:—శ్రీశైలమునుండి వచ్చి యిచ్చటికనతిదూరమున శ్మశానవాటమందు ముండ ధారియగు నఘోరఘంటుఁడను సాధకుఁడొకఁడు వాసము చేయుచుండును. అందులకు మహాప్రభావముగల కపాలకుం

డల యను నాతని శిష్యురాలనుదినము సాయంకాలమున వచ్చుచుం డును. ఆమెవలన నాకీవార్త.

కామందకి:— సౌదామినియం దిట్టిమహిమలు గలిగియుండ వచ్చును.

అవ:— అవును. మనకిప్పుడాసంగతి యవసరములేదు. మాధవునకు సహచరుఁడును బాలమిత్రుఁడును నగు మకరందుఁడు నందన మంత్రి చెల్లెలైన మదయంతికను బెండ్లియాడఁ గలుగునేని యది మాధవున కభీష్టాంతరముగా నుండును.

కామందకి:— ఆ పనిక నా ప్రియసఖి బుద్ధరక్షితను నియోగించినానే!

అవ:— భగవతి లెస్సయినపని చేసినది.

కామందకి:— లెమ్ము. మాధవునిసమాచారము దెలిసికొని పిదప మాలతినే చూఁడబోదము. (ఇద్దఱు లేచుచున్నారు.)

కామందకి:— (ఆలోచించి) మాలతియనఁగా నతిగంభీరస్వభావురాలు. "చేయఁదగినదెల్ల యోచించి మీరే చేయుఁడ"ని కృత్యమంతయు మనమీఁదనే వదలివేయును. కాఁబట్టి మన మతినిపుణముగా దౌత్యమును నడుపవలయును. సర్వవిధముల,

చ. కలువవిరిన్ శరత్ప్రమయ ♦ కౌముదియట్లు సుజాతుఁగాంతునిన్
లలితచరిత్ర మాలతియ ♦ లర్పెదుఁగావుతఁ గోడెకానితో
ర్కులాదవి యీడుజోడుగను ♦ గూర్చిగుణంబు లమర్చినట్టియ
న్నలువవిశిష్ట సృష్టినిపు ♦ ణత్వముఱంజక మైఫలించుతన్. ౧౭.

ఇది విష్కంభము.

—0—

## ద్వితీయరంగము—ఉద్యానము.

(తరువాత చిత్రఫలకమును చేతఁబట్టుకొని కలహంసుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కల:—మన్మథుని గర్వము సర్వము నపహరింపఁజాలిన తన రూపరేఖావిలాసములచే మాలతి గుట్టునట్టులఁ దెలిసికొన్న మా యజమానుఁడు మాధవు నప్పుడు నే నెక్కడఁ జూతును? (ఇటునటునడచి) ఆయాసముగా నున్నది. ఇప్పుడీ యుద్యానమందు ముహూర్తమాత్రము విశ్రమించి మకరందసమేతుని మాధవునిం జూచెదను. (వెనుకకు మరలుచున్నాఁడు.)

(తరువాత మకరందుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మక:—మాధవుఁడు మదనోద్యానమునకు వెళ్ళినాఁడని యవలోకిత చెప్పినది. నేనును అక్కడకే పోయెదను. (ఇటునటునడచి చూచి) ఓహో! వయస్యుఁ డీలాగే వచ్చుచున్నాఁడు. (నిరూపించి) ఇతనికి,

చ. గమనము మందమయ్యె, మతిఁ ♦ గన్నులచూపును శూన్యమయ్యె, దే
హము బలహీనమయ్యె, నిడు ♦ వయ్యెను శ్వాసమి దేమొ? యీయనలో
కములను బచ్చవిల్తునధి ♦ కారము సెల్లు, వయస్సుదావికా
రములుఘటించుఁ, దాల్మి మధు ♦ రప్రియభావములన్ నశించెడున్.

(తరువాత నట్టి మాధవుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మాధ:—

చ. ఇది సమయంబు గాదనక, ♦ యెబ్బెతికంబను కోక, సిగ్గుఁబో
విదలిచి, తాల్మిఁ జంపుకొని ♦ వెఱ్ఱిదనంబున నా దుడెందమా
వదనజితేందు బింబను వి ♦ భావనసేయుచు మాటిమాటికిం,
గదలెడు వెన్కకిప్పుడతి ♦ కష్టపుయత్నముమీఁద నెట్టిటో. ౧౯.

ఏమియాశ్చర్యము!

చ. నిలుకడగల్గె నామదిక ♦ నిర్వైరపాటున; నవ్యభావముల్
మలఁగె;సుధాబ్ధిఁ దేలెనన ♦ మాంద్యమునుఙ్ జనియించెనిర్వృతిఙ్
వెలఁది నమత్కమందపుడు; ♦ వెండియునిప్పుడు వేఁడివేఁడిని
ప్పులఁ బొరలిపఁబడ్డదన ♦ భూరితరవ్యథ కగ్గమయ్యెనుఙ్. ౨౦.

మక:—(చేరవచ్చి) మిత్రుఁడా! మాధవా! యీలాగీలాగు సూర్యుఁడు నెత్తిమీఁదుసట్లుగా నెండ గాయుచున్నాఁడు కాఁబట్టి యీ యుద్యానమున ముహూర్తమాత్రము విశ్రమింతము. (ఇద్దఱు నిలువటు నడచుచున్నారు.)

కల:—(సమీపింపవచ్చుచు) చెలికానితోఁ గూడి యీ బాలోద్యానమును మాధవుఁడెట్లుగా నలంకరించుచున్నాఁడు! మదనవేదనచే ఖేదమొందుచున్న మాలతికిఁ గన్నులపండువగు నీతని ప్రతిచ్ఛందకము నిప్పుడిశనికిఁ జూపుదునా? పోనీ యిప్పుడు విశ్రామసౌఖ్య మనుభవింపనిమ్ము. (వెనుకకు మరలుచున్నాఁడు.)

మక:—వికసించిన పుష్పకేసరముల చల్లని వగరువాసనలచే నుద్యానమును బరిమళింపఁజేయుచున్న యీ సంపఁగిచెట్టునీడనే విశ్రమింతము. [ఇద్దఱు నట్లుచేయుచున్నారు.] వయస్యా! మాధవా! కామోద్యానమునందు నాగరికసుందరులచేఁ బ్రవర్తింపఁబడిన మహోత్సవమును జూచివచ్చిన నీవు నాకన్నులకు వేడుకగా నోఁచుచున్నావు. మన్మథబాణములకు గుఱియగుచుండుట లేదుగదా? [నవ్వి] వెలిదామరవలె సుందరమగు నీ ముఖము నేల వంచుకొనియెదవు?

వంచచామరము.

తమన్నమా వృతంబులైన ♦ తర్కుప్రసాణికోట్లకుఙ్
సమస్తముఙ్ సృజించినట్టి ♦ స్రష్టకిందుమౌళికిఙ్

నముండెవండో యట్టిచిత్త • జన్మశక్తి సుప్రసి
ద్ధమాఁగదయ్య లజ్జఁబూని • దాఁచనేల నీకథ. ౨౧.

మాధ:—వయస్యా! యేలచెప్పను? విను అవలోకిత చెప్పిన మీఁద వేడుకపుట్టి కామోద్యానమునకుఁబోతిని. పోయి యందందుఁ దిరుగాడుటచే మిగుల డస్సినవాఁడనై మనోహరమైన యాయా లయ ప్రాంగణభూమికిఁ జక్కని యలంకారమగుచుఁ గమ్మని యాసవవాసనల కానపడి దొమ్మిగమునరి దిమ్ముసేయు తుమ్మెదలపిండుచేఁ గలఁతనొందిన మొగ్గలచాలుఁ దన్నలంకరింప నింపుగులుకు నొకలేఁత పొగడచెట్టు పాదుచెంతను గూరుచుంటిని. తరువాత వికసించి కాలవశమునఁ జెట్టునుండి నేల జలజలరాలిన పూలను సంగ్రహించి నేర్పుమీఱ నొకమాలికనుగూర్చ మొదలుపెట్టితిని. తదనంతరము గర్భాలయము నుండి మన్మథుని సంచారిణీభావముగల జగద్విజయవైజయంతికలాగున వెలువడి చక్కగ నమర్పఁబడిన బాలనైపథ్యము తనకన్యకాత్వము వెల్లడించుచుండ నెవ్వరోకాని యతిగంభీరస్వభావురాలగు నొక చిన్నది తిన్నగ నే నున్నచోటికే పరిజనులతో వచ్చినది.

చ. చెలియది రామణీయకపు • నేవథిపై నధి దేవతాప్రథం
బొలుచునదో కొ! చక్కఁదన•పుంజిగి తేటల యిక్కయో కొ! జా
బిలికళలూ మృణాళములు • వెన్నెలగో నగు నివ్వికారణం
బు లువికసృష్టికింకవిధ • పూవిలుకాఁడె నిజంబు నెచ్చెలీ. ౨౨.

తిరువాత పూలుగోయుట యందలి యభిలాషచేఁ బ్రేమాస్పదలగు సఖీజనులు వెంటనుండి ప్రార్థింపఁగా నా చిన్నది నేనున్న పొగడచెట్టుదగ్గఱకె వచ్చినది. బహుదినములనుండి యే పుణ్యాత్మునియందో వలపు నిలిపియున్నదని దాని మన్మథవ్యాపారములచేఁ దెలిసికొంటిని. ఏమంటేని,

చ. నలిగిన తమ్మిమొగ్గవలెఁ ♦ నాతియొడల్ వసివాడ, వెచ్చలుల్
లలిఁబతిమాలుకొనెటులొ ♦ లాలనమై నుపచారముల్గొనన్,
దళిత వినూతనద్విరద ♦ దంతమనోజ్ఞ కపోలపాళియుం
గలువల తేఁటినిర్మలిన ♦ కాంతిరమంబురుడించి యుండెడున్. ౨౩.

ఆమె నన్నుఁ జూచినదిమొదలు నా కన్నుల కమృతవర్తికయై యమితమైన యానందమును గల్పించి లోహధాతువును సూదంటుఱా యియు వలెనే నా హృదయము నాకర్షించినది. ఇన్నందుకు?

చ. సుగమము దుర్గమంబనెడి ♦ శోధనసేయక యింతియందొగిం
దగులుకొనె స్మనంబు పరి ♦ తాపభరంబున కగ్గమాటకే;
యగణిత శక్తియుక్తమగు ♦ సంచితపూర్వ ఫలోదయంబుచే
నగును శుభాశుభంబులవి ♦ ప్రాణులకెల్లను బ్రాయికంబుగన్. ౨౪.

మక:—స్నేహము నిమిత్తముల ననుసరించియుండు ననుట విరుద్ధము సుమీ.

ఉ. కొండొక గూఢహేతువునఁ ♦ గూడుఁబదార్థము లొండొకంటితో
నుండవు బాహ్యహేతువుల ♦ నూనుచుఁగూరుము, లెట్టులున్న మా
ర్తాండుఁడు దోఁచినంతనెలి ♦ దామరమొగ్గ వికాసమొందెడున్
వెండికళింగనం గరఁగి ♦ నీరయిపోయెడుఁ జంద్రకాంతమున్. ౨౫.

తరువాత, తరువాత.

మాధ:—తరువాత నక్కడ,

చ. కనుబొమలం గదల్చిమును ♦ గాంచినవారును బోలెజాణలా
వనిత సఖీజనంబు "లల ♦ వాఁడెనుమీ యిటనున్నవీఁడ"టం
చనుగతి నన్నుఁజూచిమఱి ♦ యట్టె సుధామధురస్మితంబులిం
పొనరఁగఁ జూచుకొఁదొడఁగి ♦ రొండొరులం గడగంటిచూపులన్.

మక:—(తనలో) ఎట్లాన వాలు పట్టెరి?

మాధ:—పిమ్మటఁ గంకణావళులు ఘల్ఘల్ఘుల్లుమన లయా నుసారముగా హస్తపద్మము లప్పళించి చప్పటలు చఱచుచు బెదరి పాఱు రాయంచల తెఱంగున నడుగులిడునప్పు డందంపు గిలుకుటందియల సందడులు గ్రందుకొని గణగణమ్రోగు గంటల యొడ్డాణము లపో వాడులాడ నా చెలికత్తె లొయ్యారములు మీఱ గిలుక్కన మరలి "యేమిభాగ్యమమ్మా! యే అమ్మగారికో యిక్కో అయ్యగా రొక్క రిక్కడనే యున్నారు" అని యా చిన్నదానితోఁ బలుకుచు నావంకఁ దమ చూపుడు వ్రేళ్ళతోఁ జూపించిరి.

మక:—ఇది నిశ్చయముగాఁ బ్రథమానురాగమునకు నిదర్శనము.

కల:—(సమీపింప వచ్చుచు) వీరిప్పుడు మనోహరముగా నొక్క స్త్రీకథ చెప్పుకొనుచున్నారు.

మాధ:—

మ. వెలికింబంపుము ధైర్యసంపద, విజృం ♦ భింపింపుచున్ విభ్రమం
బులు, గాటంబగు సాత్త్వికంపువికృతిం ♦ బుట్టించుచున్, వాక్కులం
దెలుపన్ రాక, విచిత్రమై పరఁగి, యిం ♦ తిఁ బూనె నయ్యంతలో
పలనాచార్యక మేదియో మదన సం ♦ బంధంబుగా బల్విడిన్. ౨౭.

అటుపిమ్మట,

చ. కలయఁగఁ జూచునప్పుడు వి ♦ కాసముదాల్చి, వింతగొల్పుటన్
నిలుకడఁబొల్చి, రాగరస ♦ నిర్భరతంగని, భ్రూవిలాసముల్
గలిగితనర్చి, మూఁతగొని ♦ క్రమ్మఱిసూచిన జంకివెన్కకున్
మలఁగిచెలంగు చూపులకు ♦ మాటికినన్ గుఱిఁజేసి వెండియున్.

ఉ. అల్లన వ్రాలి, సిగ్గుగొని ♦ నట్టులు వెన్కకుఁ దగ్గి, భావమున్
వెల్లడిసేయుచుం, జెలిమి ♦ నించుచు, నిశ్చలతం జెలంగుచున్
మెల్లనఁదారి, విస్మయము ♦ మీఱఁగ ఱెప్పల విప్పొనొంది, రం
జిల్లు కటాక్ష వీక్షణలఁ ♦ జేడియ దిక్కులె యున్న నామనం
బెల్లహరించెఁ, దూంట్లురచి ♦ యించెను, బీల్చెను, పెల్లగించెనున్.

నేనును స్నేహరసమును ప్రకటించుచుండిన యా సర్వాంగ సుందరి సన్నిధానము కారణముగా లోఁబడినవాఁడనై నను గుట్టు చెడకుండుటకై మొదలుపెట్టిన పొగడదండ నెట్టెట్టో తుదముట్టించితిని. అంతటఁ గంచుకి జనంబులు బెత్తములుదాల్చి మొత్తములుగట్టి వెంబడింప నా చంద్రవదన యాఁ డేనుఁగునెక్కి నగరమార్గమలంకరించెను.

చ. చనుచు ననుంగనుంగొనను ♦ సారె కుమార్త్యెడ వెట్టునప్పుడా
ననమవవృత్తవృంతనళి ♦ నప్రతి మన్మహి యుంపఁగాఁగదుం
దనరి విశాలలోచన ను ♦ ధా విమదిగ్ధకటాక్షమొందు గ్ర
న్న నఁబరఁగించె గాటముగ ♦ నాటుచునాహృదిమున్సిపాఱఁగన్. ౩౦.

అది మొదలుకొని,

ఉ. ఇంతని యెన్న రాదు, మఱి ♦ యిట్టిదటంచు వచింపరాదు, గా
దింతకు నెన్నఁడేననుభ ♦ వించినదైనఁ, జెడన్వివేక మ
త్యంత విమోహదుర్విషయ ♦ మాచు వికారమదేదియోయిటుల్
స్వాంతము నెంతయుంజడిమ ♦ కగ్గముచేసి తపింపఁ జేసెడున్. ౩౧.

మఱియు,

చ. స్ఫురణము లేద యొట్టెదుటఁ ♦ బొల్చెడివస్తువునందునుం, గదుం
బరిచితమైనదే స్మృతివి ♦ పర్యయమై యొకలాగుదోఁచెడున్,
మఱిమఱిఁ బండువెన్నెలను ♦ మంచుఁగొలంకున ముంచియెత్తినం
దఱుగదు తాపమేమియు,మ ♦ నంబుఁ జలించి పరిభ్రమించెడున్.

కల:—(తనలో) ఇతని హృదయమును చూఱగొన్నది నిశ్చయముగా మాలతియే కావలయును.

మక:—(తనలో) ఓహో! సుతిమించి రాగమునఁ బడుచున్నది. ఇప్పుడు చెలికాని నేమని మందలింతును?

చ. మదనుఁడు నిన్ను మోహాంధర ♦ మగ్నునిఁ జేయక యుండుఁగాక!నిన్
గదియువుగాక కల్మషవి ♦ కారము! లంచిటు లె త్తిపేఁడికో
లాదవులైగాని యేసుగుఁ బ్ర ♦ యోజనమిప్పుడు బాగరూకుఁడై
వదలక కాముఁడున్ నవన ♦ వంబయి యౌవనమేకమాత్రతిన్. 33.

(ప్రకాశముగా) వయస్యుఁ డామె యన్వయనామధేయముల నెఱుఁగునా?

మాధ:—మిత్రుఁడా! వినుము. అట్లాచిన్నది యేఁగు గున్నపై నెక్కినప్పుడే గుంపుగూడిన యామె చెలికత్తెలలోనుండి యొక్క వారవనిత వెనుకఁ దగ్గి పూలుగోయు నెపమునఁ గ్రమక్రమముగా నన్ను డాయవచ్చి సిగను బూలదండ సవరించుకొనువంకతో నాకుఁ జేతులుమోడ్చి "మహాభాగ! సుశ్లిష్టమయిన గుణముగలదగుటచే నీకూర్పు మిగుల రమణీయముగా నున్నది ఈ మన్మథబాణముల వ్యాపారము చిత్రమై క్రొత్తగా నుండుటచే నిందు మాధ ర్త్రదారిక కుఁగూడ వేడుకగా నున్నది. సరసులయినవారినేర్పు లెప్పుడును మెప్పొందవలయునేకాని వ్యర్థములై యుండఁగూడదు. కలకంఠకంఠులకుఁ గంఠాభరణమై శోభఁ బెంపఁదగిన మణిహారము చిలుకకొయ్యను వ్రేలియుండఁ దగునా? కాఁబట్టి యీ పొగడదండ యామె పొగడదండ యనఁదగియుండును." అని నన్నుఁగూర్చి పలికెను.

మక:—ఓహో! యేమిజాణతనము!

మాధ:—తరువాత నే నడిగినమీఁద నా వారకాంత యా చిన్నది మంత్రి భూరివసువుగారి కొమార్తెయనియు, పేరు మాలతియ

నియు, తా నామెకుఁ బ్రేమాస్పదురాలైన లవంగికయను ధాత్రేయి (దాదికూఁతుర) ననియుఁ జెప్పినది.

కల:—(సంతోషముతో) మాలతియేనా? అటులయిన నిది మాకందునకుఁ గావలసినదే. భగవంతుఁడైన కామదేవునిసంకల్పముల కదృష్టముగూడఁ దోడుపడుచున్నది.

మక:—(తనలో) అమాత్యభూరివసువుకొమార్తె యగుటచే తనే మిక్కిలి మాననీయురాలని చెప్పుట యామె యసమానములైన యితరగుణములను తక్కువపఱచుటయే. ఇంతేగాక భగవతియైన యీ కామందకి "మాలతి! మాలతి" యని చెప్పుకొని యొంతసంతోషించు చుండును! ఆమెను నందనున కిచ్చి పెండ్లిచేయవలసినదని రాజడుగు చున్నట్టు కింవదంతియుఁ గలదు. (ప్రకాశముగా) తరువాత,

మాధ:—ఆమె నన్ను ప్రీతిమాలినమీఁద చేతనున్న పొగడ మాలికను బుచ్చుకొమ్మని యామెకిచ్చితిని. గ్రుచ్చునప్పుడు ధాన్య మంతయు మాలతిముఖముమీఁదనే యుండుటచే నడ్డదిడ్డముగా రచి యింపఁబడ్డ యీవకుళమాలిక నేదో యొక యపరూపవస్తువును వలెనే చూచి మహాప్రసాదమని పుచ్చుకొని యా వారసుందరి, వేడుక చూచి గుంపులుగూడి మరలిపోయెడి పురజనులసందడిలో నదృశ్యురాలుకాఁగా నే నిక్కడకు వచ్చితిని.

మక:—వయస్యా! మాధవా! నీవు చెప్పినవృత్తాంతమును బట్టి యీ మాలతి తననలపెల్ల నీమీఁదనే నిలిపినట్టు స్పష్టమగుచున్నది. ప్రాగనురాగసూచకముగాఁ గపోలతలము వెల్లఁబాఱుటయు నీ నిమిత్తమే. నిన్నక్కడఁజూచినదో కాని చూచినది. కులశీల గుణగణోపేతలగు తాదృగ్భాగ్యవతులకు మనస్సొకచోటను దృష్టి వేఱొకచోటను దగిలియుండవు. ఇంతేగాక,

ఉ. తొయ్యలి నీవయున్నవలవు ♦ తో ల్తనెనిల్పినదాని చిన్నలా
నొయ్యనఁ దత్సఖీజనము ♦ గొంపోరు మోములఁ జూచుకొంచొగిన్
"అయ్యరొయొకండెవండో యొక ♦ యమ్మకునై యిటనున్న వాఁడ" టం
చయ్యెల నాగనాడుటయు ♦

మాధ:—ఇంకొక టి?

మక:— అల్లలవంగిక వ్రాఫలోక్తులున్. ౩౮.

కల:—(చేరవచ్చి) ఇదియొకటిగూడ [చిత్రపటమును జూపు చున్నాఁడు.]

మాధ:— మక—[చూచుచున్నారు.]

మక:—ఇది మాధవుని రూపమే! యెవరువ్రాసినారు?

కల:—ఎవరు వీనిహృదయమును దొంగిలించినారో.

మక:—మాలతియేనా?

కల:—మరేమి?

మాధ:— చెలికాఁడా! మకరందా! నీవు చేసినయూహ యిప్పుడు సరిగానే యున్నది.

మక:—నీకిది యెట్లు లభించినది?

కల:——లవంగిక మందారికచేతి కిచ్చినది. మందారిక నాచేతి కిచ్చినది.

మక.—మాధవుని రూపమును లిఖంచుటయందు మాలతి యుద్దేశ మేమైయుండినట్లు నీతో మందారిక చెప్పినదో చెప్పుము.

కల:—ఉత్కంఠావినోదనమని.

మక:—మిత్రుఁడా! యింక నూఱటనొందుము.

ఉ. వెన్నెల మాడ్కిఁ జూడ్కికిని ♦ వేడ్కయొనర్చెడు నీకుఁగాంతయుం
బున్నము సేసి పుట్టితివి ♦ ముద్దియకీప్సిత బంధబంధువై
కన్నియతోడి సంగమము ♦ గల్గుటకోసఖ! యింకసంశయం
బున్నదె? యవ్విధిన్మరులె ♦ యొద్దికమైఁ గృషిసేయుచుండఁగా. ౩౫.

నిన్నిట్లు మరులుకొలిపి వికారముల పాలుచేసిన యా సుందరాంగిరూప మిందుఁ వ్రాయుదును. చూతము.

మాధ:—మిత్రునికోరిక యెట్లో యట్లే [కలహంసునితో] కలహంసా! ఉపకరణములను దెమ్ము.

కల:—[ఇచ్చుచున్నాఁడు]

మాధ:—[వ్రాయుచు] మిత్రుఁడా! మకరందా!

చ. వెడలెడి బాష్పపూరమది ♦ వీక్షణపంక్తి ననుక్షణంబుఁగ
ప్పెడుఁ, బడఁతిన్మనిల్పు ♦ వేగనాడల్ జడిమంబుగొంచుమ్రా
న్పడియెడు, వ్రాయఁబూనుకొనఁ ♦ బాణియుఁదోఁచ చెమర్చియెంతయున్
వడఁకెడియంగుళుల్ గలిగి ♦ వర్తిలుచుండె నిఁకేమిసేయుదున్. ౩౬.

అయినను పట్టిపట్టి వ్రాయుచున్నాను. [అని యెట్టకేలకు వ్రాసి చూపుచున్నాఁడు.]

మక:—[చిత్రమును బరిశీలించి] బాగున్నది. నీ యనురాగమునకుఁ దగినట్లు లిఖించితివి. [సంతోషముతో] ఇదిగో పద్యమును గూడ వ్రాసితిని.

"చ. ప్రకృతి మనోహరంబులగు ♦ రాజకళాది సమస్త వస్తువుల్
నుకరగతిన్ మదన్యులను ♦ జొక్కఁగఁ జేసినఁ జేయునేమొ? యీ
వికచపయోజ లోచనను ♦ ప్రీతిమెయింగనఁగంటి, జన్మసా
ర్థకముగ నాకదే ఘనత ♦ రంబగు నుత్సవమా జగంబునన్." ౩౭.

[అని చదువుచున్నాఁడు.]

మందా:—[ప్రవేశించి] కలహంసా! కలహంసా! దొంగా! దొంగా! అడుగుజాడనుబట్టి పట్టుకొంటిని. [మాధవ మకరందులను

జూచి సిగ్గుతో] ఆమహానుభావులుగూడ నిక్కడనే యున్నారు. [సమీపించి] దండములండి!

ఉభయులు:—మందారికా! పనిమీఁద వచ్చితివి. రమ్ము. కూర్చుండుము.

మందా:—[కూర్చుండి] కలహంసను నడిగి చిత్రఫలకమును దీసికొనిపోదమని వచ్చినాను.

కల:—ఇదిగో పుచ్చుకొనుము.

మందా:—ఎవరు ఎందుకొఱకు ఇందు మాలతిని లిఖించినారు?

కల:—మాలతి యెవరిని ఎందుకొఱకు లిఖించినదో!

మందా:—[సహర్షముగా] అదృష్టవశమున బ్రహ్మదేవుని నేర్పునకు ఫలము తరుణమునందే కలుగుచున్నది.

మక:—సఖి! మందారికా! యీ వస్తువిషయమున, ఈ నీ ప్రియుఁడు చెప్పిన దట్టిదే కదా?

మందా:—మహాభాగా! అట్టిదే.

మక:—ఇంకొకటి, మాధవుని మాలతి యిం దెక్కడఁ జూచినది?

మందా:—మేడమీఁది కిటికీలోఁ బోవుచుండఁ జూచినదని లవంగిక చెప్పినది.

మక:—సరే! నే ననుకొన్నట్లే. మేము మంత్రిగారి వీధినిఁ బెక్కుమాఱులు పోవుచుందుము లే!

మందా:—మహాభాగ! అనుజ్ఞ యైనయెడల కామదేవుని యొక్క యీ విలసితమంతయు నిప్పుడు వెళ్ళి ప్రియసఖియైన లవంగికకుఁ జెప్పుచున్నాను.

మక:—ఇంతకన్న సమయము లేదు. పోయి నీవు చెప్పవచ్చును.

మందా:—[చిత్రపటమును బుచ్చుకొని విమర్శించుచున్నది]

మక:—వయస్యా! మధ్యాహ్నము కావచ్చినది. రమ్మింటికే పోదము. [ఇద్దఱును లేచి యిటునటు నడచుచున్నారు.]

మాధ:—ఇప్పుడు,

చ. నరసిరుహాక్షి కూడికము ♦ వల్పుచుఁగూడ వెలంగుచొక్కళ్లుం
దెఱవలు నేర్పుమీఱఁ దమ ♦ విద్దపుఁజెక్కులఁ గుంకుమంబుతో
మురువుగ దిద్దికొన్నయల ♦ ప్రొద్దుటిపత్ర విచిత్రవై ఖరుల్
గరఁగెడునంచు నెంచెదను ♦ గ్రమ్మ వెనందిగ జాఱుచెమ్మటన్. ౩౮.

మఱియు,

ఉ. కుందలతాళి కాననవ ♦ కోమలకుట్మల సీమలందుని
ష్యందమరంద బిందువుల ♦ సాంద్రసుగంధము లందికొన్న యో
మందసమీర! యానతివ ♦ మంజుగాత్రిని నాతిచంచలా
క్షిం దగఁ గౌఁగిలించుచు న్నృ ♦ శింపుమి నాయఖిలాంగకంబులన్.

మక:—[తనలో]

తే. గీ. మారుడఁ నివార్యుఁడీసుకు ♦ మారదేహు
నెట్లు బాధించుచున్నాఁడొ ♦ కృపదొఱంగి;
లోలుతనేత్రిదోషవివర్త ♦ కలితమగుచుఁ
గలభమును దీవ్ర * కూటపా ♦ కలమువోలె. ౪౦.

కాఁబట్టి మా కిప్పట్టున భగవతి కామందకియే శరణము.

మాధ:—[తనలో]

తే. గీ. పిచ్చు పొందామరకునీను ♦ వచ్చుముద్దు
మొగము నావంకఁ ద్రిప్పిన ♦ మగువమిన్న
కానఁబడెడు నాకు వివర్త ♦ మానయగుచుఁ
నీవ, లావల, లో, వెలి ♦ నెల్లయెడల. ౪౧.

* గజజ్వర విశేషము.

[ప్రకాశముగా] వయస్యా! నా కిప్పుడు,

చ. జ్వరమదియేదియో విరియఁ ♦ బాఱిశరీరము వేఁచివైచెడున్
స్ఫురణము దగ్గియుండెడుఁ బ్ర ♦ మోహవశంబున నింద్రియంబులుం
గరమభిలాషఁ జెందినాఱుఁ ♦ గంగను గ్రాఁగుచున్న నా హృదం
తరముద్వలించెడున్ మఱియుఁ ♦ దన్మయతన్ భజియించుచుండెడున్.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ప్రథమాంకము సంపూర్ణము.

—0—

# మాలతీమాధవము

## ద్వితీయాంకము

ప్రథమరంగము—మాలతీగృహము.

[తరువాత నిద్దఱు చేటికలు ప్రవేశించుచున్నారు.]

ప్రథ:—సఖీ! సంగీతశాలదగ్గఱ నవలోకితతోఁగూడి భగవతి కామందకి యేమో యాలోచించుచున్నది!

ద్వితీ:—చెలీ! మాధవుని వేదుక చెలికాఁడైన మకరందుని వలన మదనోద్యానమందు నడచిన యావద్వృత్తాంతమును దెలిసికొన్నదై యిప్పుడు భగవతి యమ్మాయిగారినిఁ జూచు కోరికతో నామె యేమిచేయుచున్నదో చూచిరమ్మని యవలోకితను బంపినది. అంతలో నే నామె కెదురుపడి "అమ్మాయిగారు లవంగికతో నేకాంతమున్నార"ని చెప్పితిని.

ప్రథ:—పొగడపూవులు గోసి తెత్తునని లవంగిక మదనోద్యానములో వెనుకఁబడ్డదే! తిరిగి వచ్చినదా?

ద్వితీ:—రాకేమి! అమ్మాయిగా రామె వచ్చుచుండుటను దూరమునుండి చూచి యెదురేగి చేయిపట్టుకొని పరిజనులెవ్వరును లేని తన మేడమీఁది ప్రక్కగదిలోనికిఁ దోడుకొనిపోయినది.

ప్రథ:—సరే చెప్పెడిదేమి? ఆ మహానుభావుని వృత్తాంతమడిగి తెలిసికొని వినోదించుచున్నది.

ద్వితీ:—[నిట్టూర్పువుచ్చి] ఆమె యూఱటనొందుట యెక్కడిది? తోఁటలో మాధవుని నా విధముగాఁ జూచియున్నపిదప నామె యనురాగమునకు మేరయేయుండదు. వయిగా భర్తృదారికను నంద

నన కిమ్మని మహారాజుగారు కోరఁగా ఆయనతో మంత్రిగారీ యుద యమే యిట్లు మనవిచేసినారు.

ప్రథ:—ఎట్లు?

ద్వితీ:—తమవిల్లదానివిషయములోఁ దమచిత్తమని. అందు చేత నీ మాధవానురాగము మాలతి కామరణాంతము హృదయశ ల్యమై పీడించునని భావించుచున్నాను.

ప్రథ:—ఈ విషయమున భగవతి తనమాహాత్మ్యము నిం చుక ప్రకటన చేయకుండునా?

ద్వితీ:—ఓసి యెందుకే యీ మాటలు? రావే పోదము.

[ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.]

—o—

[ప్ర వే శ క ము.]

[తరువాత మాలతియు, లవంగికయు నుపవిష్టలై ప్రవేశించుచున్నారు.]

మాల:—సఖీ! తరువాత. తరువాత.

లవం:—తరువాత నా మహానుభావుఁ డీ వకుళమాలిక నిచ్చి నాఁడు [ఇచ్చుచున్నది.]

మాల:—[మాలికఁ బుచ్చుకొని సంతోషముతోఁ జూచి] చెలీ! యీకూర్పుగుదుదిగుడుగా నున్నదే.

లవం:—అట్లుండుట నీదే యపరాధము.

మాల:—అదెట్లు?

లవం:—ఆ శ్యామలాంగుని కట్లు హస్తవికలత్వముగలిగిం చినవా రెవరని?

మాల:—చెలీ! లవంగికా! నీ వెప్పుడు నిటువంటి యూఱడింపు మాటలే చెప్పుచుందువుగదే!

లవం:—చెలీ! నే నేమంటిని? మలయానిలమునకుఁ జలించు తెలిదమ్మిరేకులవలెఁ జెలువు మీఱినవియు, నిన్నుఁ జూచుటచేఁ గలిగిన యాకారవికారమును గప్పిపుచ్చు కోరికతో నగము కూర్చి నిలిపిన పొగడదండపై సప్రయత్నముగా దృష్టి నిలిపినప్పుడు విప్పునొందినవియు, నగు కన్నులతో నిన్నతఁడు వెల్లివిరిసిన యాశ్చర్యరసముచే నిశ్చలములై నిడుదలైన లోచనప్రాంతముల నరికట్టినట్లొప్పు భ్రూలతికలవిలాసముచే మన్మథబాణసంరంభమును దెలియఁజేయుచుఁ గడు నొయారముగాఁ జూచుచుండ నతనిని నీవే చూచితివిగాదా?

మాల:—[లవంగికను గాఁగిలించుకొని] చెలీ! చెంతనున్నవారిని చిటికెలో భ్రమింపఁజేసెడి యీ విలాసము లాతనికి సహజములే యేమో! అట్లుగాకున్నఁ బ్రియసఖి యూహించినట్లే.

లవం:—[నవ్వి యసూయ నొందినదానివలె] అప్పుడు నీవును నీకు నీవే అంగుళేకుండనే యాటాడినావు.

మాల:—[సిగ్గుపడి నవ్వి] తరువాత. తరువాత.

లవం:—తరువాత జాతరఁ జూచి యిండ్లకు మరలెడి పౌరజనుల నందడిలో నాతఁ డదృశ్యుఁడు కాఁగా నేను మందారికయింటికి వచ్చితిని. ప్రొద్దుట దానిచేతికి చిత్రఫలక మిచ్చితినిలే!

మాల:—ఎందుకొఱకు?

లవం:—మాధవుని యనుచరుఁడైన కలహంసుఁడు దాని యందుఁ దగిలియున్నాఁడు. కాఁబట్టి యతని కామె చూపించఁగలదని. అంతట మందారిక నా కొక ప్రియము చెప్పినది.

మాల:—[తనలో ఆనందముతో] కలహంసుఁడును తన యజమానునకా ప్రతిచ్ఛందకమును చూపఁగలఁడు. [ప్రకాశముగా] చెలీ! యేమిటి ప్రియము చెప్పినదంటివి?

లవం:—ఇదిగో నీకు సంతాపము కలిగించి తాను సంతాపము నొందుచు దుర్లభములైన కోరికల కవకాశమిచ్చి సహింప నలవికాని యలజడిచే సలసల మఱుఁగుచున్న తన హృదయమున కొక్కించుక సేపూఱట గలిగించుకొనుటకై యతఁడు లిఖించిన నీ ప్రతిచ్ఛందకము. [చిత్తరువును జూపుచున్నది.]

మాల:—[సంతోషముతో నూర్పువుచ్చి, తడవుచూచి] అయ్యో! యిప్పుడు సైతము నాహృదయమున కూఱట గలుగకు న్నది. ఈ యూఱట నిజమైనదని నమ్మవచ్చునా? ఇదిగో నిక్కడ నేమో వ్రాయఁబడియున్నది. [అని "ప్రకృతిమనోహరంబులగు" అను పద్యమును జదివి యానందముతో] మహాభాగ! నీ వాక్మాధుర్యము నీకే తగును. ఇంక నీ దర్శన మప్పటికి మనోహరమైనను దీర్ఘమైన దుస్సహసంతాపమును గలిగించుటచే తుదకు దారుణమైనదిగా నుం డును. నిన్నుఁ జూడనిస్త్రీలును చూచి మమతనొందనిస్త్రీలును ధన్యు రాండ్రుగదా!

లవం:—చెలీ! యాప్రకారముగానైనను నీకూఱటగలుగదా?

మాల:—చెలీ! యేప్రకారముగా?

లవం:—ఎవనినిమిత్తమై తొడిమె పట్టువిడిచిన యశోకపల్ల వమువంటి హృదయమును, వాడిపోయిన విరజాజిపూవువంటి సుకుమా రమైన శరీరమును ధరించిన నీవును మన్మథునిచేఁ గృశియింపఁజేయఁ బడుచున్నావో, అతఁడును భగవంతుఁడైన కుసుమాయుధునివలన సంతాపముయొక్క దుస్సహత్వ మిట్టుండునని తెలిసికొనుచున్నాఁడు.

మాల:—చెలీ! ఆ మహానుభావుఁ డీ బాము లేవియు లేక సుఖముగా నుండుఁగాక! ఇంకనా కూఱట గలుగుట యసంభవము. [అని కంటఁ దడిపెట్టి]

ఉత్సాహ.

విరతిలేక విసమువోలె ♦ విరియఁ బాఱితీవ్రమై
కెరలి ధూమరహితమైన ♦ కీలిఁబోలి మండుచున్
జ్వరమువోలె నవయువములఁ ♦ బరిమథించు నీవ్యథం
దరమె తొలఁచినన్నుఁ బ్రోవఁ ♦ దల్లియేని దండ్రియేన్. ౧.

లవం:—చెలీ! అది యట్టిది. సజ్జనసమాగమములు ప్రత్యక్షమందు సౌఖ్యదాయకములును పరోక్షమందు దుఃఖదుస్సహములును నై యుండును. ఒక్కమాఱు అట్లు మేడమీఁది సోరణగండినుండి వానిం జూచినంతమాత్రముననే నీకు నిండుచందురు పండువెన్నెల నిప్పులగుండమై యుండెనే! నీ శరీరావస్థ చూడఁగా క్రూరుఁడైన యా కామదేవుని బారికిఁ దప్పి బ్రదికి బైటఁ బడుదువో లేదో యని సంశయింపవలసివచ్చెనే! ఇంకను నేఁటి వానిపునర్దర్శనముచే నీకు సంతాపము దురంతముగా నుండునని వేఱె చెప్పవలయునా? కాఁబట్టి ప్రియసఖీ! దుర్లభవిషయమైన మనోరథము నీడేర్చుకొనుటయే శ్లాఘనీయము. ప్రపంచమందలి ప్రాణికోటికెల్లను అట్టి మనోరథము తుల్యగుణానురాగమైన వల్లభసమాగమమని మేము తలంచుచున్నాము.

మాల:—ఓసీ! మాలతి యెటులైనను బ్రదికినఁ జాలునని ప్రేమకొలఁది నిట్లు తెగువలు బోధించుచున్నావు. నా జోలికిరాకు పొమ్ము. [అని కంటఁ దడిపెట్టి] నిన్ననవలసిన పనియేమి? నేనే హృదయమునుండి సారెసారెకుఁ బాఱ నుంకించుధైర్యము నెట్టెటో బలవంతముగాఁ జిక్కఁబట్టి తుదకు గట్టుచెడి సిగ్గువిడిచినదాననైనాను. కాఁబట్టి ప్రియసఖీ!

కవిరాజ విరాజితము.

గగనమునం బతిరాత్రియుఁ జంద్రుఁడ ♦ ఖండకళంగొని వెల్గఁగని
మ్మొగసిమరుండుదహింపఁగనిమ్మిఁక ♦ మృత్యువుదక్క నుతేమియగున్
సుగుణుఁడుదండ్రియుఁ బావనితల్లియు ♦ శుద్ధకులంబును జట్టములై
తగియొడునాకిఁకజీవితమున్ మఱి ♦ తంమనుగారొకయించుకయున్.

లవం:—[తనలో] ఇప్పు డేమిబుద్ధి?

ప్రతీహారి:— [ప్రవేశించి] ఇదిగో మహానుభావురాలు కామందకి.

ఉభయులు:—ఏమి భగవతియా?

ప్రతీ:—అమ్మాయిగారిని జూడఁగోరి వచ్చినారు.

ఉభ:—అటులయిన నాలస్య మెందుకు?

ప్రతీ:—[నిష్క్రమించుచున్నది]

మాల:—[చిత్రపటమును దాఁచుచున్నది.]

లవం:—[తనలో] సమయమునకు వచ్చినది.

[అప్పుడు కామందకియు అవలోకితయుఁ బ్రవేశించుచున్నారు.]

కామం:—మేలు! మిత్రుఁడా! మేలు! భూరివసూ! "తనుపిల్ల దానివిషయములోఁ దమచిత్త" మని యుభయలోకములకు విరుద్ధము గాకుండునట్లుగాఁ బ్రత్యుత్తరమిచ్చితివి. ఇంతేగాక యిప్పటి మదనోద్యాన వృత్తాంతమును బట్టి దైవముకూడ ననుకూలుఁడుగా నున్నట్లు తోఁచుచున్నాను. వకుళావళీ చిత్రఫలకముల యిచ్చి పుచ్చుకోళ్లును అత్యద్భుతమైన యొక యుల్లాసమును గలిగించుచునే యున్నవి. అవును వివాహతంత్రమందుఁ బ్రధానశోభనము పరస్పరానురాగమే. ఈ యర్థమున నంగిరసుఁడుకూడ నిట్లు చెప్పుచున్నాఁడు. "యస్యాం మనశ్చక్షుషోర్నిబంధ స్తస్యా మృద్ధిః" అని.

అవ:—ఇదిగో మాలతి.

కామం:—[చూచి]

చ. వలుచనఁబాఱె నంగములు • పైపొరలూర్చిన యంటికంబవుం
దెలిజిగిమీఱె, నొంటికళ • నిల్చినచంద్రుని మూర్తివోలెన
త్పులవలరించుచుఁ మిగుల • సూనశరావల భూరిదాహవి
హ్వలయగు నీకుమారి దుర • వస్థకు మూలగు ఖేదమోదముల్. ౩.

మఱియు,

చ. మొగమువివర్ణమయ్యెనుగ • పోలతలంబులు ధూమ్రమయ్యెనీ
మగున మనోహరత్వమును • మాత్రమువీడదు చిత్రమై ఖరిన్
జగతిని సర్గరమ్యులయి • జన్మమునొందిన వారిపట్టునన్
మగుడక మీఱుమారసుకు • మారవికారము శోభఁబొందదే? ౪.

నిశ్చయముగా నీమె యిప్పుడు మనఃకల్పితమైన ప్రియసమాగమము ననుభవించుచున్నది. ఏమనఁగా,

చ. ప్రిదిలిననీవియుం, దమిస్ఫు • రించెడిమోవియు, దోర్ద్వపాదమున్,
గుదిగొను స్వేదముం, దళుకు • నుస్గడగంటి బెడంగుఁజూపులున్
బాడలినమ్రానుపాటుఁ, జను • మొగ్గలతల్లడపాటుఁ, జెక్కులం
బదిఁబదిఁదోఁచు నిగగురు • పాటునుమూర్ఛయుఁ జేతనత్వమున్.

అను నీలక్షణము లీమెయందు గోచరించుచున్నవి. [సమీపించుచున్నది.]

లవం:—[మాలతిని చేతితోఁ దట్టుచున్నది.]

మాల:—భగవతికి వందనము చేయుచున్నాను.

కామం:—భాగ్యజన్మమెత్తినఫలమును బడయుదువుగాక!

లవం:—ఇదిగో పవిత్రాసనము. [అందఱుఁ గూర్చున్నారు.]

మాల:—భగవతికిఁ గుశలమా?

కామం:—[నిట్టూర్పువుచ్చి] కుశలములాగే యున్నది.

లవం:—[తనలో] కపటనాటకముయొక్క ప్రస్తావన యారంభమైనది. [ప్రకాశముగా] భగవతి కిప్పుడు బాష్పభారముచే డగ్గుత్తిక వడిన కంఠములోఁ దగులుకొని మాట యొకపట్టునఁగాని పైకి రాకయున్నది. ఇంత యుద్వేగమునకుఁ గారణ మేమై యుండును!

కామం:—చిఁకుబొంతకుఁ దగని యీ పరిచయమే.

లవం:—అది యెట్లు?

కామం:—ఓసి నీకును దెలియకున్నదా!

క. మదనుని విజయాస్త్రంబీ
సుదతిశరీరంబు సహజ ♦ సుభగవిలాసా
స్పదము గుణహీనవరునం
బ్రదానమున వెఱతుగుణము ♦ ఫలమగునంచున్. ౬.

మాల:—[వెలవెలపోవుట నభినయించుచున్నది.]

లవం:—ఇది నాకుఁ దెలియును. రాజనిర్బంధముచే మాలతిని నందనున కీయ నిశ్చయించినాఁడని జనులందఱు భూరివసువుగారి నీసడించుచున్నారు.

మాల:—[తనలో] నాతండ్రి నన్ను రాజున కిట్టు బలిఁయిచ్చుచున్నాఁడో!

కామం:—ఆశ్చర్యము!

చ. పరియని దీనికిం గుణవి ♦ చారము సేయక పూనుకొన్నవాఁ
డరయఁగ వక్రనీతినిపు ♦ ణాత్ములకున్నె యపత్యమోహముల్?
మురియుచుఁ గూఁతు నిచ్చెడు ♦ ముద్దుగఁ బెండిలిఁ జేసి పూజ్యుఁడౌ
నరపతి నర్మమిత్రుఁడగు ♦ నందనసఖ్యముఁ గోరఁబోలెనున్. ౭.

మాల:—[తనలో] తండ్రిగారికి రాజారాధనమే ముఖ్యముగాని మాలతిగాదు,

లవం:—భగవతి సెలవిచ్చినట్లు. అలాగే కానియెడల యావ నముజాతినవాఁడును, సురూపుఁడును నైన యా వరునివిషయమున నమాత్యుఁ డేల శంకసేయఁడు?

మాల:—[తనలో] అయ్యో! మందభాగ్యురాలను. నా కన ర్థము చేరువై వజ్రపాతమువలెఁ బడ మొత్తుచున్నది.

లవం:—కాఁబట్టి తల్లి! భగవతి! యనుగ్రహించి మా ప్రియ సఖి నీ జీవన్మరణమునుండి రక్షింపుము! నీకుమాత్ర మీమె కూఁతు రుగాదా?

కామం:—ఓ సుశీలురాలా! యిందు భగవతి యేమిచేయఁ గలదు? సాధారణముగా కన్యకలకు తండ్రియు, దైవమునుగదా రక్ష కులు! దుష్యంతుని విశ్వామిత్ర పుత్రికయగు శకుంతలయు, పురూర వుని నూర్వశియను నచ్చరయుఁ గోరి పెండ్లాడిరని పురాణవేత్తలు చెప్పుదురు. వాసవదత్త తండ్రి తన్ను సంజయున కీయ నిశ్చయింపఁగా తాను స్వయముగా నుదయనమహారాజును వరించినట్లున్నది. కాని అవియెల్ల సాహసప్రాయములగుటచే నుపదేశింపఁబడఁదగినవి కావు. నమస్తవిధముల,

చ. ఘనునకుఁ దాఁబ్రియుండునను ♦ హృత్తును మంత్రియునై వరించునం
దనునకుఁ గార్యమెంచినిజ ♦ నందననిచ్చి కరంబుస్వస్థతం
గనియెడుఁగాక మాత్యుఁడిఁకఁ ♦ గాంచిననెగ్గు జనించురాహుతో
నెనసిన చంద్రరేఖవలె ♦ నీసతియాతని చెట్టఁబట్టెడున్. ౮.

మాల:—[తనలో] హా! తండ్రీ! నీవుగూడ నిది నాకుఁ గూడ దనక కేవలము భోగతృష్ణకు లోనయినాఁడవు.

అవ:—భగవతి వచ్చి చాలసేపయినది. మాధవుఁ డస్వస్థచి త్తుఁడుగా నున్నాఁడు.

కామం:—ఇదిగో వెళ్లుదము. అమ్మాయీ పోయివత్తుమా?

లవం:—[జనాంతికముగా] చెలీ! మాలతీ! యిప్పు డా మహానుభావుని కులశీలాదులను భగవతి నడిగి తెలిసికొందము.

మాల:—నాకును కుతూహలముగా నేయున్నది.

లవం:—[ప్రకాశముగా] ఇట్లు భగవతియొక్క వాత్సల్యమునకుఁ బాత్రుఁడగుచున్న యీ మాధవుఁడనువాఁ డెవఁడు?

కామం:—చెప్పవలసినది చాలఁగానున్నది. ఇప్పు డాగాథ యెందుకు?

లవం:—అయినను భగవతి చెప్పి యనుగ్రహించునుగాక!

కామం:—అటయిన వినుము. పురుషశ్రేష్ఠులకెల్లఁ జూడామణియై దేవరాతుఁడని విదర్భరాజు మంత్రియొకఁడుండును. అతఁడును మీతండ్రియు సహాధ్యాయులగుటవలన సకలలోకమాననీయ పవిత్రచరిత్రుఁడగు నా మహానుభావుని మీ తండ్రియే యెఱుఁగును.

మఱియు,

మాలిని.

వ్యతికరితసమస్తా • శాంత శుభ్రోరుకీర్తుల్
వితతసుకృతిలీలా • విక్రమస్థానభూతుల్
నుతమహిమసమేతుల్ • భూరిలక్ష్మీనికేతుల్
క్షితితలమునఁ దాదృ • క్ఛ్రీయుతుల్ పుట్టుపెట్టుల్. ౯.

మాల:—[సంతోషముతో] చెలీ! యిప్పుడు భగవతి పేర్కొనినవారినే కాఁబోలును తండ్రిగారెప్పుడును స్మరించుకొనుచుందురు!

లవం:—చెలీ! భగవతితోఁగూడి వా రిద్దఱు నొక గురువునొద్ద విద్యాభ్యాసము చేసిరని పెద్దలు చెప్పుదురు.

కామం:—

ఆ. గీ. ఉదయగిరినిఁబోలె ♦ నుదయించె నతనికి
స్ఫురిత గుణవిలాస ♦ సుందరుండు
వరకళాన్వితుండు ♦ ప్రాణిలోచనమహో
త్సవకరుండు బాల ♦ చంద్రుఁ డొకఁడు. ౧౦.

లవం:—[పెడమొగముగా] మాధవుఁ డతఁడే కాఁబోలును.

కామం:—

శా. బాలుండయ్యును నిల్లువెల్వడికళా ♦ భ్యాసంబుకై యిప్పుడీ
ప్రోలింజేరి వసించుభాసురశర ♦ త్పూర్ణేందు బింబాననుం
బాళింజూచెడి లోలలోచనల యు ♦ న్మాదంపు వాల్చూపులన్
మేలౌ కల్వలసోగ్రగండ్లెనఁగెనా ♦ మించుంబురంబయ్యెడన్. ౧౧.

ఇప్పు డాతఁడు తన బాలమిత్రుఁడైన మకరందునితోఁగూడి నీతిశాస్త్రము నభ్యసించుచున్నాఁడు. అతఁడే మాధవుఁడు.

మాల:—[ఆనందముతో జనాంతికముగా] చెలీ! లవంగికా! వింటివా యాభాగ్యశాలి యెంత గొప్పకులమందుఁ బుట్టినాఁడో?

లవం:—[జనాంతికముగా] మహాసముద్రమును విడిచి కల్పవృక్ష మెందుండి పుట్టఁగలుగును?

కామం:—ఓహో! యెంత ప్రొద్దుపోయినది. ఇప్పుడు,

చ. ననవిలుకాని పోరులన ♦ నంగిపెనంగి శ్రమంబుపైకొనన్
గనులరమోడ్చు చక్రమిథు ♦ నంబులుకంపిలి యప్డెమేల్కనన్
ఘనతరహార్మ్యగర్భముల ♦ గాఢముగాఁ బ్రతినాదమిచ్చునీ
యనిభృత సాంధ్యశంఖరవ ♦ మాకసమంతటఁ బర్వుచుండెడున్.

మాల:—[పెడమొగముగా] నాతండ్రి నన్ను రాజున కిట్లు బలియిచ్చుచున్నాఁడో! తండ్రిగారికి కూఁతు రేమైపోయిననేమి? రాజా

రాధనమే ముఖ్యము కాని. హా! తండ్రీ! నీవును నిది నాకుఁ గూడద
నక కేవలము భోగతృష్ణకు లోనయినాఁడవు. [ఆనందముతో] ఆ
మహానుభావుఁ డెంత గొప్ప కులమందుఁ బుట్టినాఁడు! ప్రియసఖ
చక్కఁగాఁ జెప్పినది. అవును మహాసముద్రమునువిడిచి కల్పవృక్ష
మెందుండి కలుగును? కానిమ్ము. వాని నింకొకసారి చూడవలయును.

లవం:—దేవీ! యీ నాలుగిండ్ల నవంతిలోనుండి పోదము.

కామం:—[వెకమొగముగా] అవలోకితా! యిప్పుడు తటస్థ
ముగా నుండియే మాలతివిషయమున నిష్టార్థమూత్యమును జక్కఁగా
నడిపి తద్వారమును జాలవఱకుఁ జులకన చేయఁగలిగితిని. ఏమంటేని,

ఉ. ఎంచితి నెగ్గునందనున ♦ కించుక దండ్రిని నమ్మరామియూ
పించితిఁ బూర్వగాథలను ♦ బేర్కొని తెల్పితిఁ గార్యపద్ధతిన్
మంచిగ మాటవెంబడిని ♦ మాధవువంశము విద్యయుం బ్రశం
సించితి, నింక నాకునవ ♦ శిష్టముదీనిని జేరఁదీయుటే. ౧౩.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ద్వితీయాంకము సంపూర్ణము.

# మాలతీమాధవము

## తృతీయాంకము.

ప్రథమరంగము—కామందకిగృహము.

[తరువాత బుద్ధరక్షిత ప్రవేశించుచున్నది.]

బుద్ధ:—అవలోకితా! భగవతి యెక్కడనున్నదో యెఱుఁగుదువా?

అవ:—[ప్రవేశించి] బుద్ధరక్షితా! యెఱుఁగవాయేమి? పిండ పారణవేళను మించఁబెట్టి మాలతి ననునయించుటకు భగవతివెళ్ళి యెంతసేపో అయినది.

బుద్ధ:—మఱి నీ వెక్కడనుండి వచ్చుచున్నావు?

అవ:——నేను భగవతి పంపఁగా మాధవునికడకుఁ బోయి యతనితో "నీవిప్పుడు శంకరపురము చేరువ కుసుమాకరోద్యానమునకుఁ బోయి యందొక్క రక్తాశోకవృక్షముక్రింది పూపొదరింట వసించి యుండు"మని చెప్పివచ్చితిని. అతఁడును అక్కడకు వెళ్లినాఁడు.

బుద్ధ:—అవలోకితా! యెందుకని యక్కడకు మాధవుఁడు పంపఁబడినది?

అవ:—నేఁడు కృష్ణచతుర్దశియని తల్లితోఁగూఁడ మాలతి శంకరపురమునకుఁ బోఁగలదు. పిమ్మట భగవతి మాలతినిఁ బిల్చి బిడ్డా! నీచేతులతో నీవే దేవతారాధనమునకుఁ బూవులుగోసిన యెడల సౌభాగ్యము వర్ధిల్లునుజుమీయని చెప్పి యామెను లవంగికా సహితముగా నా యుద్యానవనమునకే తీసుకొని రాఁగలదు. అక్కడ నన్యోన్య దర్శనము కాఁగలదు. మఱి నీ వెక్కడకు?

బుద్ధ:—శంకరపురమునకుఁ బోవుచు మన ప్రియసఖి మదయంతిక నన్నుఁగూడఁ దనవెంట రమ్మన్నది. అందుచేతనొకసారి భగవతికిఁ బాదాభివందన మాచరించి మఱి యక్కడకుఁ బోదమనివచ్చినాను.

అవ:—భగవతి నిన్నే పనియందు నియోగించినది? అక్కడి సమాచారమేమి?

బుద్ధ:—నేనును భగవతియాజ్ఞ ననుసరించి యద్యైకథలలోఁ బెట్టి మకరందుఁ డిట్టివాఁ డట్టివాఁడని నమ్మకము పుట్టునట్లుగాఁ జెప్పి యాతనిమీఁదం బ్రియసఖయైన మదయంతికకుఁ బరోక్షానురాగ మెక్కువయగునట్లు చేసితిని. ఇప్పుడామె యాతనిదర్శనము నభిలషించుచున్నది.

అవ:—మేలు! బుద్ధరక్షితా! మేలు!

బుద్ధ:—రమ్ము పోదము.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

—౦—

ద్వితీయరంగము—కుసుమాకరోద్యానము.

కామం:—[ప్రవేశించి]

క. మునుపే వినయమునఁ గాఁకవ
యును గలదిప్పుడు మెలపున • నొకకొన్నాళ్ళన్
మనసిచ్చి చెలులతోఁ బలెఁ
జనవునఁ నాతో మెలంగు • నరణి గరపితిన్. ౧

ఇప్పుడు మాలతి,

ఉ. చింతిలునన్నుఁ జూసి, మఱి • చెంతవసింపఁ గలంక దేఱెడున్,
మంతనమాడుఁ గాన్కలిడు • నున్నసనేయును లేవఁ జూచు నో
గంతునలేచి యడ్డపడి • కంఠము బిగ్గగవుంగిలించుకొం
చెంతయు నొట్టుఁబెట్టుకొని యిప్పుడె రమ్మని మ్రొక్కవేఁడెడున్.

దీనియంతకును గారణము తాఁగోరునదెల్ల నేఁజేయుదునన్న నిబ్బరమైన యాశయే.

క. అన్యాపదేశవాక్యో
పన్యస్త శకుంతలాది ♦ బహుపూర్వకథా
విన్యాసము నాతోడనయిఁ
గన్యామణి యొరఁగివినుచుఁ ♦ గాంచుఁ బరాకున్. ౩.

కాఁబట్టి యిప్పుడు ముందుకార్యమంతయు మాధవ సముఖమందే నడపెదను. [తెరవంకఁజూచి] అమ్మాయీ! యీలాగీలాగు.

[తరువాత మాలతియు లవంగికయుఁ బ్రవేశించుచున్నారు]

మాల:—[తనలో] నాతండ్రి నన్ను రాజున కెట్లు బలియిచ్చుచున్నాఁడు! తండ్రిగారికిఁ గూఁతు రేమైపోయిననేమి రాజారాధనమే ముఖ్యముగాని!. [కంటం దడిపెట్టి] హా! తండ్రీ! నీవును నిది నాకుఁ గూడదనక కేవలము భోగతృష్ణకు లోనయినాఁడవు. [ఆనందముతో] ఆ మహానుభావుఁ డెంత గొప్పకులమందుఁ బుట్టినాఁడు! మహాసముద్రమును విడిచి కల్పవృక్ష మెక్కడఁ బుట్టఁగలుగును? అని ప్రియసఖి చెప్పిన మాట చక్కఁగానున్నది. వాని నింకొకసారి చూచెదనుగాక!

లవం:—చెలీ! యిదిగో! తీయమామిడులపైఁ గమ్మనితేన సోనలచే మెత్తగనానిన పూవుగుత్తులను గొఁకమీఱ నారగించుచు నడుమనడుమఁ గేఁకూయు కోయిలల కోలాహలముల కులికి జుమ్మని యొక్కుమ్మడిగ నాకొమ్మలనుండి ముమ్మరముగ రేఁగి మూఁగి వెఱచి పఱచు మొకరితుమ్మెదల సమ్మర్దముచే స్ఫుటదళాగ్రములైన సంపెఁగపూవులతావులకుం దావలమైనదియు, కుదురగు గొప్ప పిఱుఁదుల వ్రేఁగుచే నించుక మెల్లఁగ నూరుభారముచే నడుగులు తొట్రుప

నడచునప్పుడు పాదములు చెమటబొట్లనెడు నమృతబిందువులచే నందమయిన నీమోము చందురునకుఁ జల్లని మంచి గంధమయినదియు, నగు నీ కుసుమాకరోద్యానమారుతము నిన్నుఁ గవుఁగిటఁ జేర్చుచున్నట్లున్నది. కాఁబట్టి యిందుఁ గొంచెము విహరింతము. [ఇటునటు నడచి ప్రవేశించుచున్నారు.]

[తరువాత మాధవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాధ:—ఓహో! భగవతి యెన్నైనదే! యిప్పుడునాకు,

ఆ, గీ. పాలఁతికన్న మున్న ♦ పాదసూప భగవతి,
యుల్లమూర్పు పుచ్చి ♦ చల్లనయ్యె
మిడికియొండ వేఁడి ♦ మికి వృష్టికిపిముంచు
మెఱుపుఁ జూడనెమ్మి ♦ దొరకునఁబోలె. ౪.

అదృష్టవశమున లవంగికాసహితురాలయి మాలతియున్నది.

తే, గీ. జాతిగల చంద్రకాంతింబు ♦ చేతఃబర్వ
తంబునుంబోలె నాదు ♦ మనఃబుకలువ
కంటిమోము చందురుశలం ♦ గటుగాలు
వాక్రెడు జడిమగొంచును ♦ నారికొర. ౫.

ఇప్పుడు మాలతియందము చెప్పగిప్పరాదు.

క. నలిగిన చంపకమాలిక
చెలువున వసివాడినపసి ♦ చెలియవయవముల్
వెలిఁగించెడు మరుమంటలు
కలిగించెడు మదికిఁజొక్కు ♦ గనఁగలఫలముల్. ౬.

మాల:—చెలీ! యీగుజ్జుపొదరింటఁ బూలుగోయుదము.

మాధ:—

౪. చెలిపలుకులు క్రొత్తగవిని
పులకలు మొలకెత్తనివుడు ♦ పూని వహింతుం
దొలిమొగులు చాలుక్రొంజు
క్కలకలగుచు మొగ్గదొడుగు ♦ కడిమిబెడంగున్. ౭.

లవం:—చెలీ! అట్లుచేయుటము. [పూలుగోయుట నభినయించుచున్నారు.]

మాధ:—భగవతియొక్క యాచార్యక మత్యద్భుతముగా నున్నదిగదా!

మాల:—చెలీ! రమ్ము. మఱొక్క చోటఁ గోయుదము.

కామం:—[మాలతినిఁ గౌఁగిలించుకొని] చాలునమ్మా చాలు అలసినావు.

చ. పడఁతిరో! నీకుఁబలుక్కసడఁ ♦ బాటొదవించెడు, నంగమంగమం
టెడు, నుతిమోముజాబిలిను ♦ టించెడుఁజెమ్మటబొట్టుల,స్టెమూ
సెడుఁ, గనుదోయి, నిట్టులిఁకఁ ♦ జెప్పెడిదేమికుమారి! నీయెడం
దొడఁగిప్రియావలోకనము ♦ తోసరిగాఁ బరిశ్రేమొప్పెడున్. ౮.

మాల:—[సిగ్గు నభినయించుచున్నది.]

లవం:—భగవతి శోభనము సెలవిచ్చినది.

మాధ:—పరియాచకము చక్కఁగానున్నది.

కామం:—ఒక్కమాట చెప్పవలెనని యున్నది. కూర్చుండుఁడు. [అందఱుఁ గూర్చున్నారు.]

కామం:—[మాలతి గడ్డమెత్తి] కళ్యాణీ యాచిత్రము వినుము.

మాల:—అవహితురాలనై యున్నాను.

కామం:—నీవలెనే నా ప్రేమకుఁ బాత్రమై మాధవుఁడను

చిన్నవాఁ డొకఁడు కలఁడని మున్నొకసారి ప్రసంగవశమునఁ జెప్పి యుంటినిగదా!

లవం:—అవును జ్ఞాపకమున్నది.

కామం:—అతఁడు కామోద్యానయాత్రకుఁజూచిన దేమొకలు మిగుల వగలఁబొగులుచు నొడల సెగ పొగలెగయఁబరవశుఁడైన ట్లున్నవాఁడు. ఏమంటే,

చ. కలువల తేఁడునుంజెలిమి ♦ కాఁడునుగూర్పఁగఁగాలువేమకల్
దలఁపఁడు, లోనివెగ్గలపుఁ ♦ దాపముఁదాలిమిదూలి వెల్లడిం
జలిపెడుఁ, దొంటిక్రేంకణపుఁ ♦ జామునిచాయ మెఱుంగుమైపసల్
వెలవెలఁబాఱిచిక్కియును ♦ పీడఁడు వెండిమనోహరుండగున్. ౯.

లవం:—అవును, మాధవుఁడస్వస్థశరీరుఁడుగా నున్నాఁడని యిప్పు డవలోకిత భగవతినిఁ ద్వరపెట్టినది.

కామం:—వీని మన్మథవికారమునకు హేతువు మాలతియే యని యిప్పుడు విన్నాను. నా నిశ్చయముగూడ నట్టిదే. ఏమంటేని,

ఆ, గీ. ఈముఖేందుఁజూడ ♦ నీమనోహరుమనం
బట్టి స్తిమితమును మ ♦ హాశయంబు
నగుపయోధిజలము ♦ పగిదినుత్కలికాత
రళతఁబొందె మిగులఁ ♦ గలఁత నొందె. ౧౦.

మాధ:—ఓహో! యేమియుపన్యాసశుద్ధి! నాకుగొప్పతనముఁ దెచ్చిపెట్ట నెట్లు యత్నించుచున్నది! ఇందాశ్చర్య మేమున్నది?

ఉ. విస్తృత శాస్త్రసంగతిని ♦ పీడనిపట్టు, నిసర్గబోధమ
భ్యస్తగుణ ప్రకర్షమగు ♦ వాణియునుం, బ్రతిభానవత్వమున్
విస్తులిత ప్రగల్భతయు, ♦ నిర్ణయకాల వివేచనంబునాఁ
బ్రస్తుతికెక్కు నిగుణము ♦ లన్ ఫలియించు నభీష్టకార్యముల్. ౧౧.

కామం:—ఏమనఁగా జీవితాశ వదలుకొని యతఁడు చేయఁ బూనకొని దుష్కరములే లేవు

ఉ. కోయని కూయు కోయిలలు ♦ కూడిన మొగ్గల గుజ్జుమామిడిం
బోయికఁ గంగొనుం, బొగడ ♦ పూవుల తావుల నాలిగాలికిం
గాయము నొప్పగించు, మెయిఁ ♦ గప్పిన తామరపాకు దుప్పటిం
బాయక చావదానమును ♦ భ్రాంతిని గంటెదుఁ జంద్రుపాదముల్.

మాల:—ఆయన యిట్టి యతి దుష్కరమును జేయుచున్నాఁడు.

కామం:—ఇట్లు ప్రకృతి సుకుమారుఁడైన యీ కుమారుఁడు తా మున్నెన్నఁ డెఱుఁగని బాములకు లోనయి నీకొఱకు మరణము సైతము సరకు సేయక ఘోరముగాఁ దపించుచున్నాఁడు.

మాల:—[జనాంతికముగా] సఖీ! నానిమిత్తముగా మర్త్యలోకాలంకారభూతుఁడైన యీ మహానుభావున కేమి మూఁడఁగలదో యని శంకచేఁ బిశాచముపట్టిన ట్లేమియుఁ దెలియకున్నాను.

మాధ:—నాయదృష్టము బాగున్నది. భగవతి నాయందు జాలిపుట్టించినది.

లవం:—భగవతి యిట్లు సెలవిచ్చుచున్నదిగనుక నేను మనవిచేయుచున్నాను. మాభర్తృదారికయుఁ దమలోఁ గటిచేరువ రాజమార్గముఖంబును క్షణమాత్ర మలంకరించుచుఁ బోవుచుండెడి యక్కుమారుఁ బెక్కుమాఱులు చూచినదయి సూర్యరశ్మి సోఁకిన తామరదూండ్లవలెఁ జెలువుగులుకు నవయవంబుల శోభచేఁ దెలియఁబడు మన్మథవ్యథావ్యసనములచే సొగసుమీఱియుఁ బరిజనులకు మనస్తాపము గలిగించుచున్నది. ఆటపాటలన్నఁ దలకంటగించుకొనుచున్నది. వసివాడిన చెక్కుటద్దముపైఁ జేయిదీయక ప్రొద్దులు వెళ్ళఁబుచ్చుచున్నది. వికసించిన తామరపూవుల తేనెసోనలచే జానుమీఱి యించుక రేకులెత్తిన కుందమాకందముల మకరంద

బిందువుల మోఁదికొని పీను పెరఁటితోఁటల చల్లగాలుల కడికిపోవు చున్నది. తన మహోత్సవాభ్యుదయమును స్వయముగాఁ జూడఁగోరి కామదేవుఁడే మూర్తీభవించెనన్నట్లు కామకాననాలంకారభూతుఁడై కన్పట్టిన యమ్మాధవుం దానును తన్మమ్మాధవుంమును నిట్లిరువురు నొండొరులం దనివిదీఱఁ జూచుకొనిరి. అప్పుడీమె యౌవనారంభమున కాతని వివిధ విభ్రమ రాగానుబంధమే వెలఁబెట్టఁబడెను. ఒండొరుల చూపు లెదురుకొని జంకి వెనుకఁ దగ్గినవుడు వారికిం బొడమిన చిత్తోద్రేకమును, మించిన తమకమును, అతిశయించిన భయమును, మేనుల ద్రమానుపాటును, అవయవంబుల నిశ్చేష్టతియుఁ, గ్రమ్మిన చెమ్మటలును మొలకలెత్తిన పులకసమితియుఁ, ఝుపారు నత్కంపమును జూచి సభ జను లానందమొందిరి. అది మొదలు సహింప శక్యముగాని యొక శ్రోత్ర యాయాసాతిశయముచే మిగుల దారుణమైన దశాపరి ణామము ననుభవించుచున్నదై నిండుచందురుపోనువు నించుకసేపు సైపలేని లేఁదమ్మి దీఁగవలె వసివాడి పోవుచున్నది. క్షణమాత్రము సం కల్పనిర్మితమైన వల్లభ సమాగమము ననుభవించుచుఁ గాఁబోలును తడిసి ముద్దయైనట్లు చెమటలతో నిండిపోవుచుండును. ఏమనఁగా తులకించు కెమ్మోవియుఁ, దళతళలాడు ముత్తెములవంటి పలువరుసయు, తెఱపిలేని పులకాంకురంబులచేఁ దఱచగు కపోలతలంబున జొటజొటమని వెల్లి విరియు నానందబాష్పములును, ఎడతెగక పొడము చెమటబొట్లచేఁ జెన్నమీఱు చిన్నిక్రొన్నెలవంటి నెన్నుదురును, తొలుత నించుక మెలిగొని నిలువరించి యంత మెల్లమెల్లనఁదారి యామీఁదఁ దిరుగుడు వడినట్లు నునుపయిజాఱి మూఁతవడెడు నల్లని కన్నుఁగలువలును గల యీయామె మోము దామరవైఖరిసూడఁ బ్రోడలగు చెలిమికత్తెలచిత్తముల యందీమె కిప్పుడు కౌమారావస్థ యేమోయని సంశయము పొడముచు న్నది. మఱియు దుర్వారమైన చంద్రకిరణ ప్రసారముచేఁ గరఁగి నీరగు

చంద్రకాంతహారమునుదాల్చి విశేషముగాఁ గర్పూరరసము నించిన చల్లని మంచి గంధపుజగులచే జవజవమను లేఁత యరటాఁకుపై మేను చేర్చి, తత్తఱపాటుతోఁ గదిసి చెలిమికత్తె లడుగు లొత్తుచు నీటఁదడి పిన తామరాకు వీవనలందెచ్చి వీచుచున్నను రాత్రులు కంటిమీఁద ఱెప్పవాల్పకయే వెళ్ళఁబుచ్చుచున్నది. ఒకవేళ పట్టకపట్టక నిదుర పట్టినో అనుగులకుఁ బట్టించిన లత్తుకరసము చెమటకాలువలచేఁ గరఁగి పాఱ, దడదడలాడు వలుదపెందొడసందునుండి బెడబెడమని పోఁక ముడిజాఱ గదిరిన యదిరిపాటుచే హృదయంబునుండి పదింబదిగ వెడలు వేఁడినిట్టూర్పు గాడ్పుల కనేకప్రకారంబుల విజృంభించి నిట్టవొడిచిన చన్నుమిట్టలపై వడఁకాదు బాహులతికలం జుట్టఁబెట్టియట్టె మెలఁకువ యగుడు వట్టిసజ్జపైఁ జూపు నిగిడించి యుస్సురని మోహావశంబునఁ గన్నులు మూసికొనును. అప్పుడు తత్తఱపడి చెలికత్తె యొనరించు నుపచారములకుఁ దెలివినొంది వారికిం దనకును తీఱదట్టంపు నిట్టూర్పుచే జీవితాశ మఱలించుచున్నది. మాకేమి సేయుటకును బాలుపోకున్నది. ముందు మమ్మునే చంపివేయుమని యా క్రూరదైవము నెంత వందించి నను వాని కుటిలత్వమునకుఁ దిరుగులేకున్నది. అమ్మా! భగవతీ! చూడుము. లావణ్యాభూయిష్ఠములును సుకుమారములు నగు నీ పువుఁబోఁడి యవయవములను మన్మథుఁ డింకను ఎంతకాలము నవయఁ జేయవలసినది? మగలపయిఁ బొలయలుకఁ జెందిన కేరళాంగనల రాగపల్లవిత కపోలంబులపోలికఁ గోమలోద్వేల విమలంబులగు తేట వెన్నెలలచేఁ దఱుమంబడి విరియఁబాఱు కాఱు చీఁకట్లుగల యొక్క యీ రజనీముఖము లేకాదు, పాలేఱులతీరున ధళధళమను తెలివెన్నెలలచేఁ బులుగడిగినట్లు చెలువుమీఱు నభోభాగములును కమ్మని పరిమళమ్ముల కిమ్ములగు పాటలీముకుళమ్ములఁ బాటించి గుత్తములగు నెత్తావులఁ గుతుకబంటిగ నత్రించుకొని బలిసి వెసలఁ గలయఁబొలయు మలయా

నీలంబులచేఁ జలువమీఱు దశదిశాముఖంబులును గల యీ రజనీపరిణామములుకూడఁ బ్రియసఖికి నెక్కువ యుపకారమే చేయుచున్నవి.

కామం:—బిడ్డా! లవంగికా!

ఆ. గీ. అతనివిషయమైన ◆ దగునేని యనురాగ
మదిగుణజ్ఞురాలి ◆ యందముగద
యిందుకయిమనంబుఁ ◆ జెందియు దండంబు
వగలఁబగులుదీన ◆ వస్థఁజూచి. ౧౩.

మాధ:—భగవతికిప్పు డింత యుద్వేగము యుక్తమే.

కామం:—ఓహో! యెంతప్రమాదము!

మ. మునుపే దీనికియొడల్ వినన్గలలితం ◆ బున్ సౌకుమార్యైకభా
జనమున్; దానికిఁదోడు మన్మథుని దా ◆ రుణ్యంబు; నామీఁదఁ జం
దన భూమీధరమందనిర్గత జగ ◆ త్ప్రాణోన్నలమ్మారుతపు
ష్పనితాంతంబు వసంతముండఁజేసెఁ గా ◆ స్వచ్ఛంద్రికాకాంతమై ౧౪

లవం:—అమ్మా! మఱొక్కటి చిత్తగింపుము. ఇదిగో మాధవుని రూపము వ్రాయఁబడియున్న చిత్రఫలకము. [మాలతి పైఁట కొంగు తొలఁగించి] ఇదియును అతఁడు కూర్చియిచ్చినదని యీమెచేఁ బ్రాణపదముగా ధరియింపఁబడుచున్న పొగడదండ. [వకుళమాలికను జూపుచున్నది]

మాధ:—[సాభిలాషముగా]

చ. అలవిగొదెల్పనాకుసకి ◆ యా! వకుళావళీ! నిదుభాగ్యముం!
బలుకనఁబోతి నిద్దమయి ◆ బాగగు గ్రొంబినదండకాండముం
దలఁపఁగఁజేయుపాండిమకుఁ ◆ దావలమౌ చెలిగబ్బిగుబ్బలం
గులికెకుఁజిక్కుటఁబుగలిఁ ◆ గోమలికెంతయుఁగూర్చుదానవై. ౧౫

[తెరలోఁ గలకలము]

ఓహో! శంకరపురవాసులైన బాబులారా! యిదిగో మంచిపడుచు కాఱులోనున్న దగుటచే సహింప నలవికాని క్రోధరోషములచే బలాత్కారముగా నుక్కుపంజరమును ముక్కలుసేసి, తలుపు దెఱచుకొని, కాలికంటఁగట్టిన యినుపగొలుసు త్రెంచుకొని, పెచ్చువెఱిగి, విచ్చలవిడి సంచరించుచుఁ, బైకినిక్కించిన చక్కని తన తోఁకతోఁక విక్రుతాకారమైన యొక జయపతాకవలె నాచరించుచుండఁ, జేరిచూడరాని భీకరాకారముతో నురము వెకలి, యప్పుడె యుప్పతిల్లిన తమకంబుతోఁ జెక్కుప్రాణుల మేఁకలు చప్పరించి, గుట్టలు వడిన యవయవంబుల లోని గట్టిమొనులను కొండగుహాఁబోలు వెడదనోరఁ జెంపుమీఱు లంపపుంగోఱలఁబట్టి కటకటమని పిండిపిండిగ నమలుచు, వెఱపు గొలుపు వెఱ్ఱియాటగఁ జెళ్ళునఁగొట్టు బెట్టిదంపు దెబ్బకుఁ బెల్లుగఁ జిక్కు నరతురంగముల నెత్తురు కండలు నోటినిండఁ గుక్కుకొని, వెక్కసంబుగుడు నక్కిబిక్కిరిగ గుబ్బుగబ్బుమని వెడలఁ గ్రక్కుచు, నడుమ నడుమ గోంద్రుగోంద్రుమని యుప్పరంబెగయనార్చుచుఁ, గొందఱ మడిమించి, కొందఱఁ బొడిసేసి, కొందఱ వెఱపించి పరువు లెత్తించి, కొందఱ నందుగొందుల దూరించి, కఱకిగోళ్ళ వచ్చిన జంతు గాత్రావయవంబులనుండి తొరుగు పచ్చినెత్తురులచేఁ ద్రోవయెల్ల నడును గట్టించి, యిట్లు దుష్టశార్దూలమొకటి రెండవ యమునివలె విహరించుచున్నది. కాఁబట్టి చేతనయినమట్టు కెవరిప్రాణమును వారు కాపాడు కొనుఁడు.

బుద్ధ:—[తత్తఱపాటుతోఁ బ్రవేశించి] రక్షింపుఁడు! రక్షింపుఁడు! ఇదిగో నందనమంత్రి చెల్లెలు మన ప్రియసఖయైన మనయంతికను పెద్ద పులి పట్టుకొన్నది. పరిజనులు కొందఱు చచ్చి కొందఱు పాఱిపోయిరి.

మాల:—చెలీ! లవంగికా! అయ్యో యెంత ప్రమాదమే!

మాధ:—బుద్ధరక్షితా! యెక్కడ నున్నది?

మాల:—[సంతోషముతోను భయముతోను] అమ్మయ్యా! ఈయన యిక్కడనే యున్నారు!

మాధ:—[తనలో]

సీ. అహహా! నాభాగ్యమే • మనివచింపఁగవచ్చు?
నబ్బురంబుగఁ దన • కబ్బినట్టి
నాదుదర్శనమున • మోదమందుచునాతి
యాయతంబుగఁ గన్ను • దోయిఁ జాపి
తిలకించుచో నన్నుఁ • దెలిదమ్మిపూదండఁ
గలయంగ బిగియించి • కట్టినట్లు
సారసంపూర్ణసు • క్షీరపూరమునందు
మించుగాఁ దానమా • డించినట్లు

తే. గీ. కొంకకొసరించుకయు లేక • పంకజాక్షి
యేకరాశిగఁ దాఁగబ • ళించినట్లు
లమృతమేఘంపుజడివాన • నవిరళముగ
ముంచినట్లును నెయ్యంబొ • యెంచిచూడ. ౧౬.

బుద్ధ:—అయ్యా! యిదిగో సింహోటంబు వెలుపలి వీధి మొగమున నున్నది.

మాధ:—[సాటోపముగా] ఇదిగో సిద్ధముగానున్నాను.

మాల:—చెలీ! లవంగికా! సంశయము బాధించుచున్నదే!

మాధ:—[భీభత్సపడినట్లుగా] ఆహాహా!

క. తగులఁబోని తెగిధరంబ్రో
వుగఁ బ్రేవులు, బోరగిలిన • పుఱ్ఱెలతుఱ్ఱెల్,
దిగఁబడు నెత్తుటి రొంపియు
నగపడిపులిచన్నమార్గ • మతిదారుణమా. ౧౭.

అన్నా! యెంత ప్రమాదము!

ఉ. అక్కట! దూరమైతిమిం ♦ వ్యాఘ్రము నుక న్నెకుదావుగాఁగదుక్
అందఱు:—హా! చెలీ! మదయంతికా!

కామం:—మాధ:—[సహర్షముగాను సాభిప్రాయముగాను.]

చిక్కక యెవ్వఁడో మృతుని ♦ చేతికటారినిఁగొంచుడాసెఁదా
నెక్కడనుండి యోవడిమె ♦ యిన్నకరందుఁడెవచ్చినిల్చెగా
ఇతరులు:—మేలు! మహానుభావా! మేలు!
కామం:—మాధ: —

మిక్కిలిగాయ మొందివును ♦ మింబడఁగూల్చెనుదుష్టసత్వమున్.

కామం:—[సాభిప్రాయముగా] అయ్యో! నాయనా! బెబ్బులి గొట్టిన గోళ్ళదెబ్బలచే మేనెల్ల రక్తప్రవాహముకాఁగా, నేలఁబాదు కొల్పిన చేతిఖడ్గము నూఁతగొని, బెదరిబెదరి చూచుచు మదయంతిక దన్నాదుకొనియుండ మకరందుఁడెట్లు సొమ్మసిలెనాఁడో!

ఇతరులు:—అన్నన్నా! గట్టి దెబ్బలు దిని యామహానుభావుఁడు వాడిపోయిన తోఁటకూర కాడయైనాఁడు!

మాధ—అయ్యో! తల్లీ! పడిపోయినాఁడు! రక్షింపుము! నన్ను రక్షింపుము!

కామం—నాయనా! యెందుకీభయము? రమ్ము. పోయి చూతము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

తృతీయాంకము—సంపూర్ణము.

# మాలతీమాధవము

## చతుర్థాంకము.

ప్రథమరంగము - కుసుమాకరోద్యానము.

[తరువాత మూర్ఛనొంది మదయంతికా మాలతుల చేతులమీఁద మకరంద మాధవులును తత్తఱపాటుతోఁ గామందకీ బుద్ధరక్షితా లవంగికలును ప్రవేశించుచున్నారు.]

మక:—దేవీ! అనుగ్రహించి మదయంతిక నిమిత్తము ప్రాణసంశయదశ నొందిన యీ యాపద్బాంధవుని రక్షింపుము. ఈమహాభాగుని రక్షింపుము.

ఇతరులు:—అయ్యో! యిప్పుడిక్కడ నేమున్నదని తీసికొని రాము?

కామం:—మీరిద్దఱు నీకమండలూదకమును మీఁదఁజల్లి పైఁటచెఱఁగులతో విసరుఁడు.

మాలత్యాదులు:—[అట్లుచేయుచున్నారు.]

మక:—[తెప్పిరిల్లిచూచి] చెలికాఁడా! యేమి యీభయము? నేను సుఖముగానే యున్నాను.

మద:—అమ్మయ్యా! యిప్పుడు మకరంద పూర్ణచంద్రుఁడు మేలుకొన్నాఁడు!

మాల:—(మాధవుని నుదుటిమీఁద హస్తముంచి) మహాభాగ! అదృష్టము బాగున్నది. ఇదిగో వినుఁడి. ఆ మహానుభావుఁడు తెలివి నొందినాఁడు.

మాధ:—[తెప్పిరిలి] చెలికాఁడా! యెంత సాహసము చేసితివి! రమ్ము! రమ్ము! [కౌఁగిలించుకొనుచున్నాఁడు.]

కామం:—[ఇద్దఱ శిరస్సులు మూర్కొని] ఇప్పుడు నాబిడ్డలు బ్రతికి బైటఁ బడ్డారు.

ఇతరులు:—మాకందఱకు పరమసంతోషముగా నున్నది.

[అందఱు హర్షము నభినయించుచున్నారు.]

బుద్ధ:—[జనాంతికముగా] చెలీ! అతఁడే యితఁడు.

మద:—చెలీ! యీయన మాధవుఁడనియు, ఈయన నీవు చెప్పినవారేయనియుఁ దెలిసికొన్నాను.

బుద్ధ:—నేను చెప్పినదానిలో నబద్ధము లేదుగదా?

మద:—మాబోంట్లయందు మీవంటివారికిఁ బక్షపాతములుం డవుగా! [మాధవునింజూచి] మాలతి మహానుభావుఁడైన యీ సుందరాంగునిఁ గామించినదని వాకొక [అని మకరందునే సాభిలాషముగాఁ జూచుచున్నది.]

కామం:—[తనలో] మదయంతికామకరందులకు దైవికముగా లభించిన యిప్పటి యీ దర్శనము మిగుల రమణీయమైనది. [ప్రకాశముగా] అబ్బాయీ! మకరందా! యీసమయమందు మదయంతికను గాపాడుటకై భగవంతుఁడు నిన్నెక్కడనుండి తీసికొనివచ్చినాఁడు?

మక:—ఇప్పుడు నేను నగరములో నొక్కవార్త విని మాధవుని కందువలనఁ జిత్తక్షోభ మెక్కువగునేమో యను శంకతో నవలోకిత చెప్పిన కుసుమాకరోద్యాన వృత్తాంతముమీఁద నతిత్వరితముగా బయలుదేఱివచ్చుచుఁ ద్రోవలో నెవ్వరో యుత్తమవంశ సంభూతురాలిలాగున్నదని బెబ్బులిచేతఁ జిక్కిన యీకన్యకను సమీపించితిని.

మాల:—మాధ:—[తమలో విమర్శించుకొనుచున్నారు.]

కామం:—[తనలో] సంగతి కేమున్నది? బహుశః మాలతిని నందనున కిచ్చుట స్థిరపడియుండవచ్చును. [ప్రకాశముగా] వత్సా! మాధవా! అదృష్టవశమున మాలతివల్ల వర్థిల్లినావు. మాలతి కైనం బ్రీతిపూర్వకముగా నిచ్చుట కిదే తగునమయము.

మాధ:—దేవీ! యీ మాలతి,

చ. చెనఁటి మృగంబు గాయమును ♦ జేయఁగనాపదనున్న ప్రాణమి
త్రునిఁబొడగాంచి సొమ్మసిలి ♦ తూలినసన్ గృపఁబూనిజాతసం
జ్ఞనిఁగఁ బొనర్చెఁగానఁగడు ♦ గోరికనేనిదె పూర్ణపాత్రవృ
త్తినిహృదయంబు జీవితము ♦ దీని యధీనము చేసితి వెదన్. ౧.

లవం:—మాప్రియసఖ కోరఁదగిన యనుగ్రహ మిదే.

మద:—[తనలో] ఈమహానుభావుఁడు తన మనోభిప్రాయము నెట్లు వెల్లడిసేయవలెనో చక్కగా నెఱుఁగును.

మాల:—[తనలో] ఏమి చెవుమా మకరందుఁడు విన్న యా యుద్వేగ కారణవార్త?

పురుషుఁడు:—[ప్రవేశించి] అమ్మాయీ! మదయంతీ! "యిప్పుడు రాజుగారు స్వయముగా మన యింటికి దయచేసి భూరి వసువుమీఁది విశ్వాసముచేతను మనయందలి యనుగ్రహముచేతను తామే మాలతి నిచ్చినారు. కాఁబట్టి యీ యనుగ్రహమునుగూర్చి చెప్పుకొని సంతసింతము రమ్మ," అని మీయన్న నందనమంత్రి యాజ్ఞాపించుచున్నాఁడు.

మక:—వయస్యా! యిదియే నేను విన్న వార్త.

మాల:—మాధ:—[వెలవెలపోవుట సభినయించుచున్నారు]

మద:—[సంతోషముతో మాలతినిఁ గౌఁగిలించుకొని] చెలీ! మాలతీ! మనమిద్దఱ మొక్కయూరిలోఁబుట్టి యిసుకలో నాడుకొన్న

యీాడు మొదలు సావానకత్తెలమై యక్కసెల్లెంద్రవలెనున్నాము. ఇప్పుడు మాగృహమున కలంకారమయినావు.

కామం:—వత్సా! మదయంతికా! మీాయన్నగారు మాలతినిఁ బెండ్లియాడఁ గలుగునని యుప్పొంగి పోవుచున్నావు!

మద:—ఇదియంతయుఁ దను యాశీర్వచన మహిమ. చెలీ! లవంగికా! మిమ్ములను బొందుటచే మాకోరిక లీడేరినవి.

లవం:—చెలీ! మేమును ఇట్లనుకోఁదగ్గదే.

మద:—చెలీ! బుద్ధరక్షితా! రావే పోదము. మహోత్సవమును జూచి సంతసింతము. [లేచుచున్నారు.]

లవం:—[జనాంతికముగా] దేవీ! చూడు! చూడు మీా మదయంతికామకరందుల చూపు లేతీరుగాఁ గలసికొనుచున్నవో! అంతరంగముల నిముడఁజాలక పైకి వెల్లివిరిసిన యద్భుతానందములచే సుందరములయి గుట్టు సడలకుండుటకు నిబ్బరంబులయి కడగఁ బ్రసరించినప్పుడు మనోహరంబులయి చలితంపు విరిసల్లగలుప పూఁజాయలకు నెలవులయి నలుగడల నలముకొనుచున్నవి. నాకుఁజూడ వీరిప్పుడు మనస్సంగము ననుభవించుచున్నారని తోఁచుచున్నది.

కామ:—[నవ్వి]

సీ. ఓరగనొకయింత ♦ తొరకల్ నిగుడంగ
వక్రమైకొలికిలో ♦ పలముడింగి
యలఁతిగాబొమలెత్తి ♦ వలఁతిగావలపెల్లఁ
దెలుపుచో స్తిమితమై ♦ లలితమగుచు
తెప్పలల్లార్చుచుం ♦ దప్పకీక్షించుచో
నంతరానందర ♦ సానుభూతి
మసృణమై యారీతిఁ ♦ బ్రసరించితడవుగ
నాకేకరంబన ♦ నమరునట్టి

కామం:—[తనలో] ఈబిడ్డ లిరువురును మనసుల బెంగఁబెట్టు కొని యిట్లుండఁగా నేను చూడలేను. ఆశ నిరాశమైనప్పుడు బ్రదుకు భరముగానుండును. [ప్రకాశముగా] వత్సా! ఆయుష్మంతుఁడా! మాధవా! యొక్కమాటడుగుచున్నాను! చెప్పుము! భూరివసువెప్పు డైనను నీకుఁబిలిచి పిల్లనీయవచ్చునని యనుకొంటివా?

మాధ:—[సిగ్గుతో] లేదు. లేదు.

కామం:—లేదుగద! యిప్పుడు భూరివసువు జరగించిన విరుద్ధ మేమున్నది?

మక:— మాలతి నీవలనకే యొకరి కిచ్చినాఁడఁటగాదా?

కామం:—ఆసంగతి నాకుఁ దెలియును. నందనునకు మాలతి నీయవలసినదని రాజు దన్నడుగఁగా భూరివసువాయనతోఁ దమ పిల్లదానివిషయములోఁ దమ యిష్టమని చెప్పినాఁడు. ఇది యందఱు నెఱిఁగినదేకదా?

మాధ:—అవును విన్నాము.

కామం:—రాజు స్వయముగానే మాలతి నిచ్చివేసినాఁడని యిప్పుడేగద పురుషుఁడు వచ్చి చెప్పినాఁడు! కాఁబట్టి నాయనా! చూడు! మానవ వ్యవహారములకు మాటలవల్లనే కట్టుఁబాటు. మా టలవల్లనే జనులకు పుణ్యమును పాపమును. భూరివసువు చెప్పినది కల్ల మాట యగుటకు సంశయములేదుగదా? మాలతి యేమైనను మహా రాజు కూఁతురా? పోనీ లోకములో నెక్కడనైనను ఒక యయ్యగన్న కూఁతురు పెండ్లివిషయములో రాజు జోక్యము కలుగఁజేసికొన్నట్టు విన్నామా? శాస్త్రమునందుఁ గన్నామా? కాఁబట్టి యిది శాస్త్రము నకును ఆచారమునకును గేవల విరుద్ధముగా నున్నది. పోనీ నేనుపే క్షింతునని యూహింతువా? చూడు,

శా. మీపైఁ గూరిమి యగ్గలంబగుటచే ♦ మీకెప్పుడేయొగ్గు దా
నాపాదిల్లునటంచు భీతిలుకునో ♦ యామొగ్గొకింతేనియుఁ
మీపై గిట్టని మీదుశత్రులకునన్ ♦ లేకుండెడుంగాక యిం
కేపాట్లంబడియేని ప్రాణముడియే ♦ చేమిమ్ముఁ గూర్తుంజుఁడీ. ౫

మక:—భగవతి సెలవిచ్చినది చక్కఁగా యుక్తియుక్తముగా నున్నది. మఱియు,

మ. కృపనో ప్రేమనో నీదుబిడ్డలగు వీ ♦ రింగూర్చి సంసారసం
గపరిత్యక్తము నీదుచిత్తముఁ గరం ♦ గంజొచ్చెనట్లౌట నిం
తొ పరివ్రాజసంప్రదాయవిహితా ♦ నుష్ఠానవిఘ్నంబుగా
నిపుడొప్పెన్ భవదీయయత్నమిఁక దే ♦ వీ! దైవమెట్లుండునో.

[తెరలో]

దేవీ! కామందకీ! మాలతిని వెంటఁబెట్టుకొని శీఘ్రముగా రావలయు నని దేవిగారు విన్నవించుచున్నారు.

కామం:—అమ్మాయీ! లే అమ్మా! లే. [అందఱు లేచి యిటు నటు నడచుచున్నారు]

మాలతి:—మాధ:— [సకరుణానురాగముగాఁ జూచుకొను చున్నారు.]

మాధ:—[పెడమొగముగా] ఛీ! మాలతితోఁ గూడి మాధవుఁ డనుభవింపఁదగిన సంసారసుఖ మింతటి దేకదా! ఔరా! ఔరా! యేమిచిత్రము!

చ. తొలుదొలుతన్ హితుండుబలెఁ ♦ దోఁచియనన్యరసాభియుక్తమ
త్యలఘుసుఖప్రదాయకము ♦ నౌననుకూలతఁజూపి యప్పుడే
మలఁగుచు వేఱుత్రోవఁ జను ♦ మాఱిచి దారుణవృత్తినై జను
ల్వలసిత మేర్పడన్ విధిగ ♦ రిష్ఠమనోవ్యథపాలు సేసెడున్. ౭

మాల:—[పెడమొగముగా] ఓమహానుభావా! ఓలోచనానంద
కరసుందరమూర్తీ! నిన్నుఁ జూచుట కిదే కడసారి.

లవం:—అన్నా! అమాత్యుఁడు మా ప్రియసఖికి జీవితసంశయ
ము దెచ్చిపెట్టినాఁడు గదా!

మాల:—[పెడమొగముగా] ఇప్పుడు జీవితాశయొక్క ఫలము
పండి ముగ్గినది. కరుణావిహీనుఁడైన మాతింత్రిగారికిఁ గాపాలికత్వము
సిద్ధించినది. దైవముయొక్క దారుణసంకల్పముకూడ నీడేరినది. నే
నెవ్వరి నిందింతును? దిక్కుమాలిన నాకెవ్వరు దిక్కు?

లవం:—చెలీ! యిటు! ఇటు! [ఇటునటు నడచుచున్నారు.]

మాధ:—[తనలో] మాధవునిమీఁది సహజవాత్సల్యముచేత
ను, అయ్యో! వీఁడేమయిపోవునో యను భయముచేతను భగవతి యి
ట్లూఱడించుచున్నదేకాని వేఱుగాదు. [ఉద్వేగముతో] నే నెక్కడ?
జన్మసాఫల్యమును బొందు టెక్కడ? ఇప్పుడు నే నేమిచేయుదును?
[ఆలోచించి] మహామాంసవిక్రయము దప్ప వేఱుపాయము గానరా
కున్నది. [ప్రకాశముగా] వయస్యా! మకరందా! మదయంతిక నిమిత్త
ము తహతహగా నున్నదా యేమి?

మక:—ఉండ కేమి?

చ. ప్రిదిలినపైఁటకొంగునవ ♦ రింపకయే సరసప్రహారుసన్
బెదరినపిల్లలేడివలె ♦ బెగ్గిలిసూచి సుధారసాప్లుతిం
బొదలినభంగిఁ జల్లఁదన ♦ మున్ ఘటియించునిజాంగకంబులన్
మదవతి కౌఁగిలించెనది ♦ మాటికి నాటి మదింగలంచెడున్. ౮

మాధ:—అది మన బుద్ధరక్షితకుఁ బ్రియసఖకదా? దుర్లభు
రాలు గాఁగూడదే! మఱియు

ఉ. క్రూరమృగంబుఁ జంపి యును • ఱుల్ నిలఁబెట్టిననిన్నుఁ గాఁగిటం
జేరిచియుండి వేఱొకనిఁ • జేరఁగనిచ్చునె నాతిచిత్తమున్?
సారసనేత్రచూపుల పి • సాళమునీవయిఁ గల్గుకూరిమిన్
సారెకువెల్లడించి సర • సస్తిమితంబయి యొప్పుచుండదే? ౯

కనుక లెమ్ము! పారాసింధుసంగములో స్నానముచేసి పట్టణములోనికిఁ బోదము. [లేచి యిటునటు నడచుచున్నారు] ఇదే యీ మహానదుల సంగము. ఆహా!

మ. వలిపెంపుందడిచీరలత్తుకొనఁ బై • పైఁదోఁచునిమ్నోన్నతం
బులతోఁ, బైఁడిపసంటులందొరయుసొం • పుల్నిండుపెంపారుగు
బ్బలపై మోఁటిన కేలుదామరలతో, • భామామణుల్ స్నాతలై
నిలువంజెల్లినతీవులొప్పెసఁగెడుం • దీరప్రదేశంబునన్. ౧౦.

[అని యందఱు నిష్క్రమించుచున్నారు]

చతుర్థాంకము—సంపూర్ణము.

# మాలతీమాధవము

## పంచమాంకము.

ప్రథమరంగము—కరాళశక్తి గుడిచేరువ శ్మశానము
[తరువాత నాకాశమార్గమున భీషణోజ్జ్వలవేషముతో
కపాలకుండల ప్రవేశించుచున్నది.]

కపాల:—

మ. అరయఁగ షోడశనాడికావలయమ ♦ ధ్యస్థాత్మ యెవ్వాఁడు, సు
స్థిరయోగీశ్వరహృన్నివేశితలస ♦ త్తేజస్స్వరూపం బెవం,
డురుసిద్ధిప్రదుఁ డెవ్వఁ, డెవ్వనిని రో ♦ యున్ నెమ్మదిఁ సాధకో
త్కరమా! శక్తిసమేతభూతపతికిం ♦ గావింతునే నంజలిఁ. ౧.

సీ. ప్రతిదినంబునుజపో ♦ పక్రమవేళష,
డంగచక్రన్యాస ♦ మాచరించి
హృత్పద్మమధ్యమం ♦ దిమ్ముగా నెలకొల్పి
శివుఁ బరమాత్ము వీ ♦ క్షించునేను
స్వభ్యస్తలయయోగ ♦ నగుటచే
నాడికా మార్గాననుదయప్ర ♦ మంబెటింగి
దేహసంబంధిభా ♦ తికలేశముల నెల్ల
మొలవున వెలివుచ్చి ♦ మింటికెగసి

తే. గీ. గొంటుఁగుంటును లేనియ ♦ తీక్ష్ణజవము
కలిమి నెదురైనమబ్బులఁ ♦ దోలఁగఁద్రోసి
కొనుచు నిట్లు కరాళాయ ♦ తనము పొంత
వ్రాలఁగల్గితి భగవతి ♦ భవ్యకృపను. ౨.

మఱియు,

ఉ. అకనమందుమించిన ర ♦ యంబున నేఁబయనంబు సేయుచోఁ
బ్రేఁకవుఁబున్క పేరులవి ♦ వెన్కకుముందుకునూఁగులాడియ
ట్టాఁకలఁబెట్ట మోఁతలిడు ♦ నాచిఱుగంటల శ్రావ్యనాదమ
స్తోకనముద్భటత్వమును ♦ సొంపుగనాకు లభింపఁజేసెనుర్. 3.

శా. జాఱుందోరవు గ్రంథిబంధముజటా ♦ జాలంబు దూఁగాడ, సం
స్కార శ్యాన సుదీర్ఘమై పటుగతిన్ ♦ ఖట్వాంగ పుంగంటవే
మాఱున్ మోసెఁ, గపాలరంధ్రములలో ♦ మారొత్త్రియు మంగింకిణీ
వారంబున్ మొరయించు వాయువునకుఁ ♦ బైపై ధ్వజంబాడెడున్.

[ఇటునటునడచిచూచి] ఇదిగో ప్రాఁత వేఁపచములలో వెల్లుల్లి పాయలు వేఁచినట్లు గుమగుమలాడు ప్రేతధూమములు మిన్ను ముట్టుటచేఁ జెప్ప నక్కఱ లేకయే తెలియఁబడుచున్న యీ శ్మశానవాటము చేరువను కరాళశక్తిగుడి, ఇందు మంత్రపురశ్చరణము చేసిన మా యఘోరఘంట గురువులయాజ్ఞచొప్పున నేఁడు కొంచెము విశేషముగాఁ బూజాసంభారములు సమకూర్పవలసియున్నది. "వత్సా! కపాలకుండలా! యీ కరాళభగవతికి స్త్రీరత్నమొకటి సమర్పించుకొందునని ముందు నేను మ్రొక్కుకొని యున్నాను. అందుకొకటి యీనగరమందే సుప్రసిద్ధముగా నున్నది. తీసికొని రమ్ము." అని నాగురువుగారు సెల విచ్చినారు. [సంతోషముతోఁ జూచి] ఎవఁడు చెపుమా! అతిగంభీరసుందరాకారముతోఁ బైకి మలఁచిన జుట్టుముడియు వీఁడును చేతఁ గత్తిఁ బట్టుకొని యీవల్లకాటిలోనికే వచ్చుచున్నాఁడు!

మహాస్రగ్ధర.

ప్రకృతి నీలోత్పలోద్య ♦ త్ప్రిభల మెఱసియుం
బాండురాంగంబు వాఁడై ♦ ప్రకట శ్రీమంతుఁడై గ్లా
వదనుఁడయ్యలన ♦ త్పాదవిన్యాసుఁడై వీఁ
డకటా! చూపట్టెడున్ సా ♦ హసము మెఱయ ర

క్వార్ద్రిమా వామపాణిం ♦ బ్రకటంబౌచున్ మహామాం
సశకలముహారిం ♦ వన్నిజంబా వినీతిన్. ౫.

(నిరూపించి) ఇతఁడా! కామందకి స్నేహితుని కొడుకు, మాధవుఁడు. మహామాంస విక్రయ మారంభించినాడు. వీనిజోలి మన కేల? ముందు పనిచూచుకోవలెనుగాని. ఇదిగో పడమటను బ్రొద్దు గ్రుంక వచ్చుచున్నది. అవుఁగ,

లయగ్రాహి.

అల్లదె తమాలసుమ ♦ వల్లరులొ నాఁగవిల ♦ సిల్లుచును జీఁకటులు
మెల్లగ వియత్తటము ♦ లల్లుకొని ప్రాఁకెన్
బెల్లుబికి క్రొత్తగను వెల్లిగొనునీళులను ♦ ద్రెళ్లివడెనాఁ బుడమి
యెల్లలవి చూచుటకుఁ ♦ గల్లలయి తోఁచెన్
సుళ్ళుగొను వాయువుల ♦ బల్లిదపు వేగమున ♦ నెల్లెడలకుం జెదరి
తెల్లమగు క్రొంబొగల ♦ మొల్లవు రుచిన్ శో
భిల్లునిజనీలిమను ♦ గొల్లగ వనాళివయిఁ ♦ జల్లిమును ముందుగనె
పెల్లడరఁ జేసెఁ దమి ♦ సల్లలిత రీతిన్. ౬.

[అని నిష్క్రమించుచున్నది.]

ఇది విష్కంభము.

—o—

[తరువాత నట్టిరూపముగల మాధవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాధ:—[కోరికతో]

మ. ఎవిబాహ్యేంద్రియ వృత్తినిల్పితమయం ♦ బెడెందమానంద మొం
ది విలీనంబొనరించుఁ గోర్కెమొయిబు ♦ ద్ధిందల్పు కొన్నంతనే,
యవియెల్లన్ ననుఁగూర్చి కావలయుఁ బ్రే ♦ మార్ద్రింబులై గాఢరా
గవశంబై ప్రణయానురంజితములై ♦ కళ్యాణి చేష్టాగతుల్. ౭.

మఱియు,

చ. విడువక నాదుపేరుగ ల ♦ భించిన కేసర పుష్పమాలికం
దొడవుగఁ దాల్పఁబొల్పెసఁగు ♦ తోరపుఁజన్నులఁ గ్రుచ్చియంతలో
నుడుగక కంఠమూలమున ♦ కోరగ మోమిడి కౌఁగిలించున
మ్మదఁతుక తోడనంగములు ♦ మాఱుచుకొంటది యెన్నడబ్బునో!

పోనీ, అంతదూర మెందుకు? ఇప్పుడింతమట్టుకే కోరుకొందము.

మ. పొదలుం దేనిఁగనంగొనన్ హృదిసుఖం ♦ బుల్ కుప్పలుం దెప్పలై
యెదికోర్కుల్ నిగిడించుఁ గన్నులకుఁదా ♦ నింపై; కదుంబొల్పునే
యదిబాలేందు కళోచ్ఛ్రయోపచితసా ♦ రాంశ ప్రభూతంబునా
నదివీక్షింతు ననంగదేవ నిలయం ♦ బామోమునిం కొక్కమార్.

ప్రియురాలు మును పెట్లో యిప్పుడు నట్లే కనఁబడుచున్నది. కాని యిప్పటిదర్శనము పారమార్థికము గాకపోవు టొక్కటే విశేషము * ఏమంటేని,

చ. వెలఁదుకలీనమాడ్కిఁ బ్రతి ♦ బింబితభంగి, లిఖింపఁబడ్డటుల్
మలఁచినరీతిఁ దాపటమ ♦ మర్చినమాదిరి, వజ్రలేపనం
కలితవిధాన, నాంతరని ♦ ఖాతగతిం, గుసుమాస్త్రునైదుతూ
పులదిగ్రుచ్చఁగాఁబడిన ♦ పోలికఁ, జింతలపేరితంతులం
గలయబిగించికట్టఁబడు ♦ కైవడిమామదిఁ బాయకుండెడిన్. ౧౦.

[తెరలోఁ గలకలము.]

మాధ:—[విని] ఓహో! పిశాచపుమూఁక లిటునటు దిరుగుచుండఁగా నీశ్మశాన మెంత భయంకరముగా నున్నది. ఇందు,

---

* ఇచ్చట రెండు మూడు పద్యములు కేవలము వేదాంతపుంజముగా నుండుటచేఁ దెనిఁగింపఁ బడలేదు.

మ. కలయంగ్రమ్మి భయంకరంబయి సయీ ♦ గాఢాంధకారంబొగిన్
వలయంబై తమునావరింప సొడలా ♦ జ్జ్వాల్యంబుమై వెల్గు; సం
కుల కేలీకలనామహాకిలకిలా ♦ కోలాహలా రావముల్
సెలరేఁగంగటపూనాదులగడై ♦ సేయున్ సమాక్రోశమున్. ౧౧.

కాఁబట్టి బిగ్గఱగాఁ గేకలువైచెదను. ఓహో! శ్మశానవాటమందలి పిశాచములారా!

ఆ. వె. నుఱియుఁ దఱుగ లేదు ♦ సూడదోసము లేదు
పూరుషాంగకములఁ ♦ బుట్టెసిదిగొ
విక్రయింపఁబడెను ♦ వెసమహామాంసంబు
వచ్చిపుచ్చుకొనుఁడు! ♦ పుచ్చుకొనుఁడు! ౧౨.

[తెరలో మరలఁ గలకలము.]

మాధ:—ఇదిగో నేను పిలువఁగానే పిలపిలమని పెద్ద కలకలధ్వనులతోఁ బిశాచము లన్నియు భయంకరముగా గడ్డబ్రద్దలు చేసికొని వచ్చుచున్నట్లున్నవి. ఏమి యాశ్చర్యము!

శా. ఆకాశంబున నిట్టటుం బఱచుదృ ♦ శ్యాదృశ్యదీర్ఘప్రభా
ప్రాకారంబులకొద్వి దయ్యములయా ♦ స్యంబుల్ తలిర్చుందటి
త్సాకల్యస్ఫుట కేశలోచనములై ♦ దంష్ట్రాకరాళంబులై
యాకర్ణాంతవిదీర్ణసృక్వవికట ♦ వ్యాదానదీప్తాగ్నులై. ౧౩.

మఱియు.

సీ. అనమైనొకమాఱె ♦ యందిబ్రిమింగఁగలేక
వెక్కసంబయి జాఱ ♦ విడిచినట్టి
మాంసఖండములతో ♦ మలసి మట్టును మూఁగి
యఱచుతోడేఁళ్ళనో ♦ ళ్లదఁచి వైచి
రొమ్ములగూఁడులై ♦ మొండిసాక్కిసమేని
వయినన్లిదోలూడి ♦ పఱవకుండ

విరివిగానస్నంవు ♦ నరములఁ బెనవెట్టి
కట్టినజీర్ణకం ♦ కాళతతుల
తే. గీ. నిట్టతాడులపోలిక ♦ నిదుడలైన
జంఘికాఘుంబుగదలింప ♦ సరయవృత్తి
బ్రోలఁగన్పట్టెదుని దేత్రి ♦ భువనభీతి
హేతుభూతంబుపూతనా ♦ జాతమిపుడు. ౧౪.

[అంతటఁజూచి నవ్వి] ఓహో! పిశాచములవైఖరి!

ఉ. చీకినశుష్కదేహములఁ ♦ జేకొని మేకొనసోఁకుమూఁకకుఁ
భీకరవక్త్రగర్తముల ♦ వ్రేలెడితోరపుబారునాలుకల్
దాఁకినవేఁడిబ్రోదులయి ♦ లావఱిప్రాఁబడివిల్చుగందవుల్
ప్రాఁకులతో జ్వలింజెలఁగి ♦ ప్రాఁకెడిసర్పచయంబుఁబోలెడుఁ. ౧౫

[ఇటునటు నడచిచూచి] అబ్బా! ఆమీఁద మఱియు భీభత్సముగా నున్నది.

మహాస్రగ్ధర.

తొలుదొల్తన్మీఁదితోలుం ♦ దొలఁచిపిదపను ♦ స్థూలవృష్ఠస్ఫిగంసంబులదుర్గంధామిమంబుల్ ♦ పొసఁగమెసఁగియా ♦ పోవకంతన్నరంబుల్ బలుప్రేవుల్లోచనంబుల్ ♦ నమలియటుపయిన్ ♦ వట్టికంకాళమందే మ్ముల్మాంసంబుల్ పండ్లతోడం ♦ బొదివిపలలము ♦ భూతమొండారగించున్.

ఇదిచూడఁగా వట్టికఱవు గొంటుపిశాచమువలె నున్నది. ఇదిగో నీవైపున

ఉ. కాలిచెమర్చు నెమ్ములుగఁ ♦ గ్రాఁగిస్రవించు మెదళ్లుగా, శిఖ
జ్వాలలఁగాలుచుండెడిశ ♦ వంబులఁగాదులనుండిలాగియా
కాలియమూఁకబిట్టుడికి ♦ కండలుజాఱినకీళ్ళనుండిజం
ఘాలిఁదెమల్చి గ్రోలుఁగడు ♦ పారఁగసారవుమజ్జధారలన్. ౧౬.

[నవ్వి] ఓహో! యీ ప్రదోషసమయమందుఁ బిశాచము లెంతసంతోషముగా నున్నవి!

సీ. తోరంపుఁ బ్రేవుల ♦ బారులే మంగళా
చారకల్పితములౌ ♦ తోరణములుగ
మృతనివాసినుల ల ♦ లితపాణిరక్తోత్ప
లములె కర్ణావతం ♦ సములుగాఁగ
గుదులుగ్రుచ్చినయట్టి ♦ గుండెకాయల పేర్లు
తలఁదాల్పు వెలిదమ్మి ♦ దండలుగను
పెంపారు నెత్తుటి ♦ రొంపియే మేనులఁ
బూలుపొందుకుంకుమ ♦ పూఁతగాఁగ

తే. గీ. మజ్జధారాసవంబున ♦ మందగతిఁ
బునుకకోరలనిండఁగఁ ♦ బోసికొనుచు
మగలతోడఁ బిశాచంపు ♦ మగువలెనసి
క్రోలుచున్నారు కోర్కులు ♦ గుదిగొనంగ. ౧౭.

[ఇటునటు నడచి మరల "నుతియుఁ దఱుగలేదు" అను పద్యమును జదివి] ఏమి చెపుమా! తమ్ముఁ జూచువారికిఁ దమ భీషణాకారములచే భీతిగొలుపవలసిన యీ పిశాచములు బెదరి పికాపికలగుచున్నవి. నిస్సత్వములైనవి కావుగదా! [నిర్వేదముతో] ఇక్కడకు రుద్రభూమియంతయుఁ దిరిగి పొలిమేరదగ్గరకు వచ్చినాను. ఇదిగో నెదుట

మ. కటుకుంజాంతరటద్దివాంధపటుఘూ ♦ త్కారంబుఁ గ్రందచ్ఛివో
ద్భటధ్వాత్కారముఁ దోరమూచును దట ♦ ప్రాగ్భార మొప్పన్ విశం
కటకంకాళకపాలరుద్ధతటనం ♦ ఘట్టప్రవాహోదిత
స్ఫుటనిర్ఘోషణభీషణంబగుకట ♦ క్షోణీనదిం జూడనా. ౧౮

[తెరలో]

హా! తండ్రీ! నీవు దయమాలి రాజునకుఁ బ్రీతిగా బలి యియ్యఁదలఁ చుకొన్న యీ జనున కిప్పుడు విపత్తు సంభవించుచున్నది.

మాధ—[సాకూతముగా నాకర్ణించి]

ఉ. సన్నపుఁగుత్తుకన్ బెకరి ♦ శారికయూరిచినట్టు లాచెవుల్
విన్నది వోలె నింపొసఁగి ♦ ప్రీలిచలింపఁగఁజేసె గుండియల్
క్రన్నన మానుపాఁడవి ♦ కాలుగఁ జేయియు నాడకుండెఁ దా
నెన్నఁగ నీనినాదమిపు ♦ డెమిటఁ బుట్టెనో యెందుఁగల్గెనో. ౨౦

ఆ. వె. ఇది కరాళదష్ట ♦ సకనంబునుండి వె
ల్వడినయార్తరవము ♦ పగిదిఁదోఁచు
నెంచిచూడఁగనది ♦ యిట్టిపాపంబుల
కెల్లఁ బుడమిఁ బుట్టి ♦ నిల్లుగాదె? ౨౧

కానిమ్ము. కనుఁగొనియెదను. [అని యిటునటు నడచుచున్నాఁడు.]

[తరువాత దేవతార్చనఁ జేయుచుఁ గపాలకుండలయు నఘోరఘంటుఁ డును, కృతవధ్యవేషయై మాలతియుఁ బ్రవేశించుచున్నారు.]

మాల—హా! తండ్రీ! దయమాలి నీవు రాజునకు బలియీయఁ దలఁచుకొన్న నీ కూఁతురు విపత్తు నొందుచున్నది! హా! తల్లీ! అలంఘనీయమైన దైవదుర్యోగముచే నీ విప్పుడు నానిమిత్తము బెంగఁ బెట్టుకొని చావవలసినదాన వగుచున్నావు!. హా! నాకుఁ బెండ్లిచేసి నేను సుఖపడుచుండఁగాఁ జూచి సుఖపడవలెనని కనుపెట్టుకొనియున్న భగవతీ! కామందకీ! మాలతి తోడిదే నాకు బ్రతుకని నన్నుఁ బ్రేమించినందు కంతువలని ఫలము చిరకాలదుఃఖమని తెలిసికోవలసినదాన వైతివి!. హా! ప్రియసఖీ! లవంగికా! యింతటినుండి నన్ను నీవు కలలోనే చూడవలసిన దానవుగదే!

మాధ—హా! యింకను సందేహ మెందుకు? జీవించియుండఁ గానే యీమెను సంభావించెదను. [తొందరగా నడచుచున్నాఁడు.]

ద్వితీయరంగము—కరాళశక్తి గర్భాలయము.

కాపాలికులు;—దేవిచాముండే భగవతినమస్తే!

మ. సముదాటోపనిసుంభసంభ్రమసమత్ ♦ క్ష్మాగోళనిష్పీడనో
ద్భిన్నపృష్ఠాస్థిధూళీకళంపనిగళ ♦ ద్బ్రహ్మాండఖండస్థితి
క్రమపాతాళవిశాలగల్లవివర ♦ ప్రక్షిప్తసప్తాబ్ధికే
నమఃతే ప్రేంక్షదహ్యాప్తభర్గవరిష ♦ ద్వృత్తంబునీక్రీడకుఁ.

దండకము.

శ్రీమన్మహోత్తుంగ సర్వాంగ సంవేగవిక్షిప్త సంవ్యాససారంగ చర్మాంచలోద్దార చంచన్నఖాఘాతభిన్నేందునిష్యంద మానామృతస్రావ జీవత్కపాలావళీముక్త చండాట్టహాసత్రసద్భూరిభూత స్తుతిప్రక్రమంబై, లసద్విక్రమంబై, మహాభీమకాలోరగాభోగభోగాంగదగ్రంథి నిష్పీడనోత్ఫుల్లఫుల్లత్ఫణాపీఠ నిర్యద్విషజ్యోతిరుజ్జృంభణోద్దామరవ్యస్తవిస్తారిదోష్షండ పర్యాసితక్ష్మాధరంబై, నిబద్ధాదరంబై, జ్వలత్కీలికీలాకలాపావళీ పింగళాలోకమాలాకరాక్షోత్తమాంగ భ్రమిప్రస్తుతాలాత చక్రక్రియానుస్యూతదిగ్జాతమై, కల్మషాపేతమై, తుంగఖట్వాంగశృంగధ్వజోద్ధూతి విక్షిప్తనక్షత్రసందోహమై, వీతసందేహమై, స్ఫీతసమ్మోదభాక్పూతనోత్తాళభేతాళతాళస్ఫుటత్కర్ణసంభ్రాంత గౌరీఘనాశ్లేషహృష్యన్మనస్త్ర్యంబకానందమై, యందమై యొప్పు నీతాండవం బెప్పుడుం దేవి! వేవేగమే మాకరిష్టంబులం బాపి యిష్టంబులం జేసి ప్రాపై మముం బ్రోవఁగా నోపుదే! దేవితుభ్యంనమో! దేవితుభ్యంనమః. [అని యభినయించుచున్నారు.]

మాధః—[చూచి] హా! హా! యెంతప్రమాద మెంతప్రమాదము!

మ. అకటా! * యంతటిదొడ్డమంత్రికినిబి ♦ డ్డైపుట్టి * పాషండఘా
తుకచండాలురచేతభీతమృగియుం ♦ దోఁడేళ్ళకుంజోలెఁ జి
క్కి-కదున్ మృత్యువునోటఁ బ్రేలు; విధినై ♦ ర్ఘృణ్యంబునేమందు? ల
త్తుకకాల్దమ్ముల రక్తమాల్యవసనా ♦ దుల్ మేననొప్పారఁగా. ౨౩

కపాల:—

తే. గీ. చెలువ! నీయిష్టదైవముం ♦ దలఁచుకొనుమి
నిన్ను యముఁడిప్డుగొనిపోవ ♦ నున్నవాఁడు

మాల:—హా! దేవ! మహాభాగ! మాధవ! నేను పరలోకమందున్నను మీరు నన్ను మఱవఁదగ్గదికాదు. చచ్చియు నేను మిమ్ము మఱచిపోను.

కపాల:— పాప మీచిన్నది మాధవానురక్తురాలు!

అఘోర:—[కత్తియెత్తి]

దేవి! భగవతి! మంత్రిసి ♦ ద్ధికయిముందు
మ్రొక్కుకొన్నట్టిమ్రొక్కుదే ♦ పొందవమ్మ.

మాధ:—[తటుకునదాసి ముంజేతితోఁ గత్తిఁబడఁగొట్టి] అరే! దురాత్మా! కాపాలికాధమా తొలఁగు! చూడు! చచ్చితివి!

మాల:—[తటుకునఁజూచి] మహాభాగ! రక్షింపుము. రక్షింపుము [మాధవునిఁ గాఁగిలించుకొనుచున్నది.]

మాధ:—కళ్యాణీ! భయపడకు! భయపడకు!

మ. ఎదనీవేమనుకొందువో యనుచు నొ ♦ క్కింతేనిశంకింపకా
పదవేళన్ వలపుగ్గడించి పలవిం ♦ పంజొచ్చు నీచెల్మికాఁ
డెదుటన్ వర్తిలఁగంప మేల? చెలి! యిం ♦ దేయీదురాత్మున్వధిం
చిదురంతంబగు ఘోరపాపఫలముం ♦ జేసేతఁగుడ్పించెదన్. ౨౪.

* "ధూరికవిప్రసూతి యిది హా హారంధ" అని పాఠాంతరము.

అఘోర:—అరే! యీ పాపాత్ముఁడెవ్వఁడు? మాకు విఘ్నము చేసినాఁడు.

కపాల:—స్వామీ! యితఁడే దీనికిఁ బ్రియుఁడు. కామందకి స్నేహితునికొడుకు. మహామాంస మమ్ముచున్న మాధవుఁడు.

మాధ:—[కన్నీరొలుక] కాళ్యాణీ! యీయవస్థ యెట్లు?

మాల:—[కొంతసేపటికి నిట్టూర్పువుచ్చి] మహానుభావా! మేడమీఁది ప్రక్కగదిలోఁ బండుకొన్నాను. ఇక్కడ మేలుకొన్నాను. ఇంతకుమించి నాకేమియుఁ దెలియదు. మఱిమీ రెక్కడ నుండి?

మాధ:—[సిగ్గుతో]

క. నినుఁ బెండ్లియాడిధన్యతఁ
గనుకోరిక వెకలినగుచుఁ ♦ గడఁగినృమాంసం
బు నవిక్రయింపఁ ద్రేతభు
వినిదిరుగుచువచ్చినాఁడ ♦ వినినీయేర్పుల్. ౨౬.

మాల:—[పెడమొగముగా] అన్నా! యీయన నానిమిత్త మొల మానగొనక యెట్లు దిరుగుచున్నారు!

మాధ:—ఆహా! యిదేగదా కాకతాళీయమందురు!

సీ. ప్రబలుఁడౌ రాహుచేఁ ♦ గబళింపఁబడనున్న
యుడురాజకళఁబోలి ♦ యున్నదానిఁ
బ్రేయసీమణినిద్రై ♦ వికముగాఁజూచియీ
పాపిఖడ్గమువాతఁ ♦ బడకయుండఁ
గాదియుండిననాకుఁ ♦ గరుణచేహృదయంబు
కరఁగినీరయి, భీతిఁ ♦ గలఁగఁబాఱి
విస్మయంబునఁ జేసి ♦ విక్షోభమునుబొంది
దీపితంబయిచాలఁ ♦ గోపమునను

తే. గీ. ప్రాణతుల్యానుదీనిఁగా • పాడుకొనఁగఁ
గలిగినందుకుముదము చేఁ • దెలివిఁబొంది
యిట్లు చెప్పశక్యముగాక • దేమొయివుడు
వరుసవర్తించెడు నభిన్న • భావగతుల. ౨౭.

అఘోర:—అరే! బ్రాహ్మణడింభ!

మ. పులిమూచూచినపెంటి కైయడలుచుం • బాల్పునుసారంగముం
దలఁపింపందగునిన్నుఁగంటిబలిస • ద్మంబందుహింసారుచిం;
దొలుతన్నీదుశిరంబుఖడ్గహతిచేఁ • ద్రుంగించియీదేవికిన్
బలిగావింతుఁగబంధరంధ్రరుధిర • ప్రాగ్భారముల్ గాఱఁగన్.

మాధ:— అరే! దురాత్మా! పాషండచండాలా!

మ. జగమెల్లం బెనుచీఁకటిల్లుగను, సం • సారంబసారంబుగా,
ముగిఁగందర్పునదర్పుఁగాఁ, ద్రిభువనం • బుజ్జీర్ణకేళీవనం
బుగ, బంధువ్రజమ్ముమన్మనోరుజముగా, • భూమీజనంబుంగడున్
వికటాక్షిద్వితయప్రయోజనముఁగా • వింపంబ్రయత్నించితే.

మఱియు నోరిపాపా!

చ. నకియలునవ్వుటాలకును • జారుశిరీషమృదుప్రసూనకం
దుకములఁగొంచుఁ వేయుటకె • తూలివెసం గనుగందుమేనిపై
నొకటవధార్థమైయుడిద • ముంచిననీకునకాలకాలదం
డకమయినేఁడిదే పడెడు • నాభుజదండమునీశిరంబుపై. ౩౦.

అఘోర:—అరే! దురాత్మా! కొట్టురా! ఏదీకొట్టు. వీఁడేనా యంత తీసిపోయెడివాఁడు?

మాల:—నాథా! యీహతాశుఁ డతిదారుణమైన సాహసముచేయును. మీరు నాయందనుగ్రహించి యనర్థహేతువైన యీ కలహమునుండి వెనుకఁ దగ్గుఁడు. నన్ను రక్షింపుఁడు.

కపాల:—స్వామీ! యేమఱక యీ దురాత్ముని(గడతేర్చు(డు.

మాధ:—[మాలతితో] ఓసి పిరికిదానా!

తే. గీ. పాపియిదె వీ(డుహతు(డయ్యె ♦ భయము విడువు
మెఱు(గులు(బంపి కుంభముల్ ♦ పాణికులిశ
మునను జీల్చు సింగమునికు( ♦ బుట్టునే(ప్ర
మాదమెందైన హరిణసం ♦ హరణమందు. ౩౦.

అఘోర:—[కపాలకుండలతో] ఓ భీరురాలా!

క. కరికుంభ కూటపాటన
పరిణతకరకులిశహారిని ♦ బాలహరిణ సం
హరణముననొక ప్రమాదము
వారయునె? యిదె పాపిపొలిసె( ♦ బోవిడుము భయమున్. ౩౧.

[తెరలో( గలకలము.]

అందఱు:—[ఆలకించుచున్నారు.]

ఓహో! మాలతిని వెదకుచున్న జనులారా! ఇదిగో మంత్రి భూరివసువు నోదార్చుచు నప్రతిహతమైన తన దివ్యదృష్టిచే( దెలిసికొన్నదై కరాళశక్తిగుడి చుట్టివేయుడని భగవతి కామందకి యాజ్ఞాపించుచున్నది.

ఆ. వె. ఇట్టిదారుణముల ♦ నెవ(డోపు(జేయంగ
నిక(క నఘోరఘంటు( ♦ డొకడు దక్క?
నెంచిచూడదీని( ♦ గొంచు(బోవుటయు దే
వికిని బలికి(గాని ♦ వేఱుగాదు. ౩౨.

కపాల:—స్వామీ! మనలను చుట్టు ముట్టడించినారు.

అఘోర:—ఇప్పుడు విశేషించి పౌరుషము చూపవలసిన సమయము.

మాల:—హా! తండ్రీ! హా! భగవతీ!

మాధ:— కానిమ్ము. దీనిని బంధుజనులయొద్ద విడిచివచ్చి వారియెదుటనే వీనిని వధించెదను. [మాలతి నావలకుఁ బంపి వచ్చుచున్నాఁడు]

మాధ:—అఘోర:—[పండోరుల నుద్దేశించి] అరే! పాప!

చ. పెటపెటరావముల్ సెలఁగఁ ♦ బిండియుగుండయుఁ జేసియెమ్ముకల్
  ద్రుటిఁద్రుటితంబుగా నటికి ♦ తోరముతై ననరంబు, లంతటం
  గటకట లేకమెత్తఁబడు ♦ కండలనీయుడిదంబు చెందఁగా
  నిటునటుఁ ద్రెళ్లుచుంబడెదు ♦ నిప్పుడెనీకొండ లింతలింతలై. 33.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

పంచమాంకము—సంపూర్ణము.

# మాలతీమాధవము

## షష్ఠాంకము

ప్రథమరంగము—మాలతి లోఁగిటి ముంగిలి.

[తరువాతఁ గపాలకుండల ప్రవేశించుచున్నది.]

కపాల:—అరే! పాపా! దురాత్మా! మాలతి నిమిత్తము మాగురువుగారినిఁ జంపితివికదరా! క్రోధముకొలఁదిఁ బోరఁదొడఁగిన నన్నుఁగూడ నాఁడుదియని చంపక యవమానపఱచితివి కదరా! [క్రోధముతో] అరే! మాధవపాతక! కపాలకుండల కోపమువలని ఫలమవశ్యకముగా ననుభవింపఁగలవు.

ఆ. వె. వారక పగఁబట్టి ♦ వాఁడి కోఱలవిసం
బుమిసి బుస్సుమనుచు ♦ నొడిసి భుజగి
దన్నుఁ గఱవనుండఁ ♦ ద్రాఁచుల దొరఁబట్టి
చంపి సతినికట్టు ♦ స్వస్థతయగు? ౧.

(తెరలో)

చ. వరపతులార కృత్యములా ♦ నర్పుఁడిపెద్దల యాజ్ఞచొప్పునన్
స్వరవిధి వేదమంత్రములు ♦ బ్రాహ్మణులింపలరం బఠింపుఁడీ
నగసకళా ప్రసంగములె ♦ సంగఁగఁ జేయుఁడిమంగళార్థమై,
వరుఁడు వధూగృహంబునకు ♦ బంధులతోనిదె తర్లివెళ్లెడుక్". ౨.

పెండ్లివారందఱు రాకముందే సౌభాగ్యవతిమైన మాలతిసిం డీసికొని నిర్విఘ్న మంగళార్థము నగరదేవత యాలయముఁ బ్రవేశింప వలసినదనియుఁ, బెండ్లికూఁతునకుఁ బెట్టుటకై పెండ్లికొడుకువా రలం

కారము:లు క్రంతఁదెత్తురుగాన వారిని సగౌరవముగా నెదురుకొనవలసి నదనియు భగవతి కామందకి యాజ్ఞాపించుచున్నది.

కపాల:—కానిమ్ము. ఇందు మాలతీకళ్యాణమునకయి తొందరతో నలంకరించుచుఁ దిరుగులాడు పరిజనుల సందడి యెక్కువగా నున్నది. కాఁబట్టి ప్రస్తుతమిందుండి మరలి పిమ్మట మాధవున కపకారము చేయు విషయమున శ్రద్ధవహించెదను.

[ఇది విష్కంభము.]

ద్వితీయరంగము:—అమ్మవారి గర్భాలయము.

కల:—[ప్రవేశించి] అమ్మవారి గర్భాలయములో మకరంద సమేతుఁడై ప్రవేశించి "మాలతి యిటువచ్చుచున్నదేమో చూచి రమ్మ"ని మాధవుఁడు నాకాజ్ఞాపించినాఁడు. కావున వీనికిప్పుడు శుభ వార్త చెప్పి యానందముఁ గలిగించెదను.

[తరువాత మాధవమకరందులు ప్రవేశించుచున్నారు.]

మాధ:—

చ. తనరఁగ మాలతీప్రథమ ♦ దర్శనమైన దినంబుగోలెఁదా
ఘనమగుచున్ మృగాక్షి చెలి ♦ కారవుఁజేష్టలఁ బుట్టిఁగన్న యీ
మనసిజ వేదనాభరము ♦ మానును నాకిపుడంచు నెంతు శో
భనమయియొండె యోగినియు ♦ పాయమపాయముఁ బొందిరొండెనున్

మక:—భగవతి మేధాశక్తి తిరిగిపోవుటకూడనా?

కల:—[సమీపించి] అదృష్టవంతుఁడవు! ఇదిగో మాలతి యీలాగే బయలుదేఱినది.

మాధ:—నిజముగానే?

మక:—పరధ్యానమా యేమియట్లడుగుచున్నావు? బయలు దేఱుచేకాదు. చేరువకుఁగూడ వచ్చినది. చూడు

ఆ. వె. వాయువశతఁ జెదరి ♦ వఱచు మబ్బులగర్జ
ననుకరించి మొరయు ♦ ఘనమృదంగ
మంగళారవంబ ♦ మందమై మఱియేమి
యును వినంగనీక ♦ యున్నదిపుడు. ౪.

కనుకరమ్ము. కిటికీలోనుండి చూతము. [అట్లుచేయుచున్నారు.]

కల—అయ్యా! చూడుము! మింటికెగసిన రాయంచల సంచుఁ దలఁపించి మించు వింజామరలం బుట్టుసమీరంబులకు బిట్టుగదలు కదలి కావలులపేరి తరఁగలచాలుచే విరివిమిగులు గగనాంగణంబను సరోవరంబునఁ దెఱపిలేక నిలువుఁగాడలపయి నిట్టనిలిచిన తెల్లదామరల వడువున బెడఁగడరు వెల్లగొడుగులను, పుక్కిట విడెంబులిడి హాయలుమీర నములుచు మక్కళించిన చెక్కుటద్దము లొక్కవింతసింగారంబు సవరించుచుండ మంగళగీతుల మధురరీతులఁ బాడుచు మేనముట్టుపఱచిన మానికంపుసొమ్ముల దీప్తిజాలంబులచే నంబరంబున నింద్రచాపవిడంబనంబు నూపుచుఁ గోపువాఱు వారసుందరులను వీఁపుల నెక్కించుకొని గణగణమని మ్రోయుపైఁడిగంటలతో ఝుణఝుణమని నడచివచ్చు నాఁడేనుఁగులను జూడుము.

మాధ—మక—[కౌతుకముతోఁ జూచుచున్నారు.]

మక—ఆహా! భూరివసువుయొక్క యైశ్వర్యము! పట్టినను ఇటువంటి యైశ్వర్యమే పట్టవలెను.

చ. వరపయిగాలికింగదలి ♦ పాలపులుంగుల ఱెక్కరంగులం
బెరసిన నెమ్మికన్నులవి ♦ మించికటంబులనావరించెనా
సురవరచాపమొప్పెనన ♦ సుందరచిత్రవితానకల్పితా
వరణమొసంగెనాఁగమణి ♦ భాసురకాంతులుమీఱెదిక్కులన్. ౫.

కల:—పైఁడిపూవులు చెక్కిన వెండిబెత్తములు చేతఁబట్టుకొని సందడిసేయుచు ముందునడచు ప్రతిహారబృందంబులు తలఁగుఁడు తొలఁగుఁడని నేలగేఁచిన గిఱికి నెడగలుగ నొనరిలుచుఁ బరిజనంబులు మేరమీఱక నడుచుచున్నారు. సిందూరనికరసంధ్యారాగంబుచే నెఱ్ఱవాఱిన ముఖంబునఁ దళతళమను కాంచననక్షత్రమాలికం దాల్చిన కరేణురజని కలంకారమై, తన్నుఁ గన్నులకఱవుదీఱఁ జూచువారికిఁ దనదగు చిక్కని చక్కని మేనిపాండిమచే లోనిమదనవేదనం దెలియఁజేయుచుఁ బ్రతిపచ్చంద్రరేఖా విలాసంబుల కాస్పదంబయి యిదిగో మాలతి దాదాపునకు వచ్చినది.

మక:—వయస్యా! చూడు!

ఉ. స్రుక్కిన మేనిపాండిమను ♦ సొమ్ములకెల్లనువన్నెవెట్టునీ
చక్కెరబొమ్మ, పెండిలిప్ర ♦ సక్తినలంకృతియుక్తినూని, లో
నుక్కఱచుండియుంబువుల ♦ నొప్పెడిలే ననదీఁగఁబోలుచున్,
బొక్కిబహిర్గతంబగును ♦ నోవ్యథఁదాఁబ్రకటించుచుండెడున్. ౬.

అదిగో నాఁడేనుఁగు ప్రవేశించినది.

మాధ:—[ఆనందముతో] ఓహో! ప్రియురాలు దేవీలవంగికలతోఁ గూడ దిగినది.

[తరువాతఁ గామందకి, లవంగిక, మాలతి ప్రవేశించుచున్నారు.]

కామ:—[సంతోషముతోఁ బెడమొగముగా]

మ. అనుకూలుండయిబ్రహ్మమాకొసఁగుఁగా ♦ కత్యంతముఖభద్రమా
యసమేషుల్ ఘటియింత్రుగాక రమణీ ♦ యంబౌసమాప్తిం, గృతా
ర్థనునేనౌదునుగాక మత్ప్రియసుహృ ♦ త్సంతానముంగూర్చి, యీ
ఘనయత్నంబు ఫలించుఁగాక మఱియుం ♦ గళ్యాణదంబయ్యెడున్.

మాల:—మరణమనెడి పరమసుఖము నాకెల్లు సందుదొరకును? పోనీ! మందభాగ్యురాలనైన నాకు మరణముకూడఁ బొందరాని కోరిక యగుచున్నయది.

లవం:—ఈయనుకూల విప్రయోగముచేఁ బ్రియసఖి మిక్కిలి యాయాసము నొందినది!

ప్రతిహారి:—[చేత నగలవక్పెరముతోఁ బ్రవేశించి] ఇవిగో రాజుగారంపిన పెండ్లి యలంకారములు. మాలతికి దేవతాసన్నిధానమం దలంకరింపవలసినదని మంత్రిగారు దేవిగారితోఁ జెప్పుమన్నారు.

కామం:—కళ్యాణసమయములం దిట్లు జరుగవలసినదే. ఏవీ యిటుచూపు!

ప్రతి:—ఇవిగో రెండు తెల్ల పట్టుచీరలు. ఇది పలెవాటు రంగుచీర. ఈనగ లొడలియుంగు. ఈ ముత్యాలహారములు మెడసజ్జ. ఇది మంచిగంధము. ఇది ధవళ పుష్పమాలిక.

కామం:—[పెడమొగముగా] జనులీ నగలన్నియు రమణీయుఁడైన మకరందుని యొంటనే చూడఁగలరు. [పుచ్చుకొని ప్రకాశముగా] సరే! మంత్రిగారితో నిట్లు చెప్పుము.

ప్రతి:—[నిష్క్రమించుచున్నది.]

కామం:—లవంగికా! నీవును అమ్మాయియు లోపలకుఁబదుండి.

లవం:—మతి భగవతి!

కామం:— నే నించుక నే పెవ్వరును లేకుండ నీనగలఁ దాఁచిన రత్నముల గుణదోషములను శాస్త్రమునుబట్టి పరీక్షింపవలెను. [నిష్క్రమించుచున్నది.]

మాల—[తనలో] ఇప్పుడు లవంగికయు నేనునుదప్ప నెవ్వరు లేరు. [ప్రకాశముగా] . చెలీ! యిటురావే!; యీ గుడిగుమ్మములోఁ గూరుచుందము. [ప్రవేశించుచున్నారు.]

మక:—మనమీ స్తంభముచాటుననుండి చూతము.[అట్లుచేయుచున్నారు.]

లవం:—చెలీ! యిది మైపూఁత ఇవి పూలదండలు.

మాల:—సరే! యేమిచేయు మనెదవు?

లవం:—చెలీ! యీపాణిగ్రహణ శుభసమయమునందుఁ గళ్యాణసంపత్తినిమిత్త మమ్మవారినిఁ బూజింపవలసినదని నిన్నిక్కడ కమ్మగారు పంపినారు.

మాల:—[తనలో] ఇది యేమీ? యిదివఱకే దైవము తాఁదలఁచుకొన్నంత దారుణమును జేసినాఁడుగదా యిసి తెగితెగని కత్తితో నాయువుపట్లు గోసినట్లు మరణావేదన ననుభవించుచుఁ గడువు చెఱువయి లోలోపలనే కుళ్ళికుళ్ళి యేడ్చుచున్న మందభాగ్యురాలిని నన్ను నీ విప్పుడు మఱింత యేడిపించెదవు!

లవం—చెలీ! యేదో నీలోనివే యాలోచించుకొనుచున్నావు?

మాల—ఏమున్నది? అందని మ్రానిపండున కాసపడి ప్రయాసపడిన భాగ్యహీనురాలి యాలోచన.

మక:—మిత్రుఁడా! మాధవా! వింటివా?

మాధ:—హృదయమునకు సంతోషములేదు.

మాల:—[లవంగికను గాఁగిలించుకొని] చెలీ! లవంగికా! నిజముగా నాకు నీవు తోఁబుట్టువువంటిదానవు. కాఁబట్టి యిదిగో నీప్రియసఖి యిప్పుడు దిక్కుమాలిన చావుచచ్చుచు నీయెడ దానికిఁ జిన్ననాఁటనుండియుఁ గల ప్రేమకొలఁది నిన్నొక్కసారి కౌఁగిలించుకొని ప్రార్థించుచున్నది. నేను నీకుఁ గావలసినదాననై తినా నన్ను నీహృదయమునందుంచుకొని సంపూర్ణ సౌభాగ్య లక్ష్మీపరిగ్రహైక మంగళమగు మాధవుని శ్రీముఖారవిందమును ఆనందమన్పృణముగాఁజూడుము. [అని యేడ్చుచున్నది.]

చ. చెదరినసౌష్ఠవంబుగల ♦ జీవసుమంబుకు దేర్పునట్టివై
పదమలభూరినిర్వృతికి ♦ సాధనమై ఘనతృప్తిహేతువై
హృదయరసాయనంబులయి ♦ యింద్రియమోహనమంత్రజాలమై
యిదె వచనామృతంబులివు ♦ డేమియదృష్టమొ గల్గెనాకు నన్. ౮

మాల:—నాకుఁ బ్రాణప్రదుఁడైన నామనోహరుఁడు నేను గతించితి నని విని నాకొఱకు దుఃఖించి నిక్షేపమువంటి యాశరీరమును శుష్కింపఁజేయకుండునట్లును నేను పరలోకమందున్నను నన్నును నాకథలను దలఁచుకొని యామహానుభావుఁడు శేషించిన తనదేహయాత్రను నిలిపి వేయకుండునట్లును చేయుము. ఇదియే యనాథమైన నీప్రియసఖి మాలతికిఁ దీఱవలసిన కడపటికోరిక.

మక:—అబ్బా! యీమాటలు విన్నఁ గడుపుదరికోసికొని పోవుచున్నది.

మాధ:—

శా. ఆశాభంగముగాఁగ భీతిగొని మో ♦ హభ్రాంతినేనాత్మ నెం
తేశోకాతురమయ్యెన్ మనోహరమునై ♦ యేపారఁగాఁ జేయునా
శ్రోత్రంబుల్ వినినంతనే యకట! నా ♦ కున్ గాఢచింతాభరా
వేశంబుంబరమోత్సవంబుయుగప ♦ ద్వృత్తిన్ విజృంభించెడున్. ౯

లవం:—నీయమంగళము కొట్టువడిపోయినది. ఇంక నేనేమియు వినను.

మాల:—చెలీ! మీకు మాలతి బ్రతుకుమీఁదనున్న ప్రీతి మాలతిమీఁద లేనేలేదు.

లవం:—చెలీ! ఏమి యిట్లనుచున్నావు?

మాల:— ఏవో కల్లబొల్లిమాటలచే లేనియాసలు పుట్టించి నన్నుఁ జావనీకుండ నాకీ రోఁత దెచ్చిపెట్టుచున్నారు. స్వతంత్రురాలను గాకపోవుటచే నామహానుభావుని విషయమున నపరాధము

చేసినదాననైతిని. కనుక నీ దేహమునువిడిచి సుఖపడియెదను. ఇప్పు డిదియే నాకోరిక. ఈకార్యమందు నాకుఁ బ్రియసఖ యనుకూలు రాలుకావలెను. [అని కాళ్ళమీఁదఁ బడుచున్నది.]

మక:—ఓహో! యేమి! దీనియెడల దీనిప్రేమ!

లవం:—[మాధవుని సైగచేసి పిలుచుచున్నది]

మక:—వయస్యా! లవంగిక స్థానమందు వెళ్ళి కూర్చుండుము.

మాధ:—భయముచే నేను నేను గాకున్నాను.

మక:—శుభము చేకురనున్నతటి నిట్లుగానేయుండును.

మాధ:—[స్వేచ్ఛగా లవంగికస్థానమందుఁగూర్చున్నాఁడు.]

మాల:—చెలీ! యనుగ్రహించి యనుకూలింపుము.

మాధ:—

క. సుగుణములగనివితగునే
తెగువలు? చెలి! వేగపాటు ♦ దిగవిడు; విరసం
బగునీవియోగదుఃఖము
నిఁగనాహృదయంబుదాన ♦ హింపఁగలదే! ౧౦.

మాల:—చెలీ! మాలతీప్రాణము నీకుఁ ద్రోసివేయరాదు గదా!

మాధ:—

ఆ. వె. నన్నుడిగ్గవిడిచి ♦ నాకుఁదీవ్రాయాస
మీాయఁదలఁచుకొంటి ♦ వేమియందు?
నీయభీష్టమెట్టు ♦ లోయబ్లైరొనరింతు
గానిముందునాకుఁ ♦ గౌఁగిలిమ్ము. ౧౧.

మాల:—[సంతోషముతో] ప్రియసఖికి నామీాఁద నెంత యనుగ్రహమువచ్చినది! [లేచి] ఇదిగో కౌఁగిలించుకొనుచున్నాను.

కన్నీరుద్గమ్మునటచేఁ బ్రియసఖినిఁ గన్నులారఁజూచు భాగ్యము మాత్ర ములభింపకున్నది. చెలీ! నీశరీరస్పర్శ ముదురు తామరపూవులోని దుద్దునంటియుండు చిన్ని రేకులవలె గరుపారి నా కిప్పు డేదో క్రొత్త సుఖముఁ గలిగించుచున్నది. [కంటఁదడివెట్టి] ఇదిగో నీవు దోసిలిపట్టి మ్రొక్కి నా మాటలుగా ఆయనతో నిట్లు మనవిచేయుము. "నేను మందభాగ్యురాలను. కనుక నే యారపిరిసిః తమ్మిపూవుల సిరుల నప హరింపఁజాలు నీముఖ చంద్రమండలమును గన్నులపండువుగఁ జిర కాలము చూడఁగలుగు భాగ్యము నా కొదవదయ్యెను. ఉమగరలేక పాదవుమీాతి యడఁపరాని బెడిదంపు దుఃఖోద్వేగంబునకు నిలువలేక తొడిమె పట్టువిడిచిన డెందమునకు వట్టియడియాసలు చుట్టఁబెట్టితిని. నానిమిత్తము చెలికత్తెలు బెంగఁబెట్టుకొని యేడ్చునట్లుగాఁ బెక్కు మాటలు సహింప శక్యము గాని వింతవింతల బాధలన్నియు ననుభ వించితిని. మలయానిలచంద్రాతపప్రముఖములైన గండములన్నియుఁ గడచితిని. తుదకు నా యాశలన్నియు నిరాశలై పోయినవి" అని. నీవు ప్రియసఖ నెన్నఁడుగాని మఱచిపోకుము. ఇదిగో నింకొకటి. ఇది మాధవస్వామి తన శ్రీహస్తములతో నిర్మించియిచ్చిన మనోహర వకుళమాలిక. దీనిని నీవు మాలతినివలెనే చూచుకొని హృదయమందు ధరింపఁదగ్గది. [అని తనకంఠమునుండి తీసి మాధవుని హృదయమందు వకుళమాలిక నుంచుచుఁ జప్పునఁదొలఁగి భయోత్కంపములను అభిన యించుచున్నది.]

మాధ:—ఓహో! [పెడమొగముగా]

చ. కలుకుమిటారిగబ్బిచను ♦ గుబ్బనయుబ్బడరంగఁగ్రుచ్చియా
కలుకలమున్న నన్నుబిగి ♦ కౌఁగిటఁజేర్పఁగఁబొల్చునాయెడల్
చలువలొసంగుసారఘన ♦ సారపటీరహిమాంబుపూరశై
వలశశికాంతకాంతబిస ♦ వర్గరసైకనిషేకమబ్బెనా. ౧౨.

మాల:—అహో! లవంగిక చే మాలతి మోసపోయిన దే! నాకు సంతాప మినుమడించుచున్నది.

మాధ:—ఓసీ! పరవ్యసనమును గుర్తెఱుఁగనిదానా! నిమట్టుకు నీవొక్కతెవే యిట్లు బాధనొందుచున్నా ననుకొని యితరులను తూల నాడెద వెందుకు?

చ. అలమినతీవ్రతాపముమ ♦ హాజ్వరమైతనువెల్లఁగాల్ప, నీ
చెలిమినిబద్ధమన్నగుతి ♦ జీవితమున్నిలకొల్ప, భావనా
కలితభవత్సమాగమము ♦ కల్మిని వేదన తాల్మినిల్పఁగాఁ
జలుప నెయేనువాసరని ♦ శిల్ చెలి! యీగతిఁగష్టసంగతిఁ. ౧౩.

లవం:—చెలీ! నిన్నుఁ జక్కఁగానే యెత్తి పొడిచినాఁడు.

కల:—ఓహో! యీసంధాన మెంత సరసముగానున్నది! ఎంత చక్కఁగానున్నది!

మక:—

మ. కలికీ! నీదగుప్రేమనిక్కమని చి ♦ క్కంబట్టితానిల్పకోఁ
గలిగెన్ జీవితమెట్టిటో యితఁడుని ♦ క్కంబింతవట్టిన్ని నా;
ళ్ళలమంగాకనిబద్ధకంకణముని ♦ హస్తంబుఁజేపట్టియీ
చెలికాఁడింకఫలించుఁగాకెపుడునుం ♦ జేకూతిమీకోరికల్.

లవం:—అయ్యో! ఈమెగారు తనకుఁదానే యదరుబెదరు లేకుండ హృదయమిచ్చి కౌఁగిలించుకొన్న సాహసురాలుగదా! యింక నీమె కంకణాలంకృతమైన హస్తమును గ్రహించుటకు మీ కాలోచన యెందుకు?

మాల:—ఆఁ; ఆఁ; ఇది కన్యకాజన విరుద్ధముగా నుపన్య సించుచున్నది!

కామం:—[ప్రవేశించి] ఇదియేమే కూఁతురా? బెదరిబెదరి చూచుచున్నావు!

మాల:—[వడఁకుచుఁ గామందకిని గౌఁగిలించుకొనుచున్నది.]

కామం:—[ఆమె గడ్డమెత్తి పట్టుకొని] బిడ్డా!

చ. ఎవనికినిన్నుఁజూడ, మఱి ♦ యెవ్వనిఁజూడఁగనీకులోచనో
త్సవమయియంతమానసిక ♦ సంగముఁగార్శ్యమునోలిఁగూడ నా
యువజనుఁడిందునిందుముఖి ♦ యుండుఁగదమ్మప్రియుండుగఁ జడ
ప్రవణతమానుమమ్మ! విధి ♦ రంజిలుఁగాముఁడవాప్తకాముఁడై.

లవం:—దేవీ! యితఁడు భయము నొంటిలేక యమావాస్య చీఁకటిలో రుద్రభూమిలోఁ దిరుగుచుఁ బ్రచండ పాషండ దోర్దండ సాహసమును జెండివైచిన దండిమగఁడు గదా! కనుకనే వీనింజూచి ప్రియసఖి భయముచే వడఁకుచున్నది.

కామం:—లవంగికా! మేలుచేసిన ప్రియునిగూర్చి యిట్లు పలుకుట యోగ్యముగానే యున్నది.

మాల:—[తనలో] హా! తల్లీ! హా! తండ్రీ!

కామం:—నాయనా! మాధవా!

మాధ:—అమ్మా! యేమి సెలవు?

కామం:—ఇదిగో నశేషసామంతమస్తకోత్తంస పరాగరంజిత చరణాంగుళియగు మంత్రి భూరివసువు నేక పుత్రికారత్నము మాలతి సదృశ సంయోగ రసికుఁడగు బ్రహ్మదేవుని చేతను, మన్మథుని చేతను, నాచేతను నీకీయఁబడుచున్నది.

మక:—భగవతియొక్క ప్రసాదమహిమచేఁ గోరిక యీడేఱినది.

మాధ:—ఎందుకోకాని భగవతి యిప్పుడు కంటఁ దడిపెట్టుచున్నది.

కామం:—[చీరకొంగుతోఁ గన్నులు తుడుచుకొని] వత్సా! నీకొక్క మేలుచెప్పఁ గోరుచున్నాను.

మాధ:—అది యేమయియుండును?

కామం:—ఇదిగో మనవిచేయుచున్నాను.

మాధ:—సెలవిమ్ము.

కామం:—

చ. పరిణతి రమ్యముల్గఁకథ ♦ వాదృశులైన జనాళిప్రేమముల్
మఱియును గొన్ని హేతువుల ♦ మాన్యనయాదును నీకుఁగాన నన్
గుఱిచియొ లేకయొండొకరుఁ ♦ గూర్చియొ దీనెడనీకునై నయ
ప్పరిచయ సత్కృపవ్రీడక ♦ పాలనసేయఁగదయ్య! దీనినిన్. ౧౬

[అని నమస్కరించుటకై యదుగులఁ వ్రాలఁ గోరుచున్నది.]

మాధ:—ఓహో! ప్రసంగము వాత్సల్యము నతిక్రమించుచున్నది.

మక:—దేవీ!

చ. గొనముల మించెనంచుఁగదు ♦ గొప్పకొలాన జనించెనంచులో
చనములఁ దన్పునంచుఁబటు ♦ సౌహృదముం గలదంచుఁ గైవసం
బొనరుచు కోవలంతియొక ♦ టొక్కటనేని జనాధునిట్టులీ
వనితవిధంబు మీకునిటు ♦ వంటిదికాయని తెల్పనేటికిన్. ౧౭.

కామం:—వత్సా! మాధవా!

మాధ:—సెలవిమ్ము.

కామం:—దీనిని స్వీకరింపుము.

మాధ:—స్వీకరించుచున్నాను.

కామం:—వత్సా! మాధవా! బిడ్డా! మాలతీ!

మాధ:-మాల:-అమ్మా! సెలవిమ్ము.

కామం:—

తే, గీ. చెలియునెల్ల చుట్టములును ♦ జీవితంబు
నెల్లకోర్కెలు భాగ్యంబు ♦ లిన్నిటికిని
చెలువలకు భర్తయును బురు ♦ షులకుధర్మ
పత్నియునగుటఁ దెలియుఁడీ ♦ వత్సలార. ౧౮.

మక:—కా కేమి?

లవం:—తమరు సెలవిచ్చినట్లే.

కామం:—వత్సా! మకరంద! మాలతి కీయఁబడిన యీ పెండ్లినగలు దీసికొని చాటునకుఁబోయి పెండ్లిప్రయత్నముమీఁద నుండుము. [అని పళ్లెము నిచ్చుచున్నది]

మక:—చిత్తము. ఇదిగో నీబొమ్మ తెరచాటునకుఁబోయి వేషమును ధరించుచున్నాను. [అట్లు చేయుచున్నాఁడు.]

మాధ:—దేవీ! ఇది చెలికానికి సులభమేకాని యిందువల్ల చిక్కుచిక్కులు కలుగును.

కామం:—నీకెందుకోయి యీచింత?

మాధ:—ఎందుకు? భగవతికే తెలియఁగలదు.

మక:—[ప్రవేశించి నవ్వుచు] వయస్యా! యిదిగో మాలతినైనాను. [అందఱు నాశ్చర్యముతోను సంతోషముతోను జూచుచున్నారు.]

మాధ:—[మకరందుని బిగ్గఁ గౌఁగిలించి] దేవీ! నందనుఁడదృష్టవంతుఁడేసుమీ! యేమన్న ఈవేషముతోనున్న మన ప్రియవయస్యనిఁజూచి మనసా కించిద్భోగమయినను పొందఁగలఁడు.

కామం:—చిరంజీవులయిన మాలతీమాధవు లిద్వరును వివాహమంగళార్థ మిందుండి యీచెట్లతోఁపుగుండ నడువుఁడు. అక్కడడిగ్గియవెనుక నుద్యానవాటమునం దవలోకిత, వైవాహికసామగ్రియంతయు సిద్ధముచేసికొని యుండును. మఱియు,

మ. కలితోత్కంఠ కఠోర కేరళవధూ ♦ గండాచ్ఛ పాండుచ్ఛదా
వలితాంబూలలతాపినద్ధ ఫలిత ♦ వ్యానమ్రపూగద్రుమం
బులు, తక్కోలకజగ్ధముగ్ధవికిర ♦ వ్యాహారవంబుల్ కదుం
బాలుచుంబ్రేంఖత మాతులుంగతతులా ♦ భూభాగముల్ రమ్యమై.

మదయంతికా మకరందులు వచ్చువఱకును మీా రక్కడనే యుండుఁడు.

మాధ:—[సంతోషముతో] పెండ్లిమీాఁదఁ బెండ్లియు శుభము మీాఁద శుభమును అగునుగాక!

కల:—ఏమియదృష్టము! మాకు నీదియొక వేడుకగూడనా?

కామం:—మీారు సందేహింపఁ బనిలేదు.

లవం:— చెలీ! వినుచున్నావా?

కామం:—వత్సా! మకరందా! భద్రా! లవంగికా! మన మిందుండిపోదము.

మాల:—చెలీ! నీవుకూడ రావలయును.

లవం:—[నవ్వి] ఇప్పుడు మే మెందుకు తొలఁగిపోక? [అని కామందకీ లవంగికా మకరందులు నిష్క్రమించుచున్నారు.]

మాధ:—ఇప్పుడు నేను

మ. ప్రకటానంగనిదాఘతాపముశమిం • పఁగ దీపియామాలకం
టకయుక్కోమలబాహునాళమునఁగాం • తంబై నమార్ద్రాంగుళీ
నికరంపుందళమా కరంబునరసీ • గెందామరగ హస్తినా
యకుఁడుంబోలెఁగరంబునాఁచి,కొనియే • నా మోదముంబొందెదగ్

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

షష్ఠాంకము—సంపూర్ణము.

# మాలతీమాధవము

## సప్తమాంకము

ప్రథమరంగము—నందనమంత్రిగృహము.

[తరువాత బుద్ధరక్షిత ప్రవేశించుచున్నది.]

బుద్ధ—ఆహా! కామందకినేర్పు? చూచువారి కించుకంతయు నానవాలు దెలియకుండునట్లుగా మకరందునికి మాలతీవేషము వేయించి యాతనిని మంత్రిగారి లోఁగిటిలో నందనునకుఁ బెండ్లిచేసి రహస్యము బయలుపడకుండ మెలఁకువతోఁ గాపాడినది. ఇప్పుడు పెండ్లికూఁతురును వెంటఁబెట్టుకొని నందనునియింటికి వచ్చినారము. పిమ్మట నందనుని సెలవడిగి కామందకి స్వగృహమునకు వెళ్ళినది. ఇది కౌముదీ మహోత్సవమునకు సమయముగాకపోయినను అత్తవారింటికిఁ గ్రొత్త కోడలు వచ్చినందునఁ బరిజనులందఱుఁ బండుగుచేసికొని త్రాగి యొడలెఱుఁగక పండుకొనియున్నారు. కనుక నీప్రదోషసమయము మా యుద్యమముల కనుకూలముగా నుండఁగలదు. ఇప్పుడే కామోద్రేకముచే నందనుఁడు నన్ననుగ్రహింపుమని మాలతీ వేషధారియైన మకరందుని కాళ్ళమీఁదఁబడి యప్పటికిని కార్యముఁ గానక బలాత్కారముగా మీఁదఁబడినాఁడు. అంతట మకరందునిచే నిష్ఠురముగా నిరాకరింపఁబడినవాఁడై నందనుడు రోషావేశముచే మాట తడఁబడఁ, గన్నుల నీరు గ్రమ్మ, మొగము జేవురింప 'ఛీ! చిన్నతనములోనే చెడిపోయిన యీ చెడిపెతో నాకేమి ప్రయోజనము?' అని తిట్టి యొట్టుఁబెట్టుకొని పడకిల్లువిడిచి యవలికి లేచిపోయినాఁడు. కాఁబట్టి యిప్పుడీ వృత్తాంతమంతయుఁ దెలియఁజెప్పి మదయంతికం దోడుకొని వచ్చి మకరందునితోఁ గూర్చెదను. [అని నిష్క్రమించుచున్నది.]

[ఇది ప్రవేశకము.]

ద్వితీయరంగము — నందనుని పడకగది.

[తరువాత శయ్యాగతుఁడై మకరందుఁడును, లవంగికయుఁ ప్రవేశించుచున్నారు.]

మక:—లవంగికా! బుద్ధరక్షిత వచ్చునా భగవతియొక్క తంత్రము విజయమునొందినట్టే!

లవం:—అయ్యా! సందేహమెందుకు? ఇదిగో నందెలచప్పుడు వలె నున్నది. ఆమె మమీఁద వెళ్ళి బుద్ధరక్షిత మదయంతికను దీసికొని వచ్చుచున్నదని తలఁచెదను. కాఁబట్టి యుత్తరీయము ముసుఁగుఁ బెట్టుకొని నిద్రించుచున్నవానివలె నుండుము. [మకరందుఁడట్లుచేయు చున్నాఁడు.]

[తరువాత మదయంతికయు బుద్ధరక్షితయుఁ ప్రవేశించుచున్నారు.]

మద:—చెలీ! నిజముగా మాయన్నగారికి మాలతిమీఁదఁ గోపమువచ్చినదా?

బుద్ధ:—నే నబద్ధము చెప్పుదునా?

మద:—అయ్యో! యేమికీడు మూఁడునోగదా నాకు మిగుల భయముగా నున్నది. కాఁబట్టి చెలీ! రమ్ము! పోయి వక్రచిత్తురాలైన యా మాలతిని మందలింతము. [అని నడచుచున్నారు.]

బుద్ధ—ఇదే పడకిల్లు [ఉభయులు ప్రవేశించుచున్నారు.]

మద:—చెలీ! లవంగికా! మా ప్రియసఖ నిదురించుచున్నదా?, మెలఁకువగా నున్నదా?

లవం:—చెలీ! రమ్ము! రమ్ము! దీనిని లేపకుము. ఇది యింత వఱకు నేడ్చియేడ్చి యిప్పుడే కొంచెము కన్నుమూసిన దనుకొను చున్నాను. నీవీ మంచముమీఁదఁ గూర్చుండుము.

మద:—[అట్లుచేసి] ఈఁగయ్యాళి యెందుకే దుఃఖించుచున్నది?

లవం:—ఏమో! అమ్మా! నాకును దెలియకున్నది. క్రొత్త పెండ్లికూఁతుల నెట్లు మచ్చిక చేసికోవలెనో చక్కఁగా నెఱిఁగినవాఁడు. సుందరుఁడు. నిపుణుఁడు. మధురభాషణుఁడు. అటువంటి మీయన్నగారినిఁ బెండ్లాడఁగలిగియు మా ప్రియసఖి దుఃఖించుచున్నది.

మద:—బుద్ధరక్షితా! చూచినావే! చూచినావే! యిది యెదురుకెదురు మనలనే యెత్తి పొడుచుచున్నది.

బుద్ధ:—ఇది యెత్తిపొడుపులాగున్నదే కాని యెత్తిపొడుపే కాదు.

మద:—ఎందుచేత?

బుద్ధ:—తన్ను బ్రతిమాలుచుఁ జెలిమిటి తనకాళ్ళమీఁదఁ బడినప్పు డతనిని గౌరవింపకపోవుట యనునది లజ్జాదోషముగాని మఱియొకటిగాదు. ఆవిషయమున దీని ననవలసినపనిలేదు. సరేకాని ప్రియసఖీ! కోతికిఁ గొబ్బరకాయ దొరికినట్లబ్బినదికదా! యని యెబ్బెటికములేకుండ దబ్బుదబ్బునఁ గ్రొత్తపెండ్లికూఁతురుమీఁద వెళ్ళిపడి, యది తన్నుఁ జేరనీక చెదరఁగొట్టఁగాఁ దెల్లఁబోయి తెలివితక్కువవాఁ డనిపించుకొని నీయన్నగారు దానిని మీఁదు మిక్కిలి నోట వచింపరాని దుర్భాషలాడువాఁడఁటమ్మా? ఇంతతప్పు మనయొద్దనుండఁగా నెత్తిపొడిచినదన్న నెత్తిపొడువదఁటమ్మా! "కుసుమసధర్మాణో హి యోషిత స్సుకుమారోపక్రమాస్తాస్త్వనధిగత విశ్వాసైః ప్రసభముపక్రమ్యమాణాస్సద్యస్సంప్రయోగ విద్వేషిణ్యోభవంతి" అని కామసూత్రకారులు చెప్పినట్లు క్రొత్తపెండ్లికూఁతులనఁగాఁ బుష్పములవంటివారు. వాండ్రను మృదువుదప్పకుండ సమీపింపఁదగ్గది. చనవుచిక్కించుకొనకయే బలాత్కారముగాఁ గవయఁజూతురేని అట్టివారియెడల వారికప్పుడే బలవత్తరమైన విద్వేషముకలుగును.

లవం:—[కన్నీళ్ళతో] లోకములోఁ బురుషులులేరా? కన్యకలను బెండ్లాడరా? యెక్కడనైనను నెవరైనను లజ్జయే యలంకారముగాఁ గలిగి యేపాపము నెఱుఁగని ముగ్ధరాండ్రైన కులకన్యకల నీప్రకారముగాఁ దగుదుమని నోట వచింపరాని దుర్భాషలాడి మనస్సు రగులఁజేసిరా? యీపాప మిక్కడనే పండిపోయినది. ఇటువంటి పరిభవములే కాదఁటమ్మా స్త్రీల మనస్సువిఱిచివేసి పండువంటి కాఁపురములు పాడుచేసి యామరణాంతము వారికి హృదయశల్యములై తీఱని దుఃఖము దెచ్చిపెట్టెడివి? అందుచేతనే యాఁడుపిల్లది పుట్టినదనఁగానే బంధువులందఱకు రోఁతగానుండును.

మద:—చెలీ! బుద్ధరక్షితా! మనప్రియసఖ లవంగికకు మనసు చాలనొచ్చినది. మాయన్నగారంత గొప్పయపరాధము చేసినాఁడా?

బుద్ధ:—చేయకేమి? మేమును విన్నాము. "ఛీ! చిన్నతనములోనే చెడిపోయిన యీ చెడిపెతో నాకేమి ప్రయోజనము? దీని మొగముఁజూచిన నాకుఁ బెద్దయొప్పు" అని యేమేమో సణిగి తిట్టుచుఁ దిమ్ముచుఁ బడకిల్లువిడిచి యవలికి లేచిపోయినాఁడు.

మద:—[చెవులుమూసికొని] అన్నా! యెంత పరువుతక్కువ మాటలు! ఎంత పొరఁబాటు! చెలీ! లవంగికా! యిప్పుడు నీ మొగముఁ జూచుటకు నాకుఁ జిన్నతనముగానున్నది. అయినను తగుదునమ్మా యని కొంచె మాలోచన చెప్పవచ్చినాను

లవం:—చెప్పవచ్చును. ఈజనము నీకు స్వాధీనమే.

మద:—మాయన్నగారి దుశ్శీలతయు నప్రతిష్ఠయు నీపాటికిఁ జాలునుగాని, పోనీ మీరైనను 'ఎటువంటివాఁడైననేమి? పెనిమిటి గదా!' యని యాతనిమనస్సునుబట్టి వెళ్ళఁదగినది. గొప్పయింటఁ బుట్టినవారినోట వెడలఁగూడనిమాట లతఁ డాడుటకుఁ గల మూలమేమో మీరు తెలియకున్నారు.

లవం:—లేనిమూలము మాకెట్లు తెలియును?

మద:—ఆ మహానుభావుఁడైన మాధవునియందు మాలతి కేదో కొంచెము వాత్సల్యముండెనేది. దానినే యిప్పుడు జనులు గుంపులుగూడి గొప్ప ప్రవాదముగాఁ జెప్పుకొనుచున్నారు. అందుచేతనే యిప్పుడింతమట్టుకు మునిఁగినది. కాఁబట్టి చెలీ! భర్తయెడల దీనిహృదయము కేవల ముపేక్షవహించినది. కూడదని చెప్పి మరలింపుము. మరలింపవేని నీ కందువలనఁ జాలఁ బాతిత్యమున్నదనుమీా. స్త్రీలు తిరుగును ద్రిప్పనులేని గుండెనిబ్బరము గలవారు. ఎటుఁగనేరరుగాని యిటువంటి మంకుపట్లుపట్టి పురుషులకు మనస్తాపము గలిగింతురు. సరే కాని మదయంతిక చెప్పినదని చెప్పకుమీా!

లవం:—ఓసి! యసంబద్ధలోకప్రవాదమోహితురాలా! పోవే! నీమాటలు నాకు గిట్టవు.

మద:—చెలీ! కోపపడకు నీవున్యామాయెను. మీారు చెప్పాట యైనదికదా. నామాట యొక్కింతుక విందురు. మీారిప్పుడును నెఱుఁగరు. మే మీావఱకే యెఱుఁగుదుము. ఎట్లైననేమి? మాలతి మాధవానురక్తురాలు. కానందువేని దాని యవయవములట్లు నవసి వసివాడి లేఁత మొగలిపొట్టవలెఁ దెలుపుమీాఱియుండుట కేమికారణము? స్వహస్తములతో మాధవుఁడు కూర్చియిచ్చిన వకుళమాలికను అది ప్రాణపదముగాఁ గంఠమందేల ధరింపవలెను? మాధవుని శరీరముకూడఁ జిక్కియుఁ జక్కనయి ప్రభాతచంద్రమండలమువలె వెలవెలఁ బాఱియుండుట కేమినిమిత్తము? మఱియు ఆనాఁడు మనమందఱము కుసుమాకరోద్యానము చేరువవీధి మొగములోఁ గూడుకొన్నప్పుడయ్యిరువురిచూపులు నెట్లు తారసిల్లెనో నేను కనిపెట్టలేదా? అట్టె హాయులుమీాఱ బయలుదేఱి యుప్పతిల్లిన కుతూహలంబుచేఁ జప్పున నుల్లములు ప్రేళ్ళుదాఁట నీటులుపచరించి సూటిగ నంచరించు చారుతార

కలం బ్రవేశించి యనంగాచార్యుండు శృంగార ప్రాచుర్యముగ నఖలాగమముల నవన్యసించుచుండ వారిచూపులు చూపిన నేరుపులు చూచి తీరవలెనేకాని దూరమునుండి తెలుపనలవియగునా? మఱియు నింకొకటి. మాయన్నగారికి మాలతినిచ్చినారన్న మాట వినఁగానే యప్పుడే యామట్టుగనే లోతులు పెల్లగిల్లి గుట్టలు బట్టబయలయి కత్తివేటువయిచిన నెత్తురులేక గుండెలు కూలబడి వారుండుట కేమి హేతువు? ఇంకొకటి చెప్పుమఱచినాను.

లవం:—చెలీ! యేమిటది?

మద:—మదయంతికను గాపాడిన యా మహానుభావుఁడు తెలివినొందినాఁడని ప్రియుఁడు చెప్పినందుకయి మాలతి కేమైన నీయవలసినదని భగవతి తనగమసుఁదనపుమాలలచే మాధవునిఁ బురికొల్పఁగాఁ నతఁడును మంచిదని మాలతిని గాఁగిలించుకొని దానికిఁ బారితోషికముగాఁ దన హృదయమును జీవితమును ఇచ్చివేసినాఁడు. అప్పుడు నీవేకాదఁటే లవంగికా! "మాప్రియసఖ కింతకంటెఁ గోరఁదగిన యనుగ్రహాములే"దని చెప్పితివి? జ్ఞాపకములేదఁటే?

లవం:—ఎవఁడుచెపుమా ఆమహానుభావుఁడు?

మద:— చెలీ! నాఁడు నే నా ఘోరరూపమైన క్రూరశార్దూలము బారింబడి దిక్కుమాలినదాననై విలపించుచుండఁగా నెక్కడనుండియో నిర్హేతుకబాంధవుఁడై సమయమునకువచ్చి తన దోర్దండభుజములతో నన్నుద్ధరించుకొని సకలభువనైకసారరమణీయమగు తనకాయమును నానిమిత్తము బలిపెట్టుటకు నొప్పుకొని నామువ్పు దప్పించినాఁడతఁడేకాఁడఁటమ్మా! అతఁడేకాఁడఁటమ్మా మెండుగ బలిసి కండపట్టి పిక్కటిల్లెడి వెడఁదఱొమ్మపై నొత్తుగఁ గ్రమ్మిన నెత్తురుగాయములు చూచువారికి మంకెన పూలదండవలెఁ దోఁచుచుండ, గండుమీఱి వజ్రనఖములగు వాఁడి నఖములతోఁ దన్నుఁ బిమగడఁచినట్లు పడమొ

త్తవచ్చిన దుష్ట శార్దూలమును నానిమిత్తము చంపిన కరుణా సముద్రుఁడా?

లవం:—ఔఁ; అతఁడా? మకరందుఁడు!

మద:—[ఆనందముతో] చెలీ! యేమన్నావు!

లవం:—చెలీ! మకరందుఁడని చెప్పుచున్నాను [చిఱునగవుతో మదయంతిక శరీరమును స్పృశించి]

ఉత్సాహ.

అగుదుమీవు చెప్పినట్టు ♦ లట్టివారమే, నిజం
బుగను వీధి మొగముఁ గనని ♦ ముద్దరాలవీవుగా!
నగము కథయుఁ గాకమును పె ♦ జల్లుమనుచునీయొడల్
గగురుపొడిచె నేమికతము! ♦ కడిమివూచినట్లుగన్. ౧

మద:—[సిగ్గుతో] చెలీ! యెందుకు నన్నుకసక్కెమాడెదవు? చెప్పెదను విను. ఆప్రకారముగా యముఁడుమ్రింగిన నాప్రాణమును బలాత్కారముగా మరలించుటకయి తనప్రాణము నడ్డువైచి పనివూని మహోపకారమొనర్చిన యీ మహానుభావునికథను వినఁగానే నామమును స్మరించుకొనఁగనే నాకెంతో సుఖముకలుగుచున్నది. బెబ్బులి గొట్టిన గట్టిదెబ్బలకు దేహము సొమ్మసిలి చెమ్మటలుగ్రమ్మఁగా, నల్లగలువలఁగేరు కన్నులనుమూసికొని, నేలఁ బొదుకొల్పిన చేతిఖడ్గము నూఁతచేసికొని ధైర్యమూని నిలువఁబడియుండ, మదయంతికనిమిత్తము మహార్ఘజీవితమును వెచ్చపెట్టిన మహాభాగుని నీవప్పుడు కన్నులారఁ జూచియుండలేదఁటే! [స్వేదాది వికారముల నభినయించుచున్నది.]

బుద్ధ:—[దానిశరీరము స్పృశించి] చెలీ! నీయొడలు బాగున్నదికాదే! మకరందునిఁ బొందుట కుబలాటపడుచున్నానని నీవుచెప్పనక్కఱలేకయే నీశరీరమే చెప్పుచున్నది.

మద:—[సిగ్గుతో] చెలీ! పోవే! నేను నా జతకత్తెయుఁ జెలికత్తెయునగు మాలతిని జూచి నేర్చుకొన్నాను.

లవం:—చెలీ! మదయంతికా! ఇక్కడకు నాకును దెలియఁదగ్గది తెలిసినది. చల్లకువచ్చి ముంతదాఁచిన కార్యములేదు. కాఁబట్టి కోపపడక గుట్టుచేసి నాఁమీఁదను వీరిమీఁదను బెట్టక యున్నది యున్నట్లు నీ వృత్తాంతమేమో చెప్పుము. సుఖముగాఁ గొంచెము ప్రొద్దుపుత్తము.

బుద్ధ:—చెలీ! లవంగిక చెప్పినది శోభనప్రవనము.

మద:—ప్రియసఖులడుగుచున్నప్పుడు చెప్పక తీఱునా?

లవం:—అటులయిన నీవు ప్రొద్దులెల్లు వెళ్ళఁబుచ్చుచున్నావో చెప్పుము.

మద:—చెలీ! వినుము. బుద్ధరక్షిత చెప్పినమాటల మొగ్గలమునుబట్టి నమ్మికపుట్ట మొట్టమొదటనే నాహృదయ మాతనిఁజూడవలెనని తహతహపడుచుండెను. తరువాత దైవయోగముచేఁ జిరకాలమున కాతనిఁ జూడఁగలిగి యప్పటినుండియు సహింప శక్యముగాని దుఃఖసంతాపముచే మనస్సు దహించుకొనిపోవ, మున్నెన్నఁడుఁ బడి యెఱుంగని మదనజ్వరంబు తలమొదలు కాలివఱకుంగల యవయవాంగములనెల్ల నలమి సెగపొగలెగయించి పీల్చి పిప్పిఁజేసి జీవితాశలు తగ్గించుచుండ, నా తెఱఁగుఁజూచి పరిజనులు బెంగఁగొని యంగలార్చుచుండ, అడియాసలఱుగులై తడవుగ సులభముగఁ బొందఁదగిన మరణసుఖమును బొందనీక యీ బుద్ధరక్షిత యాడు ప్రతికూలవచనములచే హృదయంబుచెదరి చీకాకుపడుచుండ నిట్లు మొండి బ్రతుకు బ్రతుకుచున్నాను. వెడఁగుకోరికల త్రిప్పులకులోనయి బ్రమసి వెఱ్ఱినై తలఁచిన తలఁపులందును గాంచిన కలలయందును ఆ నుందరాంగునే చూచుచుందును. అంతట నతఁడును నన్నుబట్టి యుద్భవించిన

యద్భుతాశ్చర్యములతోఁ, జెఱకుగ్లుగొనిన మనుజునివలెఁగయి పెక్కు తిరుగుడువడి కనుదెలివమ్మలు జేవుఱింపఁ దేఱి పాఱి యొక దిగఁ జూచుచుండును. పిమ్మటఁ బద్మకేసరంబులుమేసిగుబాళించు రాయంచ యెలుంగుతెఱంగున గురగురమని గొంతుక్రోవినుండి గంభీరముగ వెడలి తడఁబడు నడికారంబు తోరమై వీనుగ్రంతల జాను మీఱ "చెలీ! మదయంతికా!" యని నన్నుఁ బలుకరించును. అంతట నిక్కుంపువల్లభుండునుబలె నా చెంత జేరి యెద పైకిఁబొదలు పయ్యెద కొంగును దిట్టతనంబునఁబట్టి తిగిచి గుట్టుచెఱిచి అట్టువఱిచి గదిరిన భయంబున నాహృదయంబు దడదడమని కొట్టుకొనుచుండ నన్ను మఱియింత వెఱపించును. వెఱపించి యప్పుడే పైఁటకొంగుమీఁది తనచేయి చప్పునఁదీసివైచి యప్పటి నాసొంపు దిలకింపఁగోరి చూచుచుండును. అప్పుడు నే నగ్గలంబగు సిగ్గుపెంపున దిగ్గునఁ జన్నుమొగ్గలకుఁ బ్రౌఢ కమలనాళములంబోని బాహునాళములం జాటుచేసికొని యావలకుఁబోదమని లేవఁజూడ, నితంబబింబముల విజృంభణంబునకు నిలువలేక సడలిపడిన యొడ్డాణంబు నాతొడల కడ్డమయ్యెను. ఇట్లు సంకిలియయి యంకిలిసేసిన యవయవంబుల నడవడికి మిగుల విసుగు జెందినట్లు కసరుకొని మఱి వ్యసనపరంపరచే హృదయంబు విసిగి వేసారి కాయగాచినట్లు కఠినత్వము వహించితిని. కాని యప్పుడే చిత్తంబు మెత్తఁబడి నే నా రసికోత్తమునివంక వలపుదెలుపు నిద్దంపు నిడువాలుఁ జూపుల నేఁకటఁదీఱ జూచితిని. ఈసన్నయెఱిఁగి యా వన్నెకాఁడు నన్నుఁజూచి చిఱునవ్వునవ్వి యదిరిపాటునఁ దన బాహుదండములచేఁ గదలమెదలకుండ నన్నుఁబొదివి, బెబ్బులిగోటిదెబ్బల యాకారమచ్చు పడునట్లు మైచ్చుగులుకఁ బ్రియసఖులు లిఖించిన వికటపత్త్రవైఖరులచేఁ జెలువుమీఱు నాయెదురుఱొమ్మునదిమి కౌఁగిలించి, తొట్రుపాటుచే నే నిట్టట్టు గొట్టుకొన్నప్పుడు చెదరి వీడిన నా కేశపాశంబును జేతఁబట్టు

కొని తీటీకగ నాము ఖావయవంబుల సొరు దేటిచూచి నేరువుమెఱ యుఁ జెక్కిలి మొగదలను మెత్తమెత్తగ గుత్తంపుఁ జిగురుమోవి యొత్తియొత్తి ముద్దాడునప్పు డేమిచెప్పుదును ప్రియసఖి! నాశరీరంబు నకు వింతసోయగంబు ఘటిల్లె. ముప్పిరిగొన్న సాధ్వసానందములచే నా యవయవంబులు నావిగాకపోయెను. నాప్రాణంబు లెందుఁబోయెనో నే నెఱుఁగనైతిని. అప్పుడా దుండగీఁడు తన ధూర్తవ్యాపారమున కను గుణముగా నన్నే మేమో ప్రతిమాలుట మొదలు పెట్టినాఁడు. ఇట్లు చెలికత్తెలు చూచుచుండఁగా నన్నియు ననుభవించి యట్టి మేలుకను నప్పటికిఁ దిరిగి యెప్పటి పాడు ప్రపంచము సిద్ధమైనది.

లవం:—చెలీ! మదయంతికా! అంతయు బాగుగానే యున్నది కాని అప్పుడు బుద్ధరక్షిత నీ ప్రక్కనుప్పటిమీఁది మన్మథకేళిచిహ్న ములనుజూచి యొకసాగసుగాఁ బరిజనులకుఁ దెలియకుండఁ జఱునవ్వు నవ్వినది. చెప్పినావుకావు.

మద:—ఓసి పోవే యీలాంటి కోడిగములాడిక!

బుద్ధ:—ఓసీ! లవంగికా! మనసులో మగఁడుండఁగా మంచము మీఁద నేమియుండునే? [అనునయముగా] చెలీ! మదయంతికా! యిటు వంటివన్నియు మాలతి చెలికత్తెగనుక దీనికి బాగుగాఁ దెలియునే.

మద:—తప్పు! తప్పు! మాలతినిట్లుగ తాళిచేయకు.

బుద్ధ:—చెలీ! మదయంతికా! చెప్పదనంటేని విన్నొక్కటి యడుగుచున్నానే.

మద:—ఏమీ! యిప్పటికిఁగూడ నేను చెప్పనిదానసేనా? నాకు నీవును ప్రియసఖ లవంగికయు గుండెకాయగారఁటే?

బుద్ధ:—అటయినఁజెప్పుము. నీవు తిరిగి మకరందునిఁ జూడఁ గలిగినమొదల అప్పుడు నీవేమి చేయుదువే?

మద:—వాని యొక్క యవయవములమీఁదనే వ్రాలి తగులుకొని కదలిరాక నిలిచియుండు నా కన్నుదోయికిఁ దడవు పండుగు చేసికొనియెదను.

బుద్ధ:—అప్పు డతఁడుమన్మథ బలాత్కారముచేఁగందర్పజనని వగు నిన్నుఁ బురుషోత్తముఁడు రుక్మిణినివలెనే సందిట నెగనెత్తుకొని పోయి సహధర్మచారిణింగాఁ జేసికొన్న నీవేమి చేసెదవే?

మద.—[నిట్టూర్పువుచ్చి] ఏమిప్రయోజనము? నన్ను మొదట నుండియు నీవే యిట్లూఱడించుచున్నావు.

బుద్ధ:—చెలీ! చెప్పుము.

లవం:—చెలీ! చెప్పనక్కఱలేదు. గుండె దుడుకును సూచించు దీని నిట్టూర్పు చెప్పుచున్నది.

మక:—చెలీ! నేనెవతెను? ఈశరీర మెవరిది? అతఁ డెప్పుడు నన్ను మృత్యువునోట నుండి వెలికిఁ దీసినాఁడో యప్పుడే యతని సొత్తైతిని.

లవం:—చెలీ! నీయౌదార్యమునకుఁ దగినట్లు పలికితివి.

బుద్ధ:—చెలీ! యిది మఱచిపోయెదవుసుమీ!

మద:—అదిగో రాత్రి రెండుయామములయినవని సూచించుటకయి తప్పెట వాయించుచున్నారు. ఇప్పుడు వెళ్లి నందనుని మంగళించియో కాలుసేతులుపట్టి బ్రతిమాలియో మాలతిమీఁద నాతనికి మక్కువపుట్టించెదను. [అని లేవఁబోవుచున్నది.]

మక:—[ మొగముమీఁది ముసుఁగుదీసికొని దానిని చేతితోఁ బట్టుకొనుచున్నాఁడు.]

మద:—చెలీ! మాలతీ! మేలుకొన్నావా? [చూచి సంతోషముతోను భయముతోను] ఓహో! వేఱువిధముగానున్నదే! ఏమి యిది?

మక:—

చ. వనజదళాయతాక్షి! యిటు ♦ వట్టిభయంబు నబొంద నేల? నీ
చనుఁగవతో ద్రుపాటునకు ♦ నైకవుఁగానసియాడుచుండెఁగా;
నను భవదీయదాసునిము ♦ నంబునన్నుఁగనెంచనేల? నీ
యనినవిభావనారతము ♦ లందుబహూకృతుఁడైనవానినిన్?

బుద్ధ:—[మదయంతిక మొగమెత్తి]

ఉ. *పెల్లుగఁగోర్కెలెవ్వనికిఁ ♦ బెంచితో యాప్రియుఁడీతఁడేనుమీ,
యెల్లరునింటనిద్రగొని ♦ యేమఱుపాటునను న్నవారు, అం
పిల్లెనిరుల్, కృతజ్ఞవయి ♦ మేలొడఁగూర్పఁగరమ్ముపోదమో
పల్లవపాణి! యందియలు ♦ పైకిచప్పుడు సేయకుండఁగన్. 3.

మద:—చెలీ! బుద్ధరక్షితా! యెక్కడకు మనమిప్పుడు పోఁదగి
నది?

బుద్ధ:—మాలతియున్నకడకు.

మద:—మాలతి యంత సాహసము చేసినదా?

బుద్ధ:—చేయకేమి! నీవిట్లనుచున్నావేమి? "నేనెవ్వతెను? ఈశ
రీరమెవ్వరిది?" అవియన్నియు వెళ్ళిపోయినవా?

మద:—[కన్నీరు రాల్చుచున్నది]

బుద్ధ:—మహాభాగ! ఇదిగో మా ప్రియసఖి తనకుఁదానుగా నే
మీ యధీనమగుచున్నది. స్వీకరింపుము.

* ఆ. వె. "నిద్రియుండితండు ♦ నిద్రాణముగృహంబు,
తమముగాఢతమము ♦ దగఁగృతజ,
కయిశుభంబునదపు ♦ మందియల్ పయికెత్తి
మొరయకుండిరమ్ము ♦ పోదమిపుడు." —పాఠాంతరము.

మక:—

తే. గీ. ధన్యుఁడను నేఁడు; నాకేల ♦ యన్యమొకటి?
జవ్వనముపండెఁబండువు ♦ నివ్వటిల్లెఁ
గామదేవుఁడునా మీఁదఁ ♦ గరుణఁజేసి
బంధుకృత్యంబు నెరవేర్చు ♦ వాఁడుగాఁగ. ౪.

కాఁబట్టి యీ ప్రక్క గుమ్మమునఁ బోదము. [మెల్లగా నడచుచున్నారు.]

మక:—ఓహో! యీ యర్ధరాత్రివేళ జనసంచారములేక యీ రాజమార్గ మెంతి రమణీయముగ నున్నది! ఇప్పుడు

మ. వలభీతుంగగవాక్షమార్గములచేఁ ♦ బ్రాసాదముల్ సొచ్చియి
మ్ములనందుండినురాపరీమళములం ♦ బూదండనెత్తావులన్
బలితంపుంగపురంపుఁగమ్మవలపుం ♦ బ్రాపించినీ తెంచుశీ
తలవాతంబెటిఁగించెడున్ యువజనో ♦ ద్యత్కేళిదాంపత్యముల్. ౫.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

సప్తమాంకము—సంపూర్ణము.

# మాలతీమాధవము

## అష్టమాంకము

ప్రథమరంగము — కామందకీ గృహము.

[తరువాత అవలోకిత ప్రవేశించుచున్నది.]

అవ:— నందన మంత్రిమందిరమునుండి ప్రతినివృత్తురాలైన కామందకీ దేవికిఁ బాదాభివందన మాచరించితిని గదా. కాఁబట్టి యిప్పుడు మాలతీమాధవు లున్న యెడకుం బోయెదను. [ఇటునటు నడచి] వీరిగో! మాలతీమాధవులు, హాయిగా నిగ్రీష్మఋతువులో సంజవేళ జలకమాడి యీ దిగ్గియదగ్గఱ నరుగుమీఁదఁ గూరుచున్నారు. చేరఁబోయెదను. [అని నిష్క్రమించుచున్నది]

ఇది ప్రవేశకము.

ద్వితీయరంగము — తోఁట.

[తరువాత మలతీమాధవులు ప్రవేశించుచున్నారు.

అవలోకితయుఁ గూర్చున్నది.]

మాధ:— [ఆనందముతో] మన్మథునికిఁ బ్రాణమిత్రమగు నిశీథముయొక్క యౌవనలక్ష్మి వర్థిల్లుచున్నది. అట్లేకదా!

తే. గీ. వాయువేగంబుచే రేఁగి ♦ పఱచి మింటఁ
గ్రమ్ము కమ్మగేదఁగిదుమా ♦ రమ్మనంగఁ
బూపవెన్నెల యొండిన ♦ ముదురుతాళి
దళము తెలివూని చీల్చెడు ♦ ధ్వాంతమెల్ల. ౧.

[తనలో] వామశీలురాలైన యీమాలతిని నేనెట్లు లోఁబఱచు కొందును? కానీ యిట్లు పలికెదను. [ప్రకాశముగా] చెలీ! మాలతీ! ఇప్పుడే సాయంతనస్నానము చేసి చల్లఁగఁ గూరుచుంటివి గనుక నీకిప్పుడు తాపశాంతియయ్యెడి సదుపాయమొకటి మనవి చేసికొనుచున్నాను. ఇది యేమోయని మఱియొకలాగునఁ దలఁచెదవుసుమీ

ఆ, వె. జాఱుచుండఁ గురుల ♦ జలబిందువుల్, కుచ
యుగము నడుమఁ జలువ ♦ లూరుచుండ,
మొలక లెత్తి మేనఁ ♦ బులక లొప్పుచునుండఁ
గరుణఁజూచి నన్నుఁ ♦ గౌఁగిలింపు ౨.

ఓసీ! మాలతీ! జాలిలేనిదానా!

ఉ. ముప్పిరిగొన్న భీతిమెయిఁ ♦ బుట్టిన చెమ్మటబొట్లు గమ్మఁగా
నొప్పగు నీదుబాహుయుగ ♦ మొయ్యన నామెడఁ జుట్టఁబెట్టి,నన్
దెప్పిరిలంగఁ జేయఁగఁ గ ♦ దే! చెలి! రేచెలి వెల్గుసోఁకులం
జప్పున జాలువాఱు నల ♦ చంద్రమణి స్ఫుటహారవైఖరిన్. ౩.

పోనీ యిప్పుడంతదూరమెందుకు? ఈజనుఁడు నీయాలాపసౌఖ్యము ననుభవించుటకును అర్హుఁడు గాకపోయెనా?

చ. మలయసమీర చంద్రికల ♦ మాఁడిన పోఁడిమిఁ జూపు మేనికిం
జెలి! నినుఁ గౌఁగిలించుకొని ♦ చెందుసుఖంబది లేన లేదుగా
గొలగొల గండుఁగోయిలలు ♦ కూయఁగఁ జీఁదఱఁగొన్న నాదువీ
నులఁగలకంఠి! పల్కుమన ♦ నూల్కొనఁజేయవెముద్దుగుల్కఁగన్.

అవ:—ఓసి మనసునిబ్బరము లేనిదానా! యింతకుముందే కాదఁటే మాధవుఁడు క్షణము కనిపింపక పోఁగా విలవిలలాడి నీవు నాతో "ఆర్యపుత్త్రుఁడువెళ్లి చాలఁ దడవయినది. ఎందనేవటికి వచ్చునోకదా! ఎప్పుడు చూతునోకదా! యీసారి వానివంక జంకుకొంకు

లేక తెప్పవేయక చూచి యిట్లుపలికెదను. రెండుచేతులతోఁ బొదివి బిగికౌఁగిలిచ్చి గౌరవించెదను." అని చెప్పితివి. ఆమాట లెందు బోయినవే?

మాల:—[అసూయపడినట్లు దానిం జూచుచున్నది.]

మాధ:—[పెడమొగముగా] ఓహో! భగవతి ప్రథమశిష్యు రాలు సామాన్యురాలుకాదు! ఈమెపాండిత్యము సర్వతోముఖముగా బ్రవహించుచున్నది. ఈమెచూడఁగా అతిశయమైన సుభాషిత రత్న కోశముపలెనున్నది. [ప్రకాశముగా] చెలీ! అవలోకిత చెప్పినది నిజమా లేక కల్పించినదా?

మాల:—[తల త్రిప్పుచున్నది.]

మాధ:—చెప్పవేని లవంగికావలోకితల తోడేసరి!

మాల:—నాకేమియు ...... [అని సగము చెప్పి సిగ్గు నభి నయించుచున్నది.]

మాధ:—ఓహో! ముగింపఁబడకపోయినను మెల్లగా నీమెపలు కెంతమనోహరముగా నున్నది! [చటుకునఁ గనిపెట్టి] అవలోకితా! ఇదియేమి?

చ. పుడిసిటఁ బట్టి కాంత్యమృత • పూరముఁ గ్రోలఁగఁగోరియోయనన్
విడివడి యొందుఁ జంద్రుఁడా ని • వేశితరశ్మి మృణాళదండుఁడై
యుడరుచు నున్నవాఁ డల మృ • గాక్షి నిగారపుఁజెక్కుటద్దముం
దడిపెడు నింతలోపలనె • తద్దయుఁ గాఱెడి బాష్పపూరముల్. ౫౧

అవ:—చెలీ! యొందుకే యిప్పుడు వలవల కన్నీరు వడు చున్నావు?

మాల:—చెలీ! లవంగిక నన్ను విడిచిపెట్టి వెళ్ళి యెంతసేపో యైనది. దానిజాడయైనను దెలియరాకున్నది.

మాధ:—అవలోకితా! యేమనుచున్నది!

అవ:—ఏమియు లేదు. మీరిప్పుడు మాటధోరణిని లవంగిక పేరు చెప్పఁగా దానిం దలఁచుకొని సమాచారము తెలియక పరితపించుచున్నది.

మాధ:—"నీవు ప్రచ్ఛన్నముగా నందనమంత్రి యింటికిం జని యక్కడి వృత్తాంతమరసిర"మ్మని యిప్పుడేకదా కలహంసునిఁ బంపితిని. [సాకూతముగా] అవలోకితా! మదయంతికవిషయమున బుద్ధ రక్షితచేయు ప్రయత్న మేమయినఁ గొనసాగునట్లున్నదా?

అవ:—మహాభాగ! నాఁడు బెబ్బులి గొట్టిన గట్టిదెబ్బలకు సొమ్మసిలి తూలిపోయిన మకరందుఁడు తిరిగి తేఱుకొన్నాఁడని నీకు మాలతి ప్రియము చెప్పినందుకు దానికేమైన నీయవలసినదని భగవతి యాజ్ఞాపింపఁగా అప్పుడు దానికి నీహృదయమును జీవితమును పారి తోషిక మిచ్చితివిగదా? యిప్పుడు మదయంతికాలాభమును జెప్పిన వారి కేమిబహుమాన మిచ్చెదవో చెప్పుము.

మాధ:—అడుగఁదగినదే యడిగితివి. [హృదయమును జూచుకొని] ఇదిగో కామకాననమున కలంకారశోభఁగూర్చిన పొగడచెట్టొసంగిన పూలదండ. ఇదియే కదా నేను సాభిలాషముగా మాలతీ ప్రథమదర్శనము చేసినందుకు సాక్షిణి. దీనిని

మ. చెలి నే గ్రుచ్చినదౌటనో సకియచేఁ • జేకొన్నదై యుంటనో
బలుప్రేమం గుచకుంభకుట్మలభర • వ్యాసక్తముంజేసి, యా
వలఁ బాణిగ్రహమం చొకండు గసపిం • పన్ డించి నామీఁదియా
వలు, ధాత్రేయిగనెంచి,నాకియొసఁగెఁ • సర్వస్వదాయంబుగన్.

అవ:—చెలీ! మాలతీ! నీ కీవకుళమాలికమీఁద నెంతో ప్రీతి గదా! అందుచేత నే యింతి మనసుపడి చూచుచున్నావు. మఱియెవ్వరికిని జిక్కకుండ నీవే దక్కించుకొనుము.

మాల:—ప్రియసఖి ప్రియము నా జెప్పుచున్నది.

అవ:—ఏదో కాలిచప్పుడువలె నున్నది.

మాధ:—[తెరవంకఁజూచి] వాఁడిగో! కలహంసుఁడు!

మాల:—[డాయవచ్చి] నాథా! అదృష్టవంతులరు! మదయంతిక లభించినది.

మాధ:—[సంతోషముతో మాలతిని గాఁగిలించుకొని] ఇది మాకు సంతోషము. [అని కంఠమందు వకుళమాలిక నుంచుచున్నాఁడు.]

అవ:—భగవతి పై వేసికొన్న కార్యభారము బుద్ధరక్షిత చక్కగానే నిర్వహించినది.

మాల:—[సంతోషముతో] ఇదిగో ప్రియసఖి లవంగికకూడ వచ్చుచున్నది. [అని లేచుచున్నది.]

[తరువాతఁ దత్తఱపాటుతోఁ గలహంసుఁడును, బుద్ధరక్షితా లవంగికా మదయంతికలును బ్రవేశించుచున్నారు.]

అందఱు:—మహాభాగ! రక్షింపుము! రక్షింపుము. మార్గమధ్యమందు మకరందుని నగరరక్షకు లడ్డగించినారు. సమయమునకుఁ గలహంసుఁ డక్కడ నుండఁగా వీనినిచ్చి మమ్మిక్కడకుఁ బంపినాఁడు.

కల:—మే మిటు వచ్చుచుండఁగా మాకుఁ గలకలము వినఁబడ్డది. అందుచేతఁ బౌరక్య బల మింకొకటికూడఁ బోరవచ్చిన దని యూహించుచున్నాను.

మాల:—అవ:—ఛీ! ఇప్పుడే సంతోషమును ఇప్పుడే విచారమునా?

మాధ:—సఖీ! మదయంతికా! నీరాక మాకు సంతోషకరముగా నున్నది. మాగృహము నలంకరించితివి. మీరందఱు స్వస్థము

గా నుండును. ఒక్కఁడైన నేమి? పెక్కుండ్రు చుట్టిన నేమి? వయస్యునకు వచ్చినచిక్కేమియు లేదు.

చ. కడిఁదిమగంటిమి న్నెఱపఁ ♦ గల్గుటె వేడ్కఁగఁ బొంగుసింగమే
యెడలను దోడు వేఁడెమన ♦ యొక్కటిఁ బోరుచు, గండపాళిపై
బడిగొను నాముమైఁ బొనలు ♦ సామజనాథు శిరస్థిరాస్థులం
బొడిపొడి సేయు మోపయిన ♦ భూరిరణాన్నఖహస్త మొప్పఁగన్.

కాఁబట్టి విక్రమపూతుఁడై విలసిల్లుచున్న ప్రియమిత్రునికిఁ దరువాతి వాఁడ నయ్యెదను [వికటముగా నడచి కలహంసునితోఁ గూడి నిష్క్రమించుచున్నాఁడు.]

అవలోకితాదులు:—మహానుభావు లిరువురును ఎదురులేని భుజబలములతో నిప్పుడే తిరిగి రాఁగలరు.

మాల:—చెలీ! బుద్ధరక్షితా! సఖీ! అవలోకితా! మీరు చప్పునఁ బోయి భగవతి కీవృత్తాంతమును నివేదింపుఁడు. చెలీ! లవంగికా నీవును వెళ్ళి యార్యపుత్రునితో "మీరు మమ్ము దయఁజూచువారై తిరా జాగరూకులరై మఱి పౌరుషములు చూపుఁడు" అని విన్నవింపుము. [మాలతీమదయంతికలు తక్కఁ దక్కినవా రందఱు నట్లే యని నిష్క్రమించుచున్నారు.]

మాల:—హా! నాకిప్పుడు ప్రొద్దెట్లు జరగునో తెలియకున్నది. కానీ ప్రియసఖి లవంగిక తిరిగివచ్చెడివఱకు దానిపోయిన త్రోవవంక నే చూచుచుండెదను. [ఇటునటు నడచి శంకతో] నా కేదియో చెడుగు సూచించుచుఁ గుడికన్ను నదరుచున్నది. [కూర్చుండి చూచి భయముతో] ఆర్యపుత్రా! [అని మాటాడలేమి నభినయించుచున్నది.]

[తరువాతఁ గపాలకుండల ప్రవేశించుచున్నది.]

కపాల:—ఆఁ; పాపాత్మురాలా! కూర్చుండుము. కూర్చుండుము. [వెఱపించుచు క్రోధహాసములతో] ఏడువు మేడువుము.

తే. గీ. ఏడ నున్నాఁడె యోసి! నీ యిష్టుఁడిపుడు?
కన్నెవడుచుల మఱగిన ♦ కాముకుండు
బ్రహ్మనిష్ఠులఁ గెడపిన పాపకర్ముఁ
డేడ నున్నాఁడె పతి యగు ♦ నేని వేగ
వచ్చి కాపాడుకొనఁగాక ♦ వనితె! నిన్ను
నెఱిఁగుకో కాక యిపుడేవ ♦ దొరకఁబట్టి
డేగపాటునఁ గలఁగుటి ♦ ట్టిభిని బోలె
క్రిందిగవైచితి నింకేమి ♦ యిడిక దీవు. ౮

దీని నిప్పుడు శ్రీశైలమునకుఁ గొనిపోయి శరీరమును నువ్వుగింజలంత ముక్కలుగాఁ గోసివేసి కుళ్లి చచ్చునట్లు చేసెదను. [మాలతిని దీసికొని నిష్క్రమించుచున్నది.]

మద:—నేను మాలతివెనుకనే పోయెదను. [ఇటునటు నడచి] చెలీ! మాలతీ!

లవం:—[ప్రవేశించి] చెలీ! మదయంతికా! నేను లవంగికనే.

మద:—చెలీ! మహానుభావునిఁ జూచితివే?

లవం:—లేదు. అసఁడీ తోఁటప్రాలిమేర దాఁటఁగానే కలకల ధ్వని విని శౌర్యమువచ్చి వైరివీరుల లెక్కగొననట్లు తొడలు చఱచుకొనుచుఁ జెంగునఁ బరువువాఱి యొక్క నిమిషములో శత్రుసేనలో వెళ్ళి పడెను. అంతట మందభాగ్యురాలనగు నేను “హా! మాధవ! హా! మహాభాగ! హా! మకరంద! హా! సాహసిక!” యని గుణానురాగులై యింటింటను పౌరజనులుచేసెడి విలాపముల నాలకించుచు వెనుక మరలితిని. మహారాజును వధూవరుల విప్రలంభవృత్తాంతమును విని యాగ్రహగ్రస్తుఁడై తక్షణమే తన కాల్బలము నంతయు యుద్ధరంగము

నకుఁ బంపి మేడ మీఁదియంత్రస్తుపై వెన్నెలబైటను గూరుచుండి చూచుచున్నాఁడఁట.

మద — అయ్యో! మందభాగ్యురాలను! చచ్చితిఁగదే!

లవం:— చెలీ! మఱి మాలతి యెక్కడనున్నది?

మద:— అది నీవుపోయిన తెరువువంకఁ జూచుట కప్పుడే బయలు దేఱినది. ఆవెనుక నేను దానిం జూడలేను. ఉద్యానగహనము లోనికిఁ బోయియుండ వచ్చును.

లవం— [తొందరతో నిటునటు దిరుగుచు] చెలీ! జాగు సేయక వెదకుదము. నా ప్రియసఖి వట్టి పిఱికిగుండె. ఇటువంటి సమయములో వనవిహారమునకుఁ బోవునని నేననుకొనను చెలీ! మాలతీ! చెలీ! మాలతీ! యెందున్నావు? [అని యిటునటు దిరుగుచున్నారు.]

కల:— [సంతోషముతోఁ బ్రవేశించి] అమ్మయ్యా! దేవుని పుణ్యమాయని దెబ్బలులేకుండఁ దప్పించుకొని బైటఁబడినాను. ఏమి శత్రుసైన్యము! ఎంత భయంకరము! ఇప్పటికిని నా మొగమున వ్రేలు చున్నట్లే యున్నది. ఎడతెఱపి లేక నెఱపోటుబాట్లు జరీనఁ దూసి ఝుళి పించిన విచ్చుకత్తుల వాతులు ధళధళమను పండువెన్నెలం దళతళమని మెఱసి యెంత భయంకరముగ నుండెను! చెడఁద్రాగి మత్తుగొని సత్తువ కొలఁది నున్నత్తుగఁ బట్టిగ్రోయు బలరాముని చేతి మేటినాఁగేటిత్రోవు నకుఁ దెరలి తిరుగుమడి కొట్టుకొని బొబ్బరించు యమునానదీ ప్రవాహమువలె సేమి రణగుణధ్వని! మకరందుఁడు మాఱులేక మలసి చెం గునఁ గుప్పించి కుడియెడమలులేని చెలఁగాటగా సేనలనెల్లఁ జీకాకు పఱు పఁగా నప్పుడు వాండ్రు పట్టుఁడు! కొట్టుఁడు! నఱుకుఁడు! పొడువుఁడు! అని బొబ్బరించుచుఁ జేసిన కోలాహలము దిక్కులఁ బిక్కటిల్లిపోయి నది. మఱి మా యజమానుఁడు మాధవుఁడుగారి పరాక్రమమో! వజ్రపంజరమువలె దారుణమైన భుజయుగళము సవ్వళించుకొనుచు, బెట్టిదుండయి పయిఁబడి కొట్టు తనదెబ్బలకు నోడలు తూంట్లువడి బొబ్బ

లిమచు నేలవ్రాలై రిపువీరుల చేతుల కత్తికటారులు వెఱపురేక పెఱికి పుచ్చుకొని విచ్చలవిడి కాలరుల నఱికి నురుమాడి తఱిమివైచి యిట్లు పలుతెఱంగుల విక్రమించిమించికీర్తిరతన కార్రి నిర్మథనవిషమసాహసుండయి స్వైరముగ విహరించినాఁడు. ఓహో! ఆమహారాజుగారి గుణానురాగ మేమని చెప్పవచ్చును? సౌధశిఖరము మీఁదఁ గూర్చుండి చూచుచుఁ బ్రతిహారులు మనవిచేసికొన్న వినయవాక్యములచేఁ గ్రోధము శాంతినొందఁగా బ్రసన్నముఖుఁడయి, యప్పుడే మాధవునిం బిలిపించి మాలతిని ముఖారవిందముఁ జూచి, సందడిసేయకుఁడని తన చుట్టునున్నవారిని సారెసారెకు వారించుచు, నాతని యూరును పేరును నడిఁగి తెలిసికొని, యుద్ధ మాతీరుగఁ బరిసమాప్తి నొందినందు కిష్టపడ నట్లు కోపదృష్టితోఁ గొఱకొఱలాడుచున్న భూరివసునందనులవంకఁ బ్రసాదమేదురముగాఁ జూపు నిగిడించి మధురగంభీరభాషణములతో “మీరిప్పు డేమనుచు విచారించెదరు? త్రిభువనాలంకారులును నవయౌవన గుణాభిరాములును మహానుభావులును నగు నిటువంటి యల్లురను బడయఁగంటిమి యానందమును బొందుఁడు.” అని చెప్పి రాజుగారు లోనికిఁ బోయినారు. వీరుగో! మాధవమకరందులు వచ్చుచున్నారు. నేనుబోయి భగవతికీవృత్తాంతమును నుపదేశించెదను. [అని నిష్క్రమించుచున్నాఁడు.]

లవం:—చెలీ! మదయంతికా! ఇది నీకు సంతోషకరమైన వార్త. మాలతికిని అటువంటిదే. రమ్ము. దానిని వెదకుదము. [అని నిష్క్రమించుచున్నారు.]

[తరువాత మాధవమకరందులు ప్రవేశించుచున్నారు]

మాధ:—ఓహో! చెలికానియొక్క ప్రబలమైన సహజవిక్రమ మనన్యసామాన్యముగదా!

ఉ. చేతులఁ బట్టి కొట్టి పొడి ♦ సేయఁగఁ గూలెడి యొంపగూండ్లుగా
వేతున మాడి ముంచుటివు ♦ వీరుల, వెన్కఁ దదాయుధంబులన్
ఖ్యాతినటించు నీదు సమ ♦ దగ్రలలద్ఘసరుండఖండచం
డాతతభండనాంబుధికి ♦ నావల నీవల గాతిగట్లునాఁ
జేఁగలు దక్కి నిల్చి రెడ ♦ సేయక శత్రుపదాతివర్గముల్. ౯.

వయస్యా! ఇది తలఁచుకొనఁగానే పశ్చాత్తాపము కలుగుచున్నది సుమీ! చూడు.

మ. పొలఁతుల్ పుక్కిటఁగ్రోలి శేషము లిడం ♦ బొందానిశీథోత్సవం
బులయం దిందుమయూఖఖండనిచితం ♦ పున్సీధువుం గ్రోలి వా
రల కౌఁగిళ్ళ సుఖంచుచిప్పుడెయుడ ♦ గ్రత్వద్భుజాఘాతని
ర్దళితాంగాస్థికులౌచు దూఱెద రసా ♦ రంబంచు సంసారముల్. ౧౦.

ఈ మహారాజు సౌజన్యము మఱవఁదగ్గది కాదు సుమీ! మనము సాపరాధుల మయ్యును నిరపరాధులనువలెనే యాదరించి మనమీఁద నెంతో ప్రీతిఁ గనఁబఱచినాఁడు. కాఁబట్టి యిప్పుడు మాలతీసమక్షమందు మదయంతికాహరణ వృత్తాంత మంతయుఁ జెప్పుకొని సంతసింతము. [ముందువైపుచూచి] ఏమిది? యిక్కడ నెవ్వరు లేనట్లున్నది?

మక:—మఱేమి లేదు. మనము యుద్ధమునకుఁ బోతిమని కళవళపడి యేమియుఁ దోఁచక వారిందఱుఁ దిరుగాడుచు నీతోఁటలోనే యొక్కడనో ప్రొద్దు పుచ్చుచుందురు.

మాధ:—

చ. పెనఁకువసుద్దు లీవు విని ♦ పింపఁగఁ జిర్ణగవ్రాను మాలతీ
కనకనిభాంగి దన్నుఁ గడ ♦ గంట నదల్చి కనన్ జుగుప్సనొం
దిన దయి విప్పుకన్బొమల ♦ త్రిప్పుల నొప్పెడి యాననాంబుజం
బును జెలి వంచుకోఁ గలుగుఁ ♦ బో! సఖ! చూపు చలింపకుండఁగన్.

ఇదే యుద్యాన ప్రదేశము. [ప్రవేశము నభినయించుచున్నారు]

లవం:_మద:—చెలీ! మాలతీ! [చప్పునఁ జూచి సంతోషముతో] వీరుగో మహానుభావులు పూర్ణమనోరథులై వచ్చినారు.

మాధ:_మక:—చెలులారా! మాలతి యెక్కడ నున్నది?

లవం:_మద:—మీ కాలిచప్పుడు విని మాలతి యనుకొని యీ మందభాగినులు వంచింపఁ బడినారు.

మాధ:—అయ్యో! మీ రిరువురు నా హృదయమును వేయి వ్రక్కలు చేయుచున్నారు. అదియేమో స్పష్టముగాఁ జెప్పఁగదరే!

తే. గీ. చెలియ కెవ్వ దేమియొగ్గు వా ♦ టిలునో యనుచు
నడలుచుండుదు నెపుడు నా ♦ యంతరాత్మ
నయ్యయో యిప్డు డెడము క ♦ న్నదరఁ జొచ్చెఁ
బయిగ మీ పల్కు విని యింక ♦ బ్రతుకఁ గలనె? ౧౨.

మద:—అప్పుడు మీ రిల్లు బయిలుదేఱి వెళ్ళఁగానే మాలతి యవలోకితాబుద్ధరక్షితలను భగవతియొద్దకుఁ బంపి "అప్రమత్తులరై యుండఁ గోరుచున్నానని యార్యపుత్త్రునితో మనవిచేయవే" యని మీ కడకు లవంగికను బంపినది. పిమ్మట నేమియుఁదోఁచక, లవంగిం పోయిన తెరువువంకఁ జూచుటకు వెడలినది. అటుపయిని నేను దానిం జూడలేదు. అంతట మేమిరువురము నిందలి చెట్లతోఁపు లన్నియుఁ గలయ వెదకితిమి. అయితే, మీకును గనఁబడలేదు?

మాధ:—హా! ప్రియురాలా! మాలతీ!

ఉ. ఏదో యమంగళంబు ఘటి ♦ యిల్లెఁగదే! చెలి! కోడిగాల కిం
దాదరువైన వేళయఁటె? ♦ యాదట దర్శన మీయరాదఁటే?
వాదఁటె? లేదఁటే దయ ల ♦ వంబును? బల్కక టాడరాదఁటే?
వేదనపాలు సేయుదఁటె? ♦ వెన్కటి కోధన గూడిరాదఁటే? ౧౩.

మద:_లవం:—హా! ప్రియసఖీ! యెందుఁ బోతివే?

మక:—చెలికాఁడా? ఏమి యిట్లు వెఱ్ఱిపడి విలపిల లాడెదవు?

మాధ:—వయస్యా! మాధవునితోఁ జెలిమి చేసి యది పడ్డ బాధలను అన్నియు సరిచేసికొని యది పడఁదగిన సడవడియు నప్పుడే మఱచితివా?

మక:—ఇది యొక్కటి యున్నది మఱి. భగవతిపాదపీఠమును దర్శింప వెడలినదేమో! కనుక రమ్ము అక్కడకే పోదము.

మద:—లవం:—అవును. ఇదియును సంభావ్యమే.

మాధ:—సరే. అట్లే కానిండు. [అని నడచుచున్నాఁడు.]

మక:—[తనలో]

మ. చెలి కాఁపుందకయింటికై వెడలుటే ♦ సిద్ధంబుగాఁ దోఁచెడుం;
చెలియున్ రా దటుపైని ప్రాణములతో ♦ దేవీగృహంబుం గనన్
గనదో లేదో నిజంబు; ప్రాయికముగన్ ♦ సౌదామినీస్ఫూర్తిచం
చలమౌఁ గాదె సుహృత్ప్రియాప్తజనతా ♦ సంగాదిసౌఖ్యంబిలన్.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

అష్టమాంకము—సంపూర్ణము.

# మాలతీమాధవము

## నవమాంకము.

రంగము: బృహద్ద్రోణీపర్వతారణ్యము.

[తరువాత సౌదామిని ప్రవేశించుచున్నది.]

సౌదా:—నేను కామందకీ శిష్యురాలనగు సౌదామినినిగదా! కనుక నే యామెకుఁ బ్రేమభూమియగు మాధవుని నన్వేషించుటకై యిప్పుడు పూజ్యమైన శ్రీశైలమునుండి యీపద్మావతికి వచ్చితిని. ఇక్కడ, మాధవుఁడు మాలతి నెడఁబాసినవాఁడై పరిచితప్రదేశములం దిరుగ నోడి యిల్లువిడిచి సుహృద్గర్వముతోఁ గూడి బృహద్ద్రోణీపర్వతారణ్యమందుఁ బ్రవేశించినాఁడఁట. నేనును అక్కడకే పోయెదను. ఆహా! నే నిప్పుడాకాశమార్గమున నెగిరి వచ్చుచుండఁగాఁ గుప్పవోసినట్లు కొండలు కోన లేళ్ళు కోళ్ళు పల్లెలు పట్టణములు కన్నులఁ గప్పివేసినవి. [వెనుకవైపుచూచి] ఆహా!

శా. మేడల్ మిద్దెలు గుళ్లు గోపురములున్ ♦ మిన్నెత్తునై నిక్కురా
పాడౌ బీఁటలువాఱి కూలి పడిన ♦ ప్లాయుభమే పారెమున్
జోడై నీటగు తేటనీటిపసమైఁ ♦ జూపట్టి పద్మావతీ
కూడంబాటెసి సింధుపాలర పయిం ♦ దోతెంచి బింబక్రియన్. ౧

మఱియు,

మత్తకోకిల. చూఁడియూవులు లేఁతపచ్చి ♦ జొంపముల్ దరిదాపు లో
బీకులం దరుగాడి తొల్కరి ♦ వేళ నాదట మేయుఁగా
వేమకల్గని కాపు లెల్లరుఁ ♦ బేర్మిదేని నుతింతురో
చూడనౌ లవణానదీమణి ♦ చుట్టివచ్చు కరుళ్ళతో. ౨

[మఱియొకవైపు చూచి] అదిగో! భగవతి సింధునది. పర్వతశిఖరము నుండి క్రింది భూమియందరి బ్రద్దలగునట్లు ధారాపాతముగాఁ బడు చున్నది.

ఉ. ఈరొదపేర్మి యాఁరవుర! ♦ యేమనవచ్చు? నవాంబుగర్భగం
భీరఘనాఘనస్తనిత ♦ భీమగమై, సవిధావనీధరో
దారలతావితానముల ♦ యందు నమందగతిం జెలంగుచుర్
వారణవక్త్రభూరిగళ ♦ నాదముతో సరిసేయ నయ్యెడున్. 3

ఇవిగో చందనాశ్వకర్ణసరళపాటలాది వృక్షములచే దట్టములయి, మాఁ రెడుపండుల పరిమళంబుల వెదఁజల్లుచు నీయరణ్యగిరిభూములు, ఓహో! తరుణకదంబజంబూవనంబులు నిబిడంబుగ నలమికొన నిరులు గవియు గుహలెరగిరినికుంజపుంజంబుల, గుంజద్గంభీరగద్గదోద్గార ఘోర ఘోషణంబుగఁ జెలఁగి పాఱు గోదావరి రవంబులకు మాఱుపలుకు నితంబదేశములతోడి దక్షిణదేశ పర్వతారణ్యములం దలఁపించుచున్నవి. ఇందే యీమధుమతీ సింహాసనగమును బావనముసేయుచు భగవంతుఁడైన భవానీపతి స్వయముగ వెలసి సువర్ణబిందుఁడన వెలుఁగొందు చున్నవాఁడు. [ప్రణమిల్లి]

క. జయదేవ! భువనభావన!
జయభగవ! న్నఖిల వరద! ♦ జయనిగమనిధే!
జయరుచిర చంద్రశేఖర!
జయమదనాంతక! వృషధ్వ ♦ జ! జయాదిగురో! ౪

[నడచుట నభినయించి]

కవిరాజ.

తొలుకరిమబ్బుల నిల్కడ నల్లగఁ ♦ దోఁచెడియొత్తగునెత్తములుం
జెలఁగి తుదంబున నాఁడునెమళ్ళగిఁ ♦ జేసెడి కేయనునాదములుం
బులుఁగులుగట్టిన చిత్రపుగూఁడుల ♦ భూజములన్నను పై నదియొడల్
గలిగి యిదే బృహదశ్మమహీధ్రము ♦ కన్నులపండువునేసెడుగా. ౫

ఉ. ఇందలి లోయలందు వసి ♦ యించెడికోడెమొలుంగు బంట్లగిం
ద్రందుగ నోటితుంపురులు ♦ గప్పెడు మాటికిఁ దుప్పుతుప్పనన్
మందటఁ జెంపునొందెడు ♦ సుత్తగజప్రవిభిన్నసల్లకీ
గ్రంథులఁగాఱుతిక్తరశిశి ♦ రస్ఫుట తిక్తకషాయగంధముల్. ౬.

[వయిఁజూచి] ఓహో! మధ్యాహ్నమైనదే! ఇప్పుడు.

సీ. పిడిచి ప్రోడయినగు ♦ మ్ముదుప్రాను దట్టంపుఁ
చిగురాకుజొంపముల్ ♦ చెలువుమీఱు
తేలచెట్టునకుఁ బా ♦ ఱెదుగ్రుడ్డికొక్కెర
పూర్ణికల్ తటభూమిఁ ♦ బొలుచునూనె
యగిసె ప్రాఁకులప్రాలి ♦ యట్టి యగ్రములంటి
దగగొన్న వగుటచే ♦ మగిడినీటి
కందువల్ నెమకంగఁ ♦ గడఁగి పాఱెడు నెమ్మి
తొజ్జమఱుంగుల ♦ దూరికాల
తే. గీ. కంతకములుండెఁ; గ్రిందను ♦ గంపపులుగు
లంగలార్చెదు గొంద్రుఁగోం ♦ డ్రనుచుఁ జెంతఁ
బూవుఁ బొదరింటి గూఁడులఁ ♦ బావురమ్మ
లడరఁజేసెడి హుంకార ♦ మనుసరించి. ౭.

సరే. ఇప్పుడు మాధవమకరందులను వెదకి వచ్చినకార్యమును జూచుకొనియెదను. [అని నిష్క్రమించుచున్నది]

[విష్కంభము]

[తరువాత మాధవమకరందులు ప్రవేశించుచున్నారు]

మక:—[సకరుణముగా నిట్టూర్పు పుచ్చి]

ఉ. చూపిన యానృష్ఠ్యపుఁదగులు ♦ సూపకయున్ విడనాడలేకయుం
ద్రోపడి మోహావృం దమము ♦ లోఁదిరుగాడుచు నుండుడెందమే
యాపదచేత, నందుఁ బసు ♦ లట్టులు సేయున దేమిలేకయో
ప్రాపటియుంటి మిందఱము ♦ వక్రపుదైవము చెద్దినక్కటా. ౮.

మాధ:—హా! ప్రియురాలా! మాలతీ! యెందుఁ బోతివే! అడపొడ గానరాక యట్టి మాయమైతివే! ఓనిష్కరుణురాలా! నన్ను దయఁజూచి సంభావింపఁగదే!

చ. ప్రియునిఁగ మాధవున్ వలపుఁ ♦ బేరిమినేలినదాన వేల నా
పయిదయలేను సికళ? విను ♦ వాఁడసి వేఱొకఁ డున్నవాఁడకో?
స్వయముగ, మూర్తిమంతమగు ♦ పండుగువోలెను రమ్యకంకణో
దయము భవచ్ఛయఁబొసఁగి ♦ హర్షము సేసిన నాకు నవ్యఁడై. ౯.

వయస్యా! మకరంద! లోకములో నంతటి యనురాగము కదురుట దుర్లభముసుమీ!

చ. వెలఁది యనుక్షణంబు నతి ♦ భీకరమై మదన జ్వరంబు బె
ట్టలమటఁబెట్టఁ బుష్ప మృదు ♦ లావయవంబులతో సహించెగా
తలఁగఁగ నెంచెగా చెలి ప ♦ దంపడి ప్రాణములం దృణంబుగాఁ
బలుకులు వేయునేల? తెగువం దనుదానె నన్ వరించెగా. ౧౦.

మఱియు, చెలికాఁడా! నీకు జ్ఞాపకము లేదా?

శా. నాయాసల్ విడనాడి నందనుని పెం ♦ డ్లామాటకున్ ముందుగా
నాయంబుల్ దెగినట్లులేపఱిమొదల్ ♦ స్వాధీనముం దప్పఁగా
నాయుఃసంబున నేఁబ్రచుం బయికి నె ♦ య్యంబెట్లు తాఁజూపెనో
యాయింతింగని చింతపొంగి పొరలన్ ♦ హా! యేను నెట్లుంటినో.

[ఆవేగముతో] అయ్యయ్యో!

* చ. ప్రిదులునెకాని యూరటను ♦ పెల్లున డెందము రెంటుగాదు; మైఁ
బొదువునెకాని మబ్బుచెడి ♦ పోవద తెల్వియొకింతయేని, లోఁ
బొదలిదహించుఁగాని తను♦వున్ మసిఁజేయదు తాప; మాయముల్
గుదెగొనిక్రొట్టుఁగాని తెగఁ ♦ గోయఁడు జీవము దైవమేమనన్.

మక:—దైవమువలెనే సూర్యుఁడుకూడఁ దీవ్రత వహించి దహించి వేయుచున్నాఁడు. నీ శరీరావస్థ యిట్లున్నది. కాఁబట్టి యించుకసే పీతామరకొలనిదాపునఁ గూర్చుందము. ఇందు

మ. వెలికిం దోఁచు మృణాళదండములపై ♦ విష్ఫారు క్రొత్తమ్మిపూ
వుల పూఁదేనియ సోనలంబొదలు తా ♦ వుల్ గ్రోలియంతన్ విని
ర్మలకల్లోల విలోలశీకరతుషా ♦ రప్రాప్తిచే మెల్లనై
పొలయుం జల్లనిగాలి తెప్పిరులుచు ♦ బొల్పొంద నీప్రాణముల్.

[ఇటునటునడచి కూర్చున్నారు]

మక:—[తనలో] కానీ యిప్పుడు వీనిమనస్సు మరలించెదను. [ప్రకాశముగా] వయస్యా! మాధవా!

మ. కనులంగ్రమ్మతి నీరు గమ్మశయమున్ ♦ కాంచందగున్ నీకు నిం
దనయంబున్ సిరి కాటపట్టులగు నీ ♦ యుబ్జారరోద్దేశముల్
ఘనహార్షస్వాన మల్లికాకుచలప ♦ త్కువ్యాహతిందూలి ని
గ్గనయుంబొల్చు మృణాళదండములతో ♦ నీపుండరీకావళిన్.

---

* ద్విపద.

ప్రిదులుశెకానియు ♦ ద్వేగంబుగలుగ । హృదయంబువిడిపోదు ♦ రెండుగ్రక్కలుగ
వికలమైదేహంబు ♦ పెనుమూర్ఛఁదగులు । సకియఁగూర్చిన తెల్వి ♦ సాదకేమిగులు
నొడలెల్లఁగాల్పులో ♦ నుడుకుప్పతిల్లి । మడిసిపోదేమి భ ♦ స్మంబుగాఁజెల్లి
యాయముల్ దెగఁగొట్టు ♦ సారజీవంబుఁ । గోయఁడేరుయేమను ♦ కొందు దైవంబు.

పాఠాంతరము.

మాధ:— [ఆరాటముతో లేచుచున్నాఁడు.]

మక:—ఏమి యిది? నాఁగొడవ వినిపించుకొనకయే యెక్కడ కో లేచిపోవుచున్నాఁడా! (నిట్టూర్పువుచ్చి లేచి) మిత్రుఁడా! నామాట విని నిలువుము. చూడుము.

మ. నదిపైఁ బ్రబ్బలి పూలురాలి జలమున్ ♦ వాసింపఁగాఁ జేసెడుం;
బొదలుం బూఁబొదలందు గట్టులపయిన్ ♦ మొల్లల్ ప్రఫుల్లంబులై;
యిదె యుత్ఫుల్లకదంబహాసి గురుభూ ♦ భృత్సీమలన్ నెమ్మి స
మ్మద మొప్పన్ నటియింప సానువులపై ♦ మబ్బుల్వితానంబులా.

మఱియు,

ఉ. శైలసమీపభూములను ♦ జల్లునబూచెఁ గదంబముల్, దిశల్
చాల మొయిళ్ళ చాలులను ♦ శ్యామములయ్యె, నెసంగెఁ బల్లవు
న్నేలలఁ గ్రొత్త మొల్కలును ♦ నీటుగు గేదఁగి పూవులున్, వనీ
పాళి శిలీంధ్రలోధ్ర సుమ ♦ వాసనలకే వికసించి మించెడున్. ౧౬

మాధ:—వయస్యా! చూచుచునే యున్నాఁడ నోయి. ఈ యరణ్యగిరిభూముల రామణీయకము చూడ శక్యముగాకున్నది. ఇది యేమిటి? [కన్నీళ్లతో] తెలిసినది.

ఉ. పూచిన మద్దివేగిసలఁ బొల్చెడితావులు దాల్చి తూర్పుగన్
వీచెడి యీరుగాలికదె ♦ నిద్దవు నిలపుఁ దున్కలట్లుగాఁ
దోఁచు మొగుళ్ళు నల్లడలఁ ♦ దూలెడుఁ; గ్రొంజడివాన తుర్విపై
లేచెడుఁ గమ్మతావు; లొగి ♦ లేచెడుఁ జెమ్మట లప్డె చల్లనై
లేచెడు! వెండివచ్చినవి ♦ వెన్కటిప్రొద్దులె యివ్వుడక్కటా. ౧౭

హా! ప్రియురాలా! మాలతీ!

కవి. పరువపుఁ జీఁకటిమ్రాఁకులపోలికఁ ♦ బైపయి నల్లనిమబ్బులును
బొడఁబొడఁ జల్లనిగాలికిఁ దూలెడు ♦ నూతనవారి కణంబులు, సం
బరమునఁ గేరి నటించు నెమళ్ళవి ♦ వాదకల ప్రతినాదములున్
సురవర కార్ముకదీప్రులు నొప్పఁగఁ ♦ జూడఁగ నావశమా నెదిశల్.

[నిట్టూర్పువుచ్చి శోకార్తి నభినయించుచున్నాఁడు.]

మక:— ఇప్పుడు చెలికాఁడేదో యతిదారుణమైన యవస్థలో నున్నాఁడు. (కన్నీళ్ళతో) అయ్యో! యెంతకఠినాత్ముఁడను! కనిపెట్ట లేక వినోదము మొదలుపెట్టితిని. (నిట్టూర్పుపుచ్చి) మేమిప్పుడు మాధవుని విషయమున మా యాసలన్నియు సరిచేసికోవచ్చును. (భయముతోఁ జూచి) స్పృహ దప్పినది! హా! సఖ! మాలతీ! యింకే మున్నదే? అయ్యో! జాలిలేసిదానా!

ఆ. వె. తల్లి మొఱఁగకుండఁ ♦ దండ్రి మొఱఁగకుండఁ
దెగువ నేసినాఁడు ♦ మగిడి నేఁడు
నిరపరాధి యైన ♦ నీ వల్లభుని మీఁద
జాలిమాలియుండె ♦ దేల చెలియ! ౧౯

ఏమిది? యిప్పటికిని ఊపిరి పుచ్చుకొన్నాఁడు! అన్నా! మోసముచేసి నాఁడు!

శా. వ్రయ్యన్ డెందము, కీలుపట్లుడలెనుం ♦ బాష్పై జగంబొప్పదున్
ఒయ్యన్ లోనదహించి మోహము తనూ ♦ సుద్దామమై కప్పు; నా
హా! యూపేఁ గృశించు నాత్మయును గా ♦ ఢాంధంబులో మున్గెనా
నయ్యయ్యో! యిపుడేమి సేయఁదగుఁ గ ♦ ట్టా! మందభాగ్యుండనే.

ఎంతకష్ట మెంతకష్టము!

ఆ. వె. ఎవఁడు బంధుజనుల ♦ కెల్ల వెన్నెలపండు;
ఎవఁడు మాలతి కనుఁ ♦ గవకు ముద్దుఁ
బండురుం, డల మక ♦ రందమిత్రుఁడు జీవ
వర్గ తిలకమకట ♦ ప్రళయమొందె. ౨౧

హా! చెలికాఁడా! మాధవా!

తే. గీ. నాడుమేని గందపుం బూఁత • నాడు కగెల
చందమాను నాదుహృదయా • నంద మెవ్వఁ
డాసొగసుకాని నిన్ను నా • ప్రాణమల్ల
కాలముననీవు కాఁచేఁ • గూలితిఁగద. ౨౨

[స్పృశించుచు]

ఆ. వె. పలుకవయ్య చిన్ని • ములకనవ్వొలయు! నన్
గన్నొకింతవిచ్చి • కనఁగదయ్య!
యిట్టియుగ్రభావ • మేలయ్య? మేలయ్య
పరమమిత్రు మఱనఁ • బ్రాణసఖుఁడ! ౨౩

మాధ:—[తెలివినొందుచున్నాఁడు.]

మక:—[ఊర్పుపుచ్చి] ఇదిగో క్రొత్తగాఁ బులుగడిగిన రాజ పట్టముపగిది నిగనిగమను సొగసుమీఱు తొలిమొగులువలని శీకరా సారముచేఁ బ్రియవయస్యుఁడు తెప్పిరిల్లుచున్నాఁడు. అమ్మయ్యా! కొంచెమూపిరిపుచ్చుచున్నాఁడు!

మాధ:—ఇప్పుడీ యరణ్యమందుఁ బ్రియురాలి కెవ్వరిచేత వార్తఁ బంపుదును? [చూచి] మేలు! మేలు!

మ. కమియం బండిన పండ్ల నల్లనగుచుం • గన్పట్టు జంబూనికుం
జములం దొట్టిలి సన్నగిల్లు నలలన్ • జాల్వాఱు నేటూవలన్
సుమహోత్తుంగ మహీధ్రశృంగగతమై • నూతాన్నంబుదం బొండి దే
యమరుం బ్రొషతిమాలమాల్యరమణీ • యస్వచ్ఛనీలచ్ఛ విన్.

[తొందరగాలేచి యున్ముఖుఁడై దోసిలిపట్టి]

మ. నినువిద్యుల్లలితాంగి పాయకెపుడున్ • బ్రేమంబుమైఁ గౌఁగిలిం
చునుగా? నిన్నుభజించుగా నుముఖతన్ • శోభిల్లి సారంగముల్?
నినుఁగొంపోయెడుగా సుఖంబుగను వి • న్వీధిం బురోవాయువుల్
ఘన లక్ష్మీయుత దేవతాధిపధనుః • ఖండాంక ! సౌమ్యాగ్రణీ.

[ఆలకించి] మేలు! గిరిగహ్వరంబుల నాలకింపనైన ప్రతిధ్వనులకు సంతోషంబునఁ గంఠంబులెత్తి నీలకంఠంబులు సేయు కలకేకారవంబులతో నను బంధింపఁజేసి యీ ఘనుండు ఘన మంద్రమహాహుంకారంబుచే నాకనుజ్ఞ యిచ్చుచున్నాఁడు. కాఁబట్టి యిప్పుడు ప్రార్థించెదను. భగవంతుఁడవైన జీమూతనాథా!

శా. ఎందే మత్ప్రతి మాలతిన్ జగతిఁ గం ♦ దేనిన్ యదృచ్ఛాగతిన్
ముందూరార్చి వెన్క మాధవుని బా ♦ ముల్ దెల్పు మోయయ్య! నా
చందంబున్ వినిపించునప్డు తగదా ♦ శాతంతువుం ద్రెంచివే
యుం; దానంజుమి యొప్పుటోసిలిచెన ♦ య్యజ్ఞాతికిం బ్రాణముల్.

[సంతోషముతో] ఊఁ ఊఁ! బయలుదేతినాఁడు! కనుక మఱొక్కడకుంబోయి విచారించెదను. [అని నడచుచున్నాఁడు.]

మక:—[ఆరాటముతో] ఇప్పుడు మాధవ పూర్ణచంద్రుని నున్మాదోపరాగ మెట్లుగాఁ గ్రమ్మినది! హా! తల్లీ! హా! తండ్రీ! హా! భగవతీ! మాధవుని యవస్థను జూడవమ్మా! నన్ను రక్షింపవమ్మా!

మాధ:—అన్నా! యెంత ప్రమాదము!

క. లావణ్యము లొద్దుగు క్రొం
బూవులు, చూపులు గురంగ ♦ ములు, నడలుఁగరుల్,
తీవలు మెయిసొబగునుగా
నీవిధమున ప్రింగివైచె ♦ నీయడవి చెలిన్. ౨౭.

హా! ప్రియురాలా! మాలతీ!

మక:—

ఉ. ప్రాణసమానుఁడై సుహృదుఁ ♦ డై ప్రియుఁడై సహపాంసుకేళికా
నూనసిబద్ధసఖ్యుఁడయి ♦ యొప్పెడి యీసుగుణుండవౌరా యిటుల్
చానన బాసి గాసిలి స ♦ లంగి కలంగి మహార్తిఖేదముం
బూనఁగ రెండుప్రక్కలయి ♦ పోవిదియొట్టులు నీవు డెందమా.

మాధ:—బ్రహ్మదేవునియొక్క సృష్టినైపుణ్యము పెక్కు చోట్ల నొక్కరీతిగానే యుండును. సరే యిప్పుడిట్లు కానిమ్ము. [మోకరిలఁబడి పెద్దగొంతుతో] ఓహో! పర్వతారణ్యవాసులైన మృగములారా! నేను మనవిచేసికొనుచున్నాఁడను. మీ రించుకసేపుచెవియిచ్చి విని నన్ననుగ్రహింపవలెను.

శా. కన్నారే! సకలాంగసుందరి నిటం ♦ గాంతారదేశంబునన్
విన్నారే! సతికేమి సంఘటిలెనో? ♦ విన్నాణియై ముగ్ధయై
యున్నారీమణి డెందమందొడలఁ బు ♦ ష్పాస్త్రుండు రాగిల్లునో
యన్నల్! ప్రాయపుఁ గన్నెలివ్వి వినుఁడీ ♦ యబ్జాక్షి గుర్తింపఁగన్.

అయ్యో! యెంతపాపము!

చ. వెసఁబురివిచ్చి కేరుచును ♦ వీకులఁ బెట్టుదు నెమ్మినా మొఱన్
గొసరుచుఁ జేరెదుం జెలిఁ జ ♦ కోరము దానుదఘూర్ణతారమై
కుసుమరజంబు ప్రాసెదును ♦ గోమలి చెక్కుటఁ గొండ్రుముచ్చయో
యనపయ మయ్యెనిన్నిటికి ♦ నక్కట యెవ్వరి నింక వేఁడుదున్.

ఇక్కడ సంకొకటి,

ఉ. వాతెర కెంజిగి దోరసి ♦ పల్వరుసల్ దగ, రోచనీసుమ
ప్రాతమువోలెఁ గెక్కఁగన ♦ రక్తిమ సూపఁగఁ, బండియెత్తునై
మూతి సడల్చుదాడిమము ♦ పోల్కివహించు సఖీముఖంబుఁ దా
నీతటిఁ బందుక్రోఁతి సయి ♦ కెత్తి పొరింబొరి ముద్దులాడెదన్.

ఇదిగో నీవైపున మఱ్ఱిచెట్టు మొదలను మదపుటేనుఁగొకటి కంఠమానుకొని నిలిచి యున్నది. ఇక్కడను అసమయముగానే యున్నది.

చ. మురదకుఁ గన్నుమూసికొను ♦ తొయ్యలిఁ గోసుచు దంతకోటిచే
వరుసఁగ్రుదల్చి వీవలను ♦ బాటిగఁ జల్లనిగాలి వీచుచుం,
గొటికి నగంబులందుగుచి ♦ గుళ్ళను నోటికి నందియిచ్చుచుం
బరిచయ మిట్లు సేసికొనఁ ♦ బాటుపడున్ వనహస్తిక్రొత్తగన్.

[మఱియొకవైపుచూచి] ఇంకనిదియో.

చ. ఉఱుము మొయిళ్ళ చూచుకొని ◆ యున్మదు మంద్రగభీరఘీంకృతిన్,
నరసఁగొంచుకుండి మృదు ◆ శైవలముం దెమలించి మ్రింగఁ, దే
పటుతమదంబు, నోళ్ళుడఁగి ◆ నట్టియుత్ఫుల్లలవాల్మ్యాగఁబుతోఁ
గరి కరిణీవియోగమునఁ ◆ గ్రాఁగి తపించెడు విహ్వలించుచున్. 33.

కాఁబట్టి యాయాసపడుచున్నదానిని మఱింత యాయాసపెట్టుటగాని దీనినడిగిన ప్రయోజనములేదు. [ఆనందముతో] ఇక్కడనే మఱియొక్క మత్తమాతంగ యూథపుఁడు తన మధురగంభీరకంఠగర్జితధ్వనులచే వేడుకసేయుచుఁ బ్రియురాలితోఁ గూడిమాడి జలక్రీడలాడుచున్నవాఁడు. ఓహో! క్రొత్తగ వికసించిన కడిమిపూవుల తావులకుం దావలంబయి చల్లగ గండస్థలంబులనుండి సంతతధారగఁ బ్రవహించు మదోదకంబుచే గట్టులెల్ల నడుసుగట్టఁ, దొండముసఁబట్టి పెకలించివైచిన పద్మమండములతూఁడులు, కాడలు, కేసరంబులు, కింజల్కములు, నలుగడలఁదూలుచుండ, నెడతెగక తపతపఁగొట్టుకొను తోరంపుఁబీనులతాఁకులకుఁ జెదరి చిదురుపలగు తరఁగలచాలువలన బడిబడిఁ బయికిలేచు తుంపురులగుంపులకు నిలువలేక కలరసారసంబులు వెఱచి పఱచుచుండ నీతనిజలకేలి చాల రమణీయముగానున్నది. కానిమ్ము. ఇతనింబలుకరించెదను. మహాభాగ! నాగవల్లభా! నీయౌవనము కొనియాడఁదగినదికదా! ఊఁహూ! ప్రియురాలి యనుగ్రహము సంపాదించుకొనుటకూడ నెఱుఁగుదువు! [సదూషణముగా]

ఉ. లీలఁ దెమల్చి తూండ్లుగల ◆ లేఁతగ మున్నిడ యంతఁ బుక్కిటం
గ్రోలిచె పద్మసౌరభము ◆ గుమ్మనుకమ్మనినీళ్ళు, లావయిన్
దేలిచె తుంపురుంజడిని ◆ నీటుగఁ, దిన్ననికాడకామతో
నేలొకొ తామరాకుగొడు ◆ గెత్తదు హస్తిసకూరిమిందుదిన్. ౩౪.

ఏమి! నాకుఁ బ్రహ్మోత్తరమీయక నన్ను నిరసనచేయుచున్నది? అన్నా! యెంతటిమూఢుఁడను! ఈవనచరునితో మకరందునితో సంభాషించినట్లు సంభాషించుట నాదేతప్పు. హా! మిత్రుఁడా? మకరందా!

తే గీ. ఎందుకీ దిక్కుమాలిన ♦ యేమ్మబ్రతుకు?
ఎందుకు ఫలానుభవములే ♦ నంద? యెందు
కదియు నీవుఁ లేని గో ♦ ష్ఠుదిన? యెందు
కెవరో ఘటియించు ముద మిసీ ♦ యెండమావు. ౩౫.

మక:—వింతగా నున్నది. ఇతఁడు మోహాంధకారములో మునిఁగియుండియు నదుమున నను నన్నుఁ దలఁచుకొనుచు నేయున్నాఁడు! ఇది చూడఁగా నీతనికి నాయెడఁగల సహజస్నేహముయొక్క సంస్కారము కుసికి మరల నే హేతువుచేతనో తల యెత్తుచున్నది. కనుక నేను చెంత నున్నట్టే భావించుచున్నాఁడు. [ఎదుట నిలిచి] ఆ మందభాగ్యుఁడు మకరందుఁడు వీఁడె నీప్రక్కనే యున్నాడు.

మాధ:—హా! ప్రియవయస్య! నన్నుఁ గౌఁగిలించుకొని యాదరింపుము. ఇంక మాలతీవిషయమున నిరాశుఁడ నైనాఁడను.

మక:—ఇదిగో ప్రాణేశ్వరుని సంభావించుచున్నాను. [చూచి జాలిగా] అయ్యో! నన్నుఁ గౌఁగిలించుకోవలెనని యభిలషించుచునే స్మృతి దప్పినాఁడు! చాలు నింకమీఁద జీవితాశ యేఁడిపింప నక్కఱ లేదు. ఏ విధమునఁ జూచినను నాకుఁ బ్రియవయస్యుఁడు లేఁడని సరి చేసికొనుటయే యుక్తముగా నున్నది. హా! వయస్యా!

తే, గీ. నేఁడి పొంగుగ నెయ్యంబు ♦ పెంపుమీఱ
ననిశ మనిమిత్తముగ నుండ ♦ మనరి నీకు
నావదలు వచ్చెనసియే భ ♦ యంబుగ నెనో
నష్ట మయ్యెనదెల్ల యీ ♦ నంబులోన, ౩౬.

నాకుఁ జూడఁగాఁ గడచిపోయిన గడియలే మెఱుఁగులుగాఁ గనఁబడుచున్నవి. ఏబాధలొందుచున్నను ప్రియమిత్రుఁడు జీవించి యుండుటను గన్నులతోఁ జూచుకొనుచుండెడివాఁడను. మఱియిప్పుడో నాకు,

శా. భారంబయ్యెశరీర మయ్యో! బ్రదుకున్ ♦ వజ్రంపు మేకయ్యె, ది
గ్ద్వారంబయ్యెనుశూన్య,మింద్రియములున్ ♦ వ్యర్థంబులయ్యెన్, సుదు
ర్వారంబై తమమావరించె నఖిల ♦ ప్రాణి ప్రపంచంబునున్
ఘోరంబయ్యెను గాలమీవగిది న ♦ న్నుంగూర్చి నీవేగుటన్. ౩౭.

[ఆలోచించి] మాధవునిమరణముఁ గన్నులారఁజూచి యిప్పుడేమి చేయుదునని బ్రదుకుదును? కనుక నీగిరిశిఖరమునుండి పాటలావతిలోఁబడి యతనికన్న ముందుగానే పరలోకగతుఁడ నయ్యెదను [జాలిగా నిటునటు నడచిచూచి] హా! యెంతకష్టము!

మ. సరసస్నేహవిలాస భాసురములై ♦ జానొందు నాలేమ బి
త్తరపుంజూపులు దేనిఁ గ్రొత్తగనుమున్ ♦ ద్రావం దటస్థించెనా
స్ఫురదిందీవరపత్రకాంతి యగుచున్ ♦ శోభిల్లునీమేను సు
స్థిరతన్ బిగ్గఁగవుంగిలించియును దృ ♦ ప్తింగాంచ నిష్ఠింతయున్. ౩౮.

ఆహా! సమస్తగుణములకు గనియై నిల్చిన మహానుభావుని కిటువంటి యవస్థపట్టినది! మిత్రుఁడా! మాధవా!

మ. గ్రసియింపంబడె రాహుచే విమలరా ♦ కాచంద్రబింబంబు దా
నినుమంత్రై తొలివానమబ్బు విడిపో ♦ యెన్ వాయువేగంబుచేఁ
బూసఁగంబండిన తీయమామిడియునున్ ♦ మోడయ్యె దావాగ్నిచే
ననమానప్రగుణాభిరాముఁడవు నీవయ్యో! మృతుండైతివిన్. ౩౯.

ఇట్లు గతించినవాఁడయినను బ్రియవయస్యునిఁ గౌఁగిలించుకొనెదను. నన్నిప్పుడితఁడు కోరినకోరిక యిదియేకదా! [కౌఁగిలించి] హా! వయస్య! హా! విమలకళానిధీ! హా! గుణగరిమ! హా! మాలతీ స్వయం

గ్రాహజీవితేశ్వర! హా! కామందకీమకరందానందముగ్ధచంద్ర! హా! మాధవ! ఇదిగో నీవు జీవించియుండఁగా నీకు లభింపని మకరంద బాహుపరిష్వంగము నీయవసానదశయందుఁగలుగుచున్నది! మిత్రుఁడా! యిటువయిని మకరందుఁడు క్షణమాత్రమైనను జీవించునని తలఁపవద్దు. ఏమంటేని,

తే. గీ. జనన మాదిగ నాదు హృ ♦ త్తునను పెరిఁగి
తల్లి చనుఁబాలు సమముగాఁ ♦ ద్రావి యివ్వ
డొకఁడవును బంధులిచ్చు తి ♦ లోదకంబు
నాకు లేకుండఁద్రావుట ♦ న్యాయమగునె. ౪౦.

[జాలిగా విడిచిపెట్టి యిటునటు నడచి] ఇదిగో నీదిగువను పాటలావతి ప్రవహించుచున్నది. దేవీ! పాటలావతీ!

క. ప్రియమిత్రుఁడెందు ♦ దేహముఁ
గయికొనునో యందె నేను ♦ గయిగొంటయు వెం
డియు నతఁడొందెగునో యను
నయముగ నందెగుటయును ♦ నాకివిక్కోర్కుల్. ౪౧.

[అని పడఁబోవుచున్నాఁడు.]

సౌదా:—[తొందరగాఁ బ్రవేశించి నివారించి] వత్సా! సాహసము చేయకుము.

మక—[చూచి] అమ్మా! నీవెవ్వతెవు? ఎందునిమిత్తము నన్ను వారించుచున్నావు?

సౌదా:—నీవు మకరందుఁడవేనా?

మక:—విడిచిపెట్టుము. ఆ మందభాగ్యుఁడను నేనే.

సౌదా:—వత్సా! నేను యోగినిని. మాలతి యంగమచ్చమును దెచ్చితిని. [వకుళమాలికను జూపుచున్నది.[

మక: —[తెప్పిరిల్లి జాలిగా] మాలతి బ్రతికియున్నదా?

సౌదా:—ఉండకేమి? వత్సా! మాధవుఁడేదేని బ్రదుకుగోరని పనిచేసినవాఁడు కాఁడుగదా? శరీరత్యాగమునకుఁ బూనుకొన్నవాఁడవులే! నాయొడలు కంపించుచున్నది.

మక:—దేవీ! అతఁడు మూర్ఛనొంది పడియుండఁగా విరక్తి నొంది విడిచివచ్చినాఁడను.

సౌదా:—అటయిన శీఘ్రముగాఁ బోదమురమ్ము. సంభావింతము. [త్వరితముగా నిటు నటు దిరుగుచున్నారు.]

మక:—[చూచి] అదృష్టవశమున వయస్యుఁడు తెలివినొంది యున్నాఁడు.

సౌదా:—వీరి యిరువురి శరీరాకారములు మాలతిచెప్పినట్లుగానే యున్నవి.

మాధ:—[ఊర్పుపుచ్చి] ఎవరుచెపుమా నన్ను మేలుకొలిపినారు? [ఆలోచించి] నిశ్చయముగా నీవని నాయవస్థ విచారింపక చేసిన యీ నవజలధరపవనునిది. భగవంతుఁడవైన యో పౌరస్త్యవాయూ!

శా. మోదంబుం గననిమ్ము చాతకములం ♦ భోదంబులంద్రిప్పుమీ
నాదం బిమ్ముగఁజేయు నిమ్ముశిఖులన్ ♦ బల్వింపు గేదంగులన్
ఖేదంబెట్టిటు మూర్ఛలో మఱచుచున్ ♦ నేనుండఁ జైతన్యమున్
వ్యాధిన్ వెండియుఁ దెచ్చిపెట్టి విరహిన్ ♦ బాధించదేలాననున్!

మక:—జగత్ప్రాణుఁడైన యీవాయుదేవుఁ డిప్పుడు లెస్స యుసపని చేసినాఁడు. మఱియు,

మ. అలరుం గేదఁగితావులూని నగరీ ♦ ప్రౌఢాంగనాస్యంబు లి
మ్ముల లోలాలకవల్లిచాలనమిషన్ ♦ ముద్దాడి యుత్ఫుల్లనీ
పలసత్కోరకపుటీరజోలుఠదళి ♦ వ్యాహారరమ్యంబులై
లలివప్రానిలముల్ వియోగుల నిటుల్ ♦ రారాపులం బెట్టెడున్. ౪౩.

మాధ:—భగవంతుఁడైన దేవవాయూ! మేలుకొల్పితివిగనుక నిన్నే ప్రార్థించుచున్నాఁడను.

చ. దళితకదంబ కుట్మలక ♦ దంబ పరాగముతోడిపాటుగాఁ
జెలిమొటనున్నదో యటకుఁ ♦ జేకొనిచేర్పుమి నాదుప్రాణముల్
సలువఁగఁజాలవేని యటు ♦ చామయొడల్ స్పృశియించి చల్లనై
యలరెడి వస్తువేదయిన ♦ నంపుము నాకిట దిక్కునీవెగా. ౭౭

[అని దోసిలిపట్టి ప్రణమిల్లుచున్నాఁడు.]

సౌదా:—ఆనవాలొసంగుట కిదే మంచిసమయము. [దోసిట వకుళమాలిక నుంచుచున్నది.]

మాధ:—[సాకూతముగాను సహర్షముగానుసవిస్మయముగాను] ఇది యెట్లు? కామోద్యానమందు నేను రచియించి పంపఁగా ప్రియురాలు తన గుబ్బచన్నులమీఁదఁ దాల్చి ముద్దుసేసిన పొగడపూదండ యిది. [చక్కఁగాఁ బరిశీలించి చూచి] సందేహమేల? అదే యిది.

చ. కలికి నవేందు సుందరము ♦ ఖంబును గాంచఁగ హేలమై నిర
ర్గళముగఁ బుట్టినట్టి కుతు ♦ కంబును లోన నడంచుకొంటకై
యలరులు హెచ్చుదగ్గులుగ ♦ నట్టిటువెట్టి రచించినట్టిదీ
బొలువుగ నాలవంగికకు ♦ మోదమువెంచె మహాప్రసాదమై. ౭౮

[వెఱ్ఱిసంతోషముతో లేచి] ఓకోపశీలురాలా! మాలతీ! ఇదియంతయుఁ జూచుచు నూరకున్నావా? (కోపపడినట్లు) ఓసి నాయవస్థయెఱుఁగనిదానా?

చ. వెడలెడిరీతిఁ బ్రాణములు ♦ ప్రీలెడి పోలిక డెందమట్టిమం
డెడుగతి నంగకంబులును ♦ నిండఁగఁ గ్రమ్మినమాడ్కి మోహమీ
వడువుననుండ మేలమఁటె ♦ వైళమ ప్రోవఁగఁ జెల్లఁగాక, నా
యెడ దయమాలి యుండఁదగు ♦ నే? కనుఁబండువుసేయఁగాఁగదే.

[అంతటఁ జూచి విసుగుతో] ఏదీ యిక్కడ మాలతి? (వకుళమాలను

గూర్చి) ఆహా! ప్రియురాలికి నచ్చిన నెచ్చెలివయి పరమోపకారముం జేసితివిగదే!

ఉత్సాహ. ఎదురులేక పెట్టిదముగ ♦ నించువిలుతుఁ డేచి పె
ల్లిదవు వలపుఁదలఁపునిలిపి ♦ లీల మరులుగొలుపఁగాఁ
గదిసి నీవు సుదతి కపుడు ♦ కౌఁగిలిచ్చి తదియెనా
పొదువుఁ గౌఁగిలయ్యెఁ జెలియ! ♦ ముదితఁ బ్రోవఁగలుగుటన్.

[జాలిగా నిట్టూర్పు పుచ్చి]

మ. బలితంపుం జెలికారపు న్నెలవులై ♦ బాధానురాగంబులై
యలరుం గైదువు జోదువేఁడిమికి సా ♦ హాయ్యానుకూలంబులై
కలితానందము లొచు నాగళమునం ♦ గళ్యాణి కంఠంబునం
బలుమాఱైన భవద్గతా గతములన్ ♦ భావించి దుఃఖంచెదన్. ౭౮

[హృదయమందుంచుకొని మూర్ఛనొందుచున్నాఁడు.]

మక:—[చేరవచ్చి] చెలికాఁడా! ఊఱడిల్లుము

మాధ:—[ఊఱడిల్లి] వయస్యా! మకరంద! నీవు చూడలేదా యేమి? ఎందుండియో మాలతి చటుక్కునఁ దనహస్తమును నాకొసంగినది. ఇది యేమని భావించెదవు?

మక:—ఈ పూజ్యురాలు యోగీశ్వరి. ఈ మాలతీప్రత్యభిజ్ఞానమును గొనివచ్చినది.

మాధ:—[దోసిలివట్టి] అమ్మా! అనుగ్రహించి నా ప్రియురాలు జీవించియున్నదేమో చెప్పుము.

సౌదా:—వత్సా! ఊఱడిల్లుము. ఆ కళ్యాణి జీవించియున్నది.

మాధ:—మక:—[ఊర్పుపుచ్చి] అమ్మా! అటయిన నీవృత్తాంతమేమో సెలవిమ్ము.

సౌదా:— వెనుకఁ గరాళకగుడిలో నఘోరఘంటుఁడను ఖడ్గపాణి యొకఁడు హింసింపఁబడినాఁడు.

మాధ:—[ఆవేగముతో] అమ్మా! చాలు నామీఁదఁ దెలిసినది.

మక:—మిత్రుఁడా! ఏమిటది?

మాధ:—వయస్యా! మఱేమున్నది? కపాలకుండల కోరిక యీడేరినది.

మక:—అమ్మా! ఇది యిట్లేనా?

సౌదా:—వత్సా! అట్లే. ఇతఁడు చెప్పినట్లే.

మక:—అన్నా! యెంతకష్టము!

తే. గీ. అలఘు తరళోర్మిఁ గనుపొంటెఁ ♦ గలువకొలనఁ
గలయ శరదిందుచంద్రిక ♦ గాసె నేని
మేలుగనె యుండి యుండు న ♦ కాలమేఘ
వితతి యెడఁబాసె నేమి దు ♦ ర్విధియొకాని. ౪౯.

మాధ:—హా! ప్రియురాలా! మాలతి! అతిభీభత్సమగు కష్టమనుభవించితివి!

తే. గీ. అల కపాలకుండల చేత ♦ నప్పు డీవు
చిక్కియెట్లుంటివో కదా ♦ చిగురుఁబోఁడి
రెచ్చికోఁనల్చెడి ధూమ ♦ రేఖచేత
నలమికొనఁబడ్డ జాబిల్లి ♦ కలయుపోలె. ౫౦.

భగవతి! కపాలకుండలా!

తే. గీ. లాలనీయము దాని చె ♦ ల్వంబు నీకుఁ;
బూతనవుగాక మఱి శివ ♦ రాతివై తి;
సురభి కుసుమంబుఁ దలఁదాల్పఁ ♦ జూచుఁ గాక
నలిపి వైచునెవఁడు చర ♦ ణములఁ ద్రొక్కి? ౫౧.

సౌదా:—చాలు నీకళవళపాటు విను,

క. ఆయెడఁ దత్పరిపంథిని
నై యే నడ్డపడకున్న ♦ నది పాపంబుం
జేయుటకు వెనుకఁదీయదు
పో! యతిదుష్కరుణురాలు ♦ బుద్ధిఁదలంపన్.

ఉభయులు:—[ప్రణమిల్లి] మహానుభావురాలికి మాయెడఁ

బరిపూర్ణానుగ్రహామున్నది. నీవు మాకు నిర్హేతుక బంధువురాలవని యే కాని నీవెవ్వరో మేమెఱుఁగకున్నారము.

సౌదా:—ఇదిగో తెలిసికొందురుగాని. [లేచి] ఇప్పుడు నేను,

తే. గీ. గురులసేవించి కావించి ♦ ఘోరతపము
మంత్రతంత్రసమాధుల ♦ మహిమలభ్య
సించిపడసినయాకర్ష ♦ సిద్ధిమీకు
భంబునకుఁగాను వినియోగ ♦ పఱచుదాన.

[మాధవునితోఁగూడి నిష్క్రమించుచున్నది.]

మక:—ఏమి మాయగానున్నది?

తే. గీ. అంతలో మెఱుపంతలో ♦ నంధకార
మగుచు మిఱుమిట్లుగొని కన్ను ♦ లట్టె మొగిడె
వెఱపుగదిరెను [చూచి భయముతో] లేఁడేమి ♦ ప్రియవయస్యుఁ
[ఆలోచించి] డౌను తెలిసిన దిదిసిద్ధ ♦ రాలి మహిమ. ౫౮

[సవితర్కముగా] ఇది యేమో యనర్థహేతువని యెఱుఁగక పొరఁబడుచున్నానేమి?

ఉ. అచ్చెరువయ్యెడున్ మిగులఁ ♦ నప్పటి యాకథలెల్ల జ్ఞప్తికిన్
వచ్చెడు; భీజ్వరం బెగసి ♦ వైచెనుఁ గ్రొత్తగఁబుట్టి; యంతలో
నచ్చువమం గడుం దెలివి ♦ యాక్షణమే నశించి మబ్బుగాఁ
జొచ్చెడుఁ; జిత్రమై మనసు ♦ శోకము మోదము రెండుఁగూడెడున్.

కావున నీ యుద్యానావసానమున సుహృద్వర్గముతోఁ బ్రవేశించి యుండు భగవతి కడకుంబోయి యామె కీవృత్తాంతమును నివేదించెదను.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

నవమాంకము—సంపూర్ణము.

# మాలతీమాధవము

## దశమాంకము

రంగము:--పూర్వోక్తారణ్యమందు మఱియొకవైపు.

[తరువాతఁ గామందకీ మదయంతికా లవంగికలు ప్రవేశించుచున్నారు.]

కామం:—[జాలిగా, కన్నీళ్ళతో] హా. బిడ్డా! మాలతీ! నాయొడిలో నలంకారముగాఁ గూర్చుండుదువు గదే! యిప్పుడెందుఁబోతివే? మాఱుపలుకవేమే?

ఆ. వె. జనన మైనదాదిఁ ♦ గనుల పండువుసేసి
గడియ కొక్క ముద్దు ♦ నడపి యింపుఁ
బెంచు నీదు చిన్నె ♦ లెంచంగ నవి యొడల్
దగులఁబెట్టు గుండె ♦ పగులఁ గొట్టు. ౧.

మఱియు నోసి కూతురా!

తే. గీ. వ్యవధిలేక కేష్పునవ్వులు ♦ వరుసఁ బొలయు
మొలక పలుమొగ్గ లొకకొన్ని ♦ ముద్దుగులుక
వచ్చియును రాని తొక్కుపలుకుల్ ♦ ప్రమద మొనఁగ
నమరు చిననాఁటి నీముఖ ♦ కమలమెంతు ౨.

ఇతరులు:—[కన్నీళ్ళతో] హా! ప్రియసఖి! సుప్రసన్నముఖచంద్రసుందరి! ఎందుఁబోతివే? ఆ క్రూరదైవము దిక్కుమాలినదానవైన నీశరీరమునకేమి యసిఘాతముఁ దెచ్చిపెట్టినాఁడో గదే! హా! మహాభాగ! మాధవ! నీవలనఁ బ్రాణిలోకమునకుఁ గలిగినయుత్సవము నస్తమించుట కుదియించినంతనేపై నను బట్టకపోయెనే!

కామం—[సవిశేషఖేదముతో] హా! బిడ్డలారా!

క. నవరాగరసము సుభగము
నవుమిాబిగి కవుఁగిలింత ♦ యలవిధినియతిఁ
లవలీలవంగముల పెనఁ
కువ సుడిగాలికినిబోలెఁ ♦ గూర్పెడలి చెడెఁ. ౩.

లవం:—[ఆరాటముతో] హా! కూౄరహృదయమా! వజ్రముతోఁ జేయఁబడితివి కాఁబోలును. నీయాన లుడిగినను వ్రక్కలు గాకున్నావు. [అని తొమ్ముర్మోదుకొని మూర్ఛిల్లుచున్నది.]

మద:—చెలీ? లవంగికా! కొంచెము స్వప్రాణడిల్లియుండవే!

లవం:—చెలీ! మదయంతికా! ఏమిచేయుదునే? వజ్రలేపము పెట్టి యతికినట్లు ప్రాణము నన్నువదలి పోకున్నదే!

కామం:—వత్సా! మాలతి! పుట్టినదిమొదలు నీకు లవంగిక మిాఁదఁ బంచప్రాణములు గదా! అది నీకొఱకుఁ బ్రాణములు విడుచుచున్నదే! ఏల జాలినొందవే అమ్మా?

తే. గీ. దీపశిఖ స్నేహపూర్ణవ ♦ ర్తికను బోలె
నుజ్జ్వలాలోకవైన నీ ♦ వొకట దీని
నుజ్జగింపంగ రాజిల్ల ♦ కున్నదిపుడు
మొగము మసివాఱినట్టులు ♦ పొలుపఱంగ. ౪.

హా! కళ్యాణీ! నీవు కామందకి నెట్లు వదలిపెట్టుచున్నావే? ఓదయావిహీనురాలా! నీవు వెచ్చగా నాయొడిలోనే కాదఁటే పెరిఁగి పెద్దదానవైతివి?

ఉ. కొంచక నిన్నుఁ బాల్యదువు ♦ గోలెను దంతపుబొమ్మఁ బోలె నాడించితిఁ; బెంచి పెద్దగ ఘ ♦ టించితి బుద్ధులుసేర్పి; పెండ్లిగావించితి మంచియోగ్యుఁడగు ♦ పెండ్లికొమారునిఁజూచి తెచ్చి; యిచ్చొంచఁగ నీకుఁ బ్రేముడిని ♦ నెక్కుడు గానఁటె యమ్మకంటెనే?

[విలవిలలాడుచు] హా! చంద్రముఖ! యిప్పుడు నిరాశురాలనైతిని గదే!

ఉత్సాహ.

మొలకనవ్వు నిర్నిమిత్త • ముగను ముద్దుమొగమునం
దొలఁక, నదురుసిగయు గార • ధూప ధూపితములుగాఁ
గులికి యొడిని నీడుచున్న • కుఱుచుఁగొడుకుఁ జూడఁగాఁ
గలుగు భాగ్య మొదవదయ్యె • నాయభాగ్య మేమనన్. ౬.

లవం:—అమ్మా! భగవతి! అనుగ్రహింపుము. ఇంకఁ బ్రాణములను నిలుపఁజాలను. ఈ గిరి శిఖరమునుండి క్రిందఁబడి చచ్చి సుఖపడియెదను. ముందు జన్మమునందయినను నేను ప్రియసఖిని జూడఁగలుగులాగున నాకు దేవి యాశీర్వచన మిచ్చుఁగాక! [అని గిరిశిఖరమునుండి పడఁబోవుచున్నది.]

కామం:—ఓసీ! లవంగికా! బిడ్డను బాసి కామందకిమాత్ర మిఁకమీఁద బ్రతుకఁగలదఁటే? ఈ వియోగదుఃఖము మన యిరువురకును సమానమే. మఱియు,

తే. గీ. కర్మలకు భిన్న ఫలములు • గలుగుకతనఁ
గలుగుఁ గలుగక పోవు సం • గమము మనకు;
నైనఁ బ్రాణపరిత్యాగ • మందు మాత్ర
మలఘు సంతాప శాంతియన్ • ఫలము గలదు. ౭.

లవం:—భగవతి సెలవిచ్చినట్లే. [అని లేచుచున్నది.]

కామం:—[దయతోఁ జూచి] వత్సా! మదయంతికా!

మద:—అమ్మా! యేమి సెలవు? ముందు నడువుమనెదవా? అందుకు సిద్ధముగా నేయున్నాను.

లవం:—చెలీ! నాబుద్ధివిని యీ యాత్మనాశ ప్రయత్నమును గట్టిపెట్టుము. నన్ను మఱచిపోకుము.

మద:—[కోపమువచ్చినదానివలె] పోవే! నేను నీవు చెప్పినట్లు వినుదానను గాను!

కామం:—అయ్యో! యీబిడ్డ దారుణము తలపెట్టినది.

మద:—[తెరలో] నాథా! సాకరందా! సీకు నమస్కారము.

లవం:—దేవీ! యిదియే మధుమతీ ప్రవాహముచేఁ బవిత్ర పాదమైన పర్వతవిటంకము.

కామం:—ఇంక నాలస్యమెందుకు? [అందఱును బడఁబోవుచున్నారు.]

[తెరలో]

ఆశ్చర్యము!

తే. గీ. అంతలో మెఱుపంతలో ♦ సంధకార
మగుచు మిఱుమిట్లుఁగొని కన్ను ♦ లట్టె మొగిడి
వెఱపుగొలిపెడు;

కామం:—[చూచి హర్షవిస్మయములతో] ఏమినా ♦ బిడ్డవీఁడె!

మక:—[ప్రవేశించి]అగుడు నిదయెల్ల నలసిద్ధ♦రాలిమహిమ.

[తెరలో]

ఏమి జనసమ్మర్దము! అతిదారుణముగా నున్నది!

తే. గీ. మాలతి యవస్థఁదెలిసి సం ♦ సారమందు
జీవితమునందును విరక్తిఁ ♦ జెంద భూరి
వసువు కృతనిశ్చయుండయి ♦ వహ్నిసార, సు
వర్ణబిందుఁ జేరెనిఁకేటి ♦ బ్రతుకు మాకు. ౯.

మద:-లవం:—ఇప్పుడే మాలతీమాధవులఁ జూడఁగలుగుదుమన్న సంతోషమును ఇప్పుడే భూరివసువును గుఱించి దుఃఖమునా?

కామం:-మక:—అన్నా! అదృష్టమును కష్టమును! వింతగా నున్నది!

తే. గీ. అంపవుంగోఁత, మంచిగం ♦ దంపుఁబూఁత
యేమి యిది యేకకాలమం ♦ దే ఘటిల్లె!
మబ్బుగనఁబడ దిదియేమి ♦ మాయొ కఱియు
నగ్నికణములు నమృతంబు ♦ నవిరళముగ. ౧౦.

తే. గీ. విసము సంజీవనిఁ గలయఁ ♦ బిసికినట్లు
చీఁకటిని వెల్గు నేకంబు ♦ సేసినట్లు
కులిశ శశికరముల జత ♦ గూర్చినట్లు
లయ్యెఁబో! యిప్డు మనభాగ్య ♦ మరసిచూడ. ౧౧.

[తెరలో] హా! తండ్రీ! ఉడుగుము. నీముఖపద్మమును జూడ వలెనని మనసు పడుచున్నాను. దయఁజూచి సన్నాదరింపుము. ఆహా! నానిమిత్త మాచక్రవాళభూచక్రమునకెల్ల మంగళైక నిర్మలప్రదీపమగు నీ దివ్యదేహమును బరిత్యజించుచున్నావు! నే నెంత నిర్దయురాలనో కాని మిమ్మునందఱను విడిచి సిగ్గునొందకున్నాను?

కామం:—హా! బిడ్డా! మాలతీ!

తే. గీ. చచ్చి బ్రతికినయట్లుగా ♦ వచ్చినీవు
కంటఁబడితివో లేదొ యీ ♦ వెంటనిపుడె
చంద్రకళ మ్రింగ రాహువు ♦ చందమునను
సిద్ధమైయున్నది మఱొక్క ♦ చేటు నీకు. ౧౨.

మద:—లవం:—హా! ప్రియసఖీ!

[అప్పుడు మూర్ఛనొందిన మాలతినిదీసికొని మాధవుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

మాధ:—ఎంతకష్ట మెంతకష్టము!

తే. గీ. వెలఁదుక ప్రవాస మెట్లొతా ♦ వెళ్ళఁబుచ్చి
పొంది సంశయించెదు నొందు ♦ విధముగానె;
పండియుండఁగఁ బ్రాణుల ♦ భాగ్యఫలము
పొనఁ గుడువకుండ నెవఁడు త ♦ ప్పింపఁగలఁడు? ౧౩.

మక:— చెలికాఁడా! మఱి యా యోగిని యెక్కడ నున్నది?

మాధ:—

ఆ. వె. ఇరువురమును గలిసి ♦ యే వేగ మొప్ప శ్రీ
పర్వతంబునుండి ♦ వచ్చినార;
మింతలోన నడవి ♦ నెవ్వరో మొఱవెట్ట
వినియె మాయమగుచుఁ ♦ జనియె సఖుఁడ. ౧౪.

కామం:—మక:— ఓ మహాత్ముఁరాలా! మరల మమ్ముఁ గాపాడుము. మాకుఁ బొడసూప కున్నా వేమి?

మద:—లవం:— చెలీ! మాలతీ! యిదిగో నీచెలికత్తెలము మేము [వడఁకునొందుచు] అమ్మా! భగవతీ! రక్షింపుము! రక్షింపుము! దీని హృదయ మిప్పటికిని ఊపిరిపుచ్చక నిశ్చలముగా నున్నది! హా! భూరివసూ! హా! ప్రియసఖీ! మీరిరువురు నొకరినిమిత్త మొకరు ప్రాణములు విడుచుచున్నారు!

కామం:— హా! బిడ్డా! మాలతీ!

మాధ:— హా! ప్రియురాలా! మాలతీ!

మక:— హా! ప్రియసఖీ! [అందఱు మూర్ఛిల్లి మరలఁ దెలివి నొందుచున్నారు.]

కామం:— ఏమిది! యింతలోనే వట్టపగలు మబ్బుపట్టి మీఁద నీటిచినుకులు పడుచున్నవి! ప్రాణమెంతహాయిగా నున్నది!

మాధ:—[ఊర్పుపుచ్చి] చూడుఁడు! చూడుఁడు! మాలతికిఁ దెలివివచ్చినది! ఈమెకిప్పుడు,

ము. నెగయుం జన్నులు జొమ్ముననిబిడమై ♦ నిట్టూర్పు బిట్టాడఁగా,
పొగనుంగన్నులు తొంటిక్రొన్నిగనిగల్ ♦ సూపించి దీపించెడున్,
మొగముం జక్కఁ గలంక దేఱెడును సమ్మోహంబువాయంగ లేఁ
బగటం గ్రొంజిగిఁ దాల్చి పొల్చి కననొ♦పద్మంబు,చందంబునన్. ౧౫.

[తెరవో]

తే. గీ. నందనసమేతుఁడై చర ♦ ణములు వ్రాలు
నుర్వీపతిఁ గయికొనకగ్ని ♦ నఱుక నున్న
భూరివసువట్టి నామాట ♦ గారవించి
మరలుచున్నాఁడు పార్థివి ♦ స్మయములడర. ౧౬.

మాధ:—మక:— దేవి! యదృష్టము వర్ధిల్లుచున్నది!

తే. గీ. అలరునేయమ్మ వాగమ్ము ♦ తాంబుధార
లంబుదము వారిధారల ♦ నతికరించి,
చేరవచ్చెడు మనల నా ♦ సిద్ధురాలు
వడిగఁ దోలఁగఁ ద్రోచికొనుచు ♦ వారిదముల. ౧౭.

కామం:—ప్రియముగదా మనకు!

మాల:—అదృష్టవశమున నిప్పటికిఁ దెప్పిరిల్లినాను!

కామం:—[సంతోష బాష్పములతో] పుత్రీ! రమ్ము! రమ్ము!

మాల:—హా! భగవతియా? [అడుగులఁ బడుచున్నది.]

కామం:—[లేవనెత్తి కౌఁగిలించి శిరస్సుమూర్కొని.]

ఆ. వె. బ్రదుకవమ్మ నీవు ♦ బ్రదికింపవమ్మ నీ
ప్రాణసముని వాత్తియుఁ ♦ బ్రాణసఖుల;
హిమసుశీతలాంగ ♦ కములఁ గౌఁగిలఁజేర్చి
నేదదేర్పవమ్మ ♦ చెలిని, నన్ను. ౧౮

మాధ:—వయస్యా! మకరందా! మాధవున కిప్పుడీ జీవలోకము పాదేయమైనది.

మక:—[సహాస్యముగా] ఇది యిట్టిదే.

మద: లవం:—ప్రియసఖి! నిన్నుఁ దిరిగిచూడ మనుకొంటిమి గదే? మమ్ముఁ గౌఁగిలించి యాదరింపవే!

మాల:—హా! ప్రియసఖులారా! [అని యిరువురను కౌఁగిలించుకొనుచున్నది.]

కామం:—వత్సలారా! యేమిటిది?

మాధ:-మక:—దేవీ!

పంచ. కపాలకుండ లాగ్రహంబు ♦ గ్లఁజేసినట్టి యీ
యపారవు న్విపత్తునుండి ♦ యీమహాత్మురాలు మే
మపాయ మొందకుండఁగా ను ♦ పాయ మొప్ప సత్కృపా
ప్రవృత్త బుద్ధిపూని మమ్ముఁ ♦ బట్టి యుద్ధరించెగా. ౧౯.

కామం:—అఘోరఘంటునిఁ జంపుటచేతనే నాయింతపుట్టినది?

లవం:-మద:—ఓహో! యేమి యాశ్చర్యము! దైవయోగము తొలుత నెంత దారుణమై చివర కెంతరమణీయమైనదో!

సౌదా:—[ప్రవేశించి] భగవతీ! యిదిగో నీపూర్వశిష్యురాలు ప్రొక్కుచున్నది.

కామం:—ఓహో! సౌదామిని! కళ్యాణము!

మాధ:-మక:—ప్రథమశిష్యురాలైన యీ సౌదామినియెడ భగవతి కెంత పక్షపాతమో! అందుచేతనే యీమె యింతటి మహాత్కార్యముచేయుట తటస్థించినది.

*కామం:—

సుగంధి. రావెయమ్మ! రావెతల్లి ♦ రావె ప్రొక్కులేటికే
రావె నన్నుఁ గౌఁగిలించి ♦ రంజిలంగఁ జేయవే
యీవు నేఁడుఁజూచుకొంట ♦ యెన్నినాళ్ళకబ్బెనే
జీవమిచ్చి మంత్రికిం బ్ర ♦ సిద్ధపుణ్యవైతివే. ౨౦.

---

* ఉత్సాహ. రమ్మ! రమ్మ! భూరివసువు ♦ ప్రాణమిచ్చి పుణ్యభా
రమ్మ! మాట గట్టుకొన్న ♦ ప్రణయభావసేవధీ!
అమ్మ! నిన్నుఁ గంటనేటి ♦ కబ్బెఁ; జేఁజెలంగ మో
దమ్మునం గవుంగిలింపు ♦ తక్కుమేల ప్రొక్కఁగన్.
మూలము నెక్కువగా ననుసరించిన పాఠము.

మఱియు,

మ. అలనాఁడైన ప్రమాణబీజము భవ ♦ ద్వ్యాపార పారీణతన్
ఫలియించెం గదు; ముచ్చటయ్యెడును నీ ♦ ప్రజ్ఞల్ గనుంగొన్న : లో
కులకు న్నియతిబోధి నత్వమహిమల్ ♦ కొండంతలై యీఁగతిన్
దెలియఁగాఁ బడియెన్ కుమారి! జగతిన్ ♦ నీవేసుమీ వంద్యవున్.

మద:_లవం:—ఆ మహానుభావురాలు సౌదామిని యీమె యేనా?

మాల:—ఈమెయే. నన్నీమె భగవతి కామందకి యాదరించి నట్లే యాదరించి కపాలకుండల నదలించి నన్ను విడిపించితెచ్చి తన యింటిలోఁ బెట్టుకొని యోదార్చినది. ఇంతేకాక నే నాఘవాలిచ్చిన పొగడ పూదండను జేతఁబట్టుకొని యిందులకు వచ్చి మిమ్ము నందఱ నుద్ధరించినది.

మద:_లవం:—మాచిన్న భగవతికి మామీఁదఁ బూర్ణానుగ్రహమున్నది.

మాధ:_మక:—ఆహా!

క. చింతింపం బడకుండం, జింతామణియైన మేలు ♦ సేకూర్చెను దా
వింతగద యింతమేలు న,చింతితముగ మనకు నీమె ♦ సేయుట చూడన్.

సౌదా:—[తనలో] అయ్యో! వీరి యత్యంతసౌజన్యముఁ జూచి నాకు బిడియమగుచున్నది. [ప్రకాశముగా] దేవీ! ఇదిగో నందనుఁ డపరిమితానందముతో రాజుగారినిఁ బ్రార్థింపఁగాఁ బద్మావతీశ్వరుఁడు భూరివసువు సమ్మతమంచు చిరంజీవియగు మాధవునిపేర లిఖించిపంపిన యుత్తరము. [అని యుత్తరమిచ్చుచున్నది.]

కామం:—[పుచ్చుకొని చదువుచున్నది] "స్వస్త్యస్తు"!

చ. "ఘనగుణ సంపదం బ్రథమ ♦ గణ్యుఁగులీను, నిరస్త దుస్తముల్
ఘను నిను నల్లునిం బడయఁ ♦ గంటిని; గంటి ముదంబు; గావునం
దనరఁగఁ బూర్వరాగ ఘటి ♦ తల్ మదయంతిని పైత మిప్డు ని
న్నెనసినయిష్టమిత్రునకు ♦ నిత్తును వెండియు నీకుఁ బ్రీతిగల్." ౨౩.

[మాధవు నుద్దేశించి సహర్షముగా] వత్సా! వినుము.

మాధ:—విన్నాఁడను, సర్వవిధములఁ గృతార్థుఁడనైనాఁడను.

మాల:—అదృష్టవశమున హృదయమును బాధించుచున్న యీ శంకాశల్యముగూడ నిప్పుడు లాగివేయఁబడినది.

లవం:—ఇప్పుడు మాధవునికోరికలు సంపూర్ణముగా నీడేరినవి.

మక:—[ముందువైపుచూచి] ఓహో! అవలోకితా బుద్ధరక్షీతలలాగున్నారు. కలహంసుఁడుగూడఁ గనఁబడుచున్నాఁడు. వీరు దూరమునుండియే మనమందఱ మిందుండుటఁ జూచి సంతోషముతో నెట్లు గంతులువేయుచు వచ్చుచున్నారో!

[తరువాత అవలోకితా బుద్ధరక్షీతలును గలహంసుఁడును
ప్రవేశించుచున్నారు.]

[అందఱు వేఱువేఱుగా నృత్యముచేసి సమీపించి ప్రణమిల్లి కామందకి నుద్దేశించి] జయభగవతి! కార్యసిద్ధానే! [మాధవు నుద్దేశించి] జయమకరందనందన! మాధవపూర్ణచంద్ర! భాగ్యశాలివై వర్ధిల్లుచున్నావు! [అందఱును జిఱునగవుతోఁ జూచుచున్నారు.]

లవం:—ఈమహోత్సవ సమయమందు సంతోషముచే గంతులువేయనివా రెవరు?

కామం:—నిజమే. ఈవిధముగా మహాద్భుతమై విచిత్రమై రమణీయమై యుజ్జ్వలమైన ప్రకరణ మెందైనను గలదా?

సౌదా:—ఇందులో నెక్కువ రమణీయమిది. మంత్రి భూరివసుదేవరాతులకుఁ దామిరువురు వియ్యమందవలెనని చిరకాలమునుండి యున్న కోరిక సంపూర్ణముగా నెరవేరుట.

మాల:—[తనలో] ఇది యెట్లు?

మక:—మాధ:—[కౌతుకముతో] దేవీ! జరగినది యొకటియు దేవి సెలవిచ్చినది యొకటియును.

లవం:—[జనాంతికముగా] ఇప్పుడేమి సదుత్తరము చెప్పఁదగినది?

కామం:—[తనలోఁ బెడమొగముగా] ఇప్పుడు మదయంతికతోడి సంబంధము స్థిరపడినందున నందనునకుఁ గోపమువచ్చునేమో యను శంక మనకు వదలిపోయినది గదా? [ప్రకాశముగా] వత్సలారా! జరగిన దొకటియు నీబిడ చెప్పిన దొకటియుఁగాదు. ఏమన వారిరువురును జిన్నప్పుడు విద్యార్థి యవస్థలో నీసౌదామినియెదుటనే "మనమవశ్యము వియ్యమందవలయు" నని ప్రతిజ్ఞ చేసికొనిరి. ఇంక రాజు యొక్కయుఁ రాజపురుషునియొక్కయుఁ గోపమీవిధముగాఁ బరిహరింపఁబడ్డదిగదా?

మాల:—ఓహో! ఇదియంతయు నాకారగోపనమా?

మాధ:—మక:—ఓహో! ముందొడఁబాటును వెనుకఁ దడఁబాటును! ఎట్లననేమి మహాత్ములు కృతార్థులైనారు. ప్రత్యయవంతు లెప్పుడును గళ్యాణవంతులు.

కామం:—వత్సా!

మాలిని. కోరికదీఱ ఘటిల్లినదీవలఁ ♦ కుంజరజీవుల పెండ్లియొగిన్

వారల పుణ్యమునన్ వసుతి నాజత♦నంబున శిష్యుల క్లేశములన్

నేరుపుమై మదయంతికయిప్పుడు♦నీసఖుతోడను గూర్పఁబడెన్.

భూరిముదంబున నందఁగఁగల్గిరి♦భూరమణుండును నందనుఁడున్.

ఇంకను గోరఁదగినది కోరవచ్చును.

మాధ:—[సంతోషముతో] నాకింతకన్నను గావలసినదే మున్నది? అయినను భరతవాక్య మిట్లుండుఁగాక!

మంగళమహాశ్రీ.

మంగళముగావలెన • మస్తభువనంబులకు • మానవులు పరహితచింతా సంగులయిము క్తకలి • సంగులయినందభి • మంగులయివర్ధిలవలెన్! మే ల్మంగరహితఁపుఁ బ్రతి • భంగరముధర్మపరి • పాలనము సేయవలె రాజుల్! పొంగఁ బ్రజలుల్లమునఁ • బుష్కలనువృష్టికలు • వుల్ దతిమియావలె సుఖంబుల్.

మ. మగనిం గ్రొత్తగఁ జేర్ప నెంచిమగువల్ • మానొప్పఁగై సేసి యా సౌగసుం జిన్నెలువన్నె లద్దుగఁ • సొంపెక్కఁగా దిద్దు ప్రౌ ఢగతింబూని పునః పరిష్కృతము నా • ట్యంపుం బ్రబంధంబు దీ నిఁగడున్ మచ్చికనాదరింప బుధులన్ • జేయొగ్గి ప్రార్థించెదన్.

గద్యము. ఇది శ్రీజనమంచి వంశపావన బ్రహ్మనధాని తనూభవవిబుధ విధేయ వేంకటరామ నామధేయాంధ్రీకృతంబైన మాలతీమాధ వంబను మహాప్రకరణంబునందు సర్వంబును

దశమాంకము—సంపూర్ణము.

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

కైలాసవాసి

# జనమంచి వేంకటరామయ్యగారి గ్రంథములు

శ్రీ వేంకటరామయ్యగారు తెలుగులో కవి, పండితుడు, కావడమే కాక ఆంగ్లములో మంచి కావ్యపరిచయము, వారి సంస్కృతికిగాను పెద్ద సంపత్తి.

వారి కావ్య రచన, సరళము, ధారాళము, ప్రసన్నము; సౌమ్య సుందరమైన భావములతో అలరారుతూ ఉంటుంది.

తర్జుమాలలో అది స్వతంత్రరచనయేమో అనిపించే సామగ్రి, వీరియొడ కన్పట్టేది, తరుచుగా దొరకదు.

...............భారతి.

# వూ

[ఖండకావ్యములు] మద్రాసు విశ్వకళాపరిషత్తువారి విద్వాన్ పరీక్ష
1938 పాఠ్యగ్రంథము 1—4—0

# ఆంధ్రీకరణములు.

భవభూతి—మాలతీమాధవము 1—4—0

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి బి. యే. II. 1938 పరీక్ష,
పాఠ్యగ్రంథము
భవభూతి—ఉత్తరరామచరితము 1—4—0
రాజశేఖరుని—విద్ధసాలభంజిక 1—0—0
కాళిదాసు—మేఘసందేశము 1—0—0

జనమంచివారు, రాజమహేంద్రవరము.

